# భారతి

డిసెంబరు 1968






వ్యవస్థాపకులు

దేశోద్ధారక నాగేశ్వరరావు పంతులు

వెల ఒక రూపాయి

# భారతి

మాసపత్రిక



సంపాదకుడు:

శివలెంక శంభుప్రసాద్



డిసెంబరు 1968



సంపుటము : 45 : సంచిక : 12 :

విడిప్రతిక వెల ఒక రూపాయి

# విషయానుక్రమణిక

## డిసెంబరు 1968

# అర్ధరాత్రి

శ్రీ పరిగి రాధాకృష్ణ

అరుపులూ ఆక్రోశాలూ అలజడులూ
తాత్కాలికంగా శమించి
వేదన అజ్ఞాతమై
అంతర్ముఖంగా పయనించింది
మనిషిలోని పశువు బయటపడింది
శిశువు మూర్ఛిల్లింది.
వాగి వాగి స్తబ్ధమైన
హిస్టీరియా పేషెంట్‌లా లోకం.
జాలీ భయమూ బాధా
ముప్పిరి గొన్న అవసా సూచకం నిశ్శబ్దం !
అర్ధరాత్రి ఇది.
అంతరంగాల్లో అట్టడుగున కదిలే
అనుభూతులు సులువుగా బయటికి రాలేక
పంజరాల్లోని చిలుకల్లా
పరితపిస్తున్న సమయం.
తమోమందిరంలో జరిగే తమాషాలు
సంస్కారాన్ని పెంచేవిగా లేవు.
సాంప్రదాయాన్ని నిలబెట్టేవిగా లేవు.
అంతా అర్థమయినట్టనిపించి
అంతా బాగున్నట్టు భ్రమింపజేసి
అయోమయాన్ని సృష్టిస్తున్న సన్నివేశాలు.
జీరో అవర్
జీవితంమీద మత్తుమందు చల్లింది.
ఎగబడుతూ వచ్చిన కడలి అల
ఎలాంటి సవ్వడిలేకుండా వెనుదిరిగినట్టు

రోజంతా రేగిన ఉధృతం
క్రమంగా జీరో అయిన రాత్రి,
మనిషి మొహం మీద
మలినమైన హాసాన్ని
చీకటి జాగ్రత్తగా కాపాడింది !

విషాదం రాజ్యం చేస్తున్న సంగతి
నిషాలేని కళ్ళకే కనిపిస్తోంది.
విషవలయంలో చిక్కుకున్న సంగతి
వేళమించాక తెలుస్తోంది.
అవిశ్వాసపు సందిట్లో నలిగి
నోరు విప్పలేని ఆశ
అసహాయతను ఆహ్వానించింది.
గుండెకు పడ్డ గండ్లు మూసే ప్రయత్నమేది ?
ఎండిన మోడును చిగురింపజేసే చైతన్యమేది?
సహనాన్ని వాకిట్లో నిలబెట్టి
స్వప్రయోజనంతో కులుకుతుంది జీవితం.
పోగొట్టుకున్న విలువను
మళ్ళీ పొందాలనే తపనలేదు.
ఎడారి కళ్ళముందు నిలిచినా
గుర్తించే ఓపికా తీరికా లేవు.
నాకేదో పట్టుదల
కసాయివాని కత్తికి
కరుణరసం పూయాలని
క్రమబద్ధంకాని జీవితాలకు
పసరుపూసే ప్రయత్నం చేయాలని
జీవితంలోకి జొరబడుతున్న
వక్రరేఖల చివర్లు చూడాలని
మనుగడను మలిన పరచా
మహానుభావులకోసం
కాగడా వేయాలని
నాకేదో పట్టుదల.

# అర రా

సమస్యల్లో సతమతమవుతున్నా
సాగుతూనేవుంది సృష్టి
సవ్యంగానో అపసవ్యంగానో!
కల్మషాల కీచురాళ్ళు
విజృంభించాయి ఈ అర్ధరాత్రి.
సహనానికీ సాహసానికీ
రోజు రోజుకీ పరీక్షాపత్రాలెదురవుతున్నాయి
రజ్జు సర్ప భ్రాంతిలో రాత్రంతా
భయం భయంగా గడుస్తోంది.
ఈ పరీక్ష గడిచి గట్టెక్కాలి.
ఈ భ్రాంతి తొలగి కాంతి విరియాలి.
రాత్రి గడిచి రవిబింబం కనిపించాలి.
ఈ చీకట్లోంచి వెలుగులోకి పయనించాలి.
ఈ అయోమయం చివర నిల్చిన
ఆనందాన్ని అనుభవంలోకి తెచ్చుకోవాలి.



# రేనాటి చోళులనాటి ఆంధ్రుల సాంఘిక చరిత్ర

శ్రీ బి. ఎన్. శా

విష్ణుకుండిను లాంధ్రదేశము నేకచ్ఛత్రాధిపత్యము క్రింద పాలించుచున్నకాలమున కృష్ణానదీ దక్షిణ ప్రాంతములను కొందరు మాండలిక రాజులు పాలించుచుండిరి. అందు ముఖ్యముగా రాయలసీమలోని కడప, చిత్తూరు, అనంతపురం మండలములను రేనాటి చోళులు, వైదుంబులు పాలించిరి. ఈ వంశీయులు వేయించిన శాసనములు తెలుఁగుభాషలో నున్నవి. బాణరాజులు, వైదుంబులు తెలుఁగువారు. మొట్ట మొదట తెలుఁగుభాషలో శాసనములు వేయించిన కీర్తి రేనాటిచోళులకు దక్కినది.

చైనా యాత్రికుఁడగు హ్యూన్‌త్సాంగ్ క్రీ. శ. ఏడవ శతాబ్దమున భారతదేశమును దర్శింపవచ్చెను. అతఁడు దక్షిణాపథమున పర్యటించు సందర్భమున ఆంధ్రదేశమువచ్చి, సుప్రసిద్ధములైన, అమరావతి, నాగార్జునకొండ బౌద్ధక్షేత్రములను దర్శించెను. అతఁడు 'చులియ'దేశమును చూచినట్లు తెలియుచున్నది. చులియదేశము ధాన్యకటకమునకు నైఋతి దిశలో నున్నది. చోళ వంశీయులు పాలించిన దేశము చోళదేశము. హ్యూన్‌త్సాంగ్ చోళ శబ్దమును 'చులి య'గా పేర్కొనినాఁడు. ఈ చోళవంశీయు లాంధ్ర దేశీయులు. వీరి మొదటి నివాసమగు చోళవాడి తెలంగాణములోని నేటి నల్లగొండ, మహబూబు నగరు మండలముల ప్రాంతమని ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనంగారి అభిప్రాయము.[1] ఈ వంశీయులు చోళవాడిని స్వతంత్రముగ పాలించియుండిరి. కాల క్రమమున వీరు, పల్లవ, విష్ణుకుండిన, బాదామీ చాళుక్యుల సామంతులుగ వ్యవహరించినారు. రేనాడు ఏడువేల దేశము. అనగా ఏడువేల గ్రామములున్న దేశము. రేనాటిని పాలించినవారు కావున వీరికి రేనాటి చోళులను పేరు కలిగినది.

ఈ చోళమండలము భయంకరమైన అడవులతో నిస్సారమైన భూములతో, క్రూరులైన మనుష్యులతో, దోపిడిగాండ్రతో, గూడియుండెనని హ్యూన్‌త్సాంగ్ వ్రాతలవలన తెలియుచున్నది. రేనాటి చోళులకును, దాక్షిణాత్య చోళులకును ఎట్టి సంబంధమును లేదు. ఈ రాజన్యులు తాము పాలించిన దేశమును రేనాడు ఏడువేల దేశమని శాసనములందు పేర్కొనినారు. వీరు వేయించిన శాసనమువలన వీరు కరికాల చోడుని సంతతివారనియు, సూర్యవంశీయులనియు, కాశ్యపగోత్రులనియు తెలియుచున్నది.[2] వీరికి సంబంధించిన శాసనములు కడప మండలములోని జమ్మలమడుగు, ప్రొద్దుటూరు తాలూకాల ప్రాంతములలో లభించినవి. శాసనములందు పేర్కొనబడిన రాజులలో నీ క్రింది వారు ముఖ్యులు.

ధనంజయుఁడు
చోళమహారాజా
పుణ్యకుమారుఁడు
విక్రమాదిత్య చోళమహారాజా
పృథ్వీవల్లభుడు
సత్యాదిత్యుడు

---

1. ఆంధ్రుల చరిత్ర – సంస్కృతి.
2. S. I. I. Vol X. No. 594.

ఏడవ శతాబ్ద పూర్వార్ధమున హ్యూన్‌త్సాంగ్ పేర్కొనిన చుళియదేశ మీ రేనాటి చోళుల పాలనములోనున్న దేశమే. ఈ వంశీయుల శాసనములు క్రీ. శ, 575 నుండి యున్నట్లు పరిశోధనలవలన తెలియుచున్నది. ఎపిగ్రాఫియా ఇండికా 27 వ సంపుటములో ప్రకటింపబడిన శాసనములనుబట్టి మొట్ట మొదటి తెలుగు శాసనము, ఎరికల్ముత్తురాజు ధనంజయుని కలమళ్ళ శాసనమని చెప్పవచ్చును. ఈ శాసనకాలము శ. 575.

చోళరాజులలో రెండవ కరికాలుని ... యులు, ఒరయూరు రాజధానిగా గల్గిన చోడదేశము నుండి, ఆంధ్రదేశమునకు వచ్చి స్థిరనివాసులై సామంతమాండలికులుగను, సామంతులుగను పాలించినారని కొందరి చారిత్రకుల అభిప్రాయము. కరికాలుడు పరాక్రమవంతుడైనరాజు. ఈతడు త్రిలోచన పల్లవుని యుద్ధమున జయించి, అతనిచే కావేరి నదికి గట్టులు పోయించినట్లును, పల్లవరాజుచే సేవలు గొనినట్లును తెలియుచున్నది కరికాలుడాంధ్రదేశములోని చోళవాడినుండి విజృంభించి, దక్షిణాపథ, దక్షిణప్రాంతము నాక్రమించినట్లు భావింపవచ్చును. కొందరు చోళరాజులు క్రీ. శ. 550 ప్రాంతమున పల్లవులకు సామంతులుగనుండి, కడప మండలమును పాలించిరి. పుణ్యకుమారచోళుని తామ్రశాసనమునుబట్టి, ఈ వంశీయుఁడగు నందివర్మ క్రీ. శ. 550–575 మధ్య కడప మండలము నేలినట్లు తెలియుచున్నది. నందివర్మకు, సింహవిష్ణువు, సుందరవర్మ, ధనంజయవర్మలను ముగ్గురు కుమారు లుండిరి. తండ్రి యనంతరము ముగ్గురు పుత్రులు రాజ్యమును పాలించిరి. అందు ధనంజయవర్మ కలమళ్ల శాసనమును క్రీ. శ. 575 లో వేయించెను.

సుందరవర్మ కుమారుడు పరిప్రతాపచోళుఁడు. క్రీ. శ. 575–600 మధ్య హిరణ్య రాష్ట్రమును పాలించినట్లు తెలియుచున్నది. ఇతనికి మహేంద్ర విక్రమవర్మ, ముదితశిలాక్షర, నవరామాది బిరుదము లుండెను. ఈ మహారాజునకు గుణముదిత, పొరుమ్మిళక పుణ్యకుమారచోళులను కుమారు లుండిరి. పుణ్యకుమారుడు క్రీ. శ. 600–625 మధ్య హిరణ్యరాష్ట్రమును పాలించెను. పుణ్యకుమారుని యనంతర మాతని పుత్రుఁడు విక్రమాదిత్యచోళరాజు క్రీ. శ. 625–650 వరకు పాలించెను. ఇతనికి చోళ మహారాజాధిరాజ బిరుదముండెను. విక్రమాదిత్య చోళుని పిదప, శక్తికుమారుడు క్రీ. శ. 650–675 వరకును, సత్యాదిత్యుడు క్రీ. శ. 675–700 వరకును రేనాడును పాలించిరి. సత్యాదిత్యుడు రేనాటిరాజ్య మేడు వేల గ్రామములు, సిద్ధివెయ్యి గ్రామములును పాలించెను. అతని తరువాత ఎళంచోళరాజు రేనాటిని పాలించినట్లు నల్లచెఱువుపల్లి శాసనమువలన తెలియుచున్నది. ఎళంచోళరాజు పరిపాలనాకాలము క్రీ. శ 700–725. చోళముత్తరాజు, ధనంజయ యెళ చోళరాజనువారలు గాంగ, పల్లవ, రాజుల సామంతులుగా గండికోట రాజధానిగా తెలుఁగుదేశములోని కొంతభాగమును పాలించినట్లు రైసు పండితుని వ్రాతలవలన తెలియుచున్నది. ధనంజయ ఎఱిగ చోళుడనురాజు ఎనమిదవ శతాబ్దిలో అల్వాడి 600 గ్రామముల కధిపతిగా నున్నట్లు తుంకూరు జిల్లాలోని శాసనములవలన తెలియుచున్నది.

ఆరవ శతాబ్దిలో కమ్మనాటిని చోడరాజులు పాలించినట్లు తెలియుచున్నది. వీరప్రతాపచోడుఁడు, బాపట్లలోని భావనారాయణస్వామికి, బాపట్ల, ఆముదాలపల్లి గ్రామములను క్రీ. శ. 593 లో దానమిచ్చినట్లు లోకల్ రికార్డులలోని బాపట్ల కైఫియత్ వలన తెలియుచున్నది. కడప ప్రాంతమును పాలించిన పరిప్రతాపచోడుడే వీరప్రతాప చోడుడని చారిత్రకులు నిర్ణయించినారు.

పరిప్రతాప చోడుని తరువాత, ఎరియరు, విజయకామ, పిరార్జున, అగ్రణిపిడుగు, కొక్కిలి మహేంద్రవర్మ ఎళచోళ, నృపకామ, దివాకర, శ్రీకాంత చోళులు పాలించినట్లు శ్రీకాంతచోళుని శాసనములవలన తెలియుచున్నది. పైన పేర్కొనబడిన రాజులు క్రీ. శ. 600–850 వరకు పాలించినారు. అటుపిమ్మట వీరు చాళుక్యుల సామంతులుగా వ్యవహరించిరి.

కడప మండలమును పాలించినవారు రేనాటి చోడులు. కాలక్రమమున వీరు పాకనాడాక్రమించి చిన్న చిన్న కుటుంబములుగా చీలి, రాజ్యములను

స్థాపించి, పాలించినారు. వీరిలో రేనాడు, పొత్తపి నాడు, కొణిదెన, నెల్లూరు, ప్రాంతములను పాలించిన చోడవంశీయులు ప్రసిద్ధులు—

రేనాటిచోడులకాలపు ఆంధ్రుల సాంఘిక చరిత్ర కారాజన్యులు వేయించిన శాసనములును, వైదుంబరాజుల కాలమున వెలసిన శాసనములును ముఖ్యములు. వీరి శాసనములలో నాంధ్రభాష స్థాన మాక్రమించి, ప్రాకృత ప్రభావయుతమై, తెలుఁగు భాష ప్రాథమికదశను సూచించును. ప్రాకృత పదములతో కలిసియున్న తెలుఁగు పదములు, వింతవింత రూపములతో కనిపించి, ఆంధ్రభాషావికాస పరిణామమును సూచిఁచును.

## పరిపాలనా విధానము

రేనాటి చోడులు స్వతంత్రముగ కడప, చిత్తూరు మండలములను పాలించినను కొంతకాలము, విష్ణుకుండినులకు, పల్లవులకు, చాళుక్యులకు సామంతులుగను వ్యవహరించిరి. ఈ వంశీయులు పాలించిన కాలమునం దాంధ్రదేశము సుభిక్షముగ నుండెను. ప్రజలు సుఖమయజీవనమును గడుపుచుండిరి. వీరు సూర్యారాధకులు. చోడమహారాజు ఆజ్ఞగొని, తేయమయ్యరు సూర్యగ్రహణ నిమిత్తమున సూర్యునికి దేవాలయము నిర్మించి, దేవభోగార ము కొంతభూమిని, ఒక గానుగును దానమిచ్చినట్లు చిలంకూరు శాసనమువలన తెలియుచున్నది.

ఆ కాలమున రాజులేకాక, సామాన్యప్రజలు, ధనాఢ్యులు, రాజోద్యోగులు, దేవాలయముల నిర్మించి, భూదానము లొసంగి శాసనములు వేయించుచుండిరి. దాత, పుత్రకళత్రసహితుడై దాన మిచ్చుచుండెను.

రేనాటిచోళుల పరిపాలనా కాలమున భూమిని వ్రితుడ్లలోను, మఱుతుడ్లలోను కొలిచెడివారు. శాసనము లొసంగునపుడు సాకులుగా, నాలుగు స్థానంబులవారు నియమింపబడుచుండిరి. పన్ను సిద్ధాయ మనబడుచుండెను. గద్యలు వాడుకలో నుండెను. వేడు వైశాఖ పూర్ణిమనాడు రైతులు ఏరువాక పున్నమి పండుగ చేసికొనునట్లు నాడు ఎవ్వోఁక పున్నమి పండుగ వాడుకలో నుండెను.[4] కొన్ని ప్రాంతములందు జ్యేష్ఠ పున్నమినాఁడు పండుగ చేసికొందురు.

దేశము మండలములుగను, విషయములుగను విభజింపబడెను. పరిపాలనా సౌలభ్యమున కిట్టి విభజనము గావింపబడి, విషయములు, మండలములు గ్రామములుగా విభజింపబడెను. గ్రామములందు రట్టొడ్లు లేక రాట్టులు, లేక రెడ్లు ప్రాముఖ్యము వహించుచుండిరి. వీరు గ్రామములందుగల రైతులనుండి భూమి పన్ను వసూలుచేసి రాజు కోశాగారము చేర్చుచుండిరి. రట్టొడ్లు, వారి భార్యా పుత్రులును శాసనములను వేయించుచుండిరి. 'తురుమునూడ్ల బాదెయ రట్టొడ్లు గుడ్లుఎత్తిఇచ్చేరి వారి పెణ్డంబు మారకణ్డరు, వారి కొదుకు చాముణ్డయ పత్యాభిమాని పెట్టిఇచ్చె పాసనబిదిగల్లు' అని శాసనమందున్నది.[5] ఆ కాలమున శాసనములను విశ్వబ్రాహ్మణులు, అనగా పంచాణము వారిలో నొకరగు కమ్మరులు వ్రాయుచుండిరి. శాసన లేఖకుడు లేక శిల్పి అని ఇతనినందురు. రేనాటి చోళుల శాసనములలో నొక శాసనాంతమున 'విరిపఱితి కమ్మరి వినియణ వ్రాసె'[6] అని యున్నది.

బ్రాహ్మణులకుగాని దేవాలయములకుగాని దానమిచ్చిన భూమిని 'పన్నశ'[7] అని పిలుచుచుండిరి. నేడు వాడుకలో నున్నట్లు పొలమును 'చేను' అనుచుండిరి. రాచమానమగు మఱుతుడ్లలో భూమి కొలువబడుచుండెను. మఱుతుడ్లు కొన్ని శాసనములలో 'మఱుతులు', మఱుతురులు, మఱుత్తులు అనియు ప్రయోగింపబడినది.

రేనాటి చోళులు పాలించిన కాలమున జరిగిన యుద్ధములలో వీరు లొకరి నొకరు కత్తులతో పొడివికొని మరణించిన సంఘటన లెక్కువగా జరిగినట్లు శాసనములవలన తెలియుచున్నది. యుద్ధ

3. S. I. I. Vol X No. 593.
4. S. I. I. Vol X No. 595.
5. ,, ,, No. 598.
6. ,, ,, No. 599.
7. .. ,, No. 604.

మున మరణించినవారు స్వర్గలోకము పోవుదురను నమ్మక మానాడు ప్రజలలో వ్యాపించియుండెను.[8]

'శ్రీ గణ్డసజ్కలియ్యమ అది కొ అనడిప్పచీరెయ్య, వళ్లిపప్ప యెళునాను చోడుళతోడ పొడిచ్చి వీర లోకమ్బేగె.'

కొన్ని శాసనములందు 'సోరవాడి'అను పదము వాడబడినది. చోళవాడి అనుటకు బదులు సోరవాడి, సోరమడి అనియు శాసనములందు కనిపించుచున్నది.[10] పురుషులకు 'కుళ్లమ్మ' 'రెసె అళుకున్బుళు' అను పేళ్లుండెను. చమూపతిని సేనాపతియని పిలుచుచుండిరి [11]

వైదుంబరాజులును రేనాణ్డుడువేలు పాలించినవారు. రేనాటిచోళుల యనంతరము కడప, చిత్తూరు మండలములను వీరు పాలించినారు. వీరి కాలమున వెలసిన శాసనములలో నధికముగా యుద్ధములకు సంబంధించినవి కలవు.[12]

రేనాటిచోళులు, వైదుంబులు యుద్ధములందద్వితీయ బలపరాక్రమ శౌర్యధైర్య సాహసోత్సాహములను ప్రదర్శించినారు. వైదుంబరాజు లనేక సమర సంఘట్టనములందు విజయులైనవారు. ఈ రాజన్యులు పరిపాలనాదక్షులు. రేనాణ్డుడువేల నేల పాలించినవారు కావున, వీరికి సంబంధించిన శాసనములుకూడ, కడప, చిత్తూరు మండలములందు కనిపించుచున్నవి.

రాజు దైవాంశసంభూతుడనియు, మానవాతీతుడనియు, ఆ కాలపు ప్రజలు భావించుచుండిరి. రాజు సార్వభౌముఁడు. పృథ్వీపతి. అశ్వమేధము లాచరించుటకు దగినవాఁడు. రాజ్యమునకు సర్వాధికారి. నిరంకుశుఁడని హిందూమత ధర్మ పౌరాణిక గ్రంథములు పేర్కొనుచున్నవి. రేనాటి చోళులు, వైదుంబులు చిన్నచిన్న రాజ్యములను పాలించినను, చక్రవర్తికిగావి, మహారాజాధిరాజులుగాని సామంతులుగ వ్యవహరించినను స్వతంత్రముగనే పాలించిరి. రాజు సప్తాంగముల రక్షించుచు, చతుర్విధోపాయముల నెఱింగి రాజ్యమును రక్షించుచు, తనకు శత్రువులెవరో, మిత్రులెవరో తెలిసికొని ప్రజాభీష్ట ప్రకారము రాజ్యము చేయుచుండెను. అంతియేకాక, రాజ్యమున ఏ వ్యక్తి రాజ్యరక్షణమున కర్హుడో, సామంత రాజులలో ఎవరెట్టివారో, మాండలికులలో ఎవరెట్టివారో వారి వారి మనస్తత్వము లెట్టివో రాజు తెలిసికొని యుండవలెను. రాజున కాయుధములే తెలివితేటలు, సప్తాంగములు శరీరము, పని రహస్యము రక్షణము. రాజప్రతినిధులు కండ్లు, ప్రజలు ముఖము, మంచి నడవడి జీవితముగా భావించి సామ్రాజ్యమున సుఖశాంతులు వర్ధిల్లుటకు దోడ్పడుటయే రాజు తన ధర్మముగా భావింపవలయునని శాస్త్రములు చెప్పుటవలన హైందవరాజులా శాస్త్రముల ప్రకారము రాజ్యపరిపాలనము గావించుచుండిరి.

రేనాటి చోళులాంధ్ర దేశమును పాలించుచున్న కాలమున దేశము మండలములుగా విభజింపబడి ఆయా మండలములను పాలించుటకు మండలాధిపతులు నియమింపబడుచుండిరి. రాజులు, మంత్రులు, మండలాధిపతులు వంశపరంపరముగా వచ్చుచుండిరి.

రాజులు, మంత్రులు, సామంతులు, మండలాధిపతులు, రాజకీయ రహస్యములనుదాచి, ప్రజాక్షేమమునుగోరి పరిపాలనము చేయుచుండిరి. మంత్రులు వీరులుగాను, తత్క్షణ కర్తవ్య నిర్వాహకులుగను, సకల శాస్త్రపారంగతులుగను నుండెడివారు. మంత్రులలో ప్రధానామాత్యుఁడు సామ్రాజ్య రక్షకుడుగా, శత్రు రాజుల మనోభావముల నెఱింగినవాడుగా, సామ్రాజ్య భారవాహకుడుగా, అనేక సద్గుణములు కలిగి సకల శాస్త్ర పారంగతుడై యుండెను.

కార్యఖడ్గధురంధరుడు, చమూపతి, ధనాధ్యక్షుడు లేక కోశాధికారి, మహామాత్యుఁడు, అమాత్యుడు, దండనాయకుడు మున్నగువారు రాజ్యమున అధికారులు. వీరు రాజు ఆజ్ఞలకు లోబడి పరిపాలనా వ్యవహారములు చూచుచుండిరి. కొందరు మంత్రులకు, ప్రధాని లేక ప్రెగ్గడ అను పేళ్లుండెను. రాజు, మంత్రిమండలికి అధ్యక్షుడుగా వ్యవహరించెడివాడు. సంధివిగ్రహి అను యుద్ధమంత్రియు, సంధి

---

8. S. I. I. Vol X No. 621.
9. ,, ,, No. 628.
10. ,, ,, No. 629.
11. ,, ,, No. 63/.
12. ,, ,, No. 639.

విగ్రహముఖ్యు డనువాడు యుద్ధముఖ్యమంత్రిగను వ్యవహరించుచుండిరి. ధనాధ్యక్షుడు, కోశాధికారి, కొట్వారి, భండారి అనువారు రాజభాండాగార రక్షకులు. శాసనము లిచ్చునపుడు రాజు, మంత్రి పురోహిత సేనాపతి యువరాజ రాష్ట్రకూట ప్రముఖ కుటుంబములవారి సమక్షమును కోరుచుండెను.

రేనాటిచోళులు పాలించు కాలమున గ్రామ పరిపాలన మత్యంత పటిష్ఠముగ నుండెను గ్రామములలో నధికారులుగా, గ్రామణి, రట్టోడి లేక రట్టుడ్లు, రాట్ లేక రెడ్లు నియమింపబడుచుండిరి. తలారి గ్రామరక్షకుడుగ వ్యవహరించుచుండెను. దుర్గములుగల నగరములు, నగరాధ్యక్షునిచేగాని దుర్గాధ్యక్షునిచేగాని పాలింపబడుచుండెను. ప్రజలు, సైనికులు, వ్యాపారులు, ప్రభుత్వము, ప్రజాహిత కార్యములను నిర్వహించుచుండిరి.

## సైనిక వ్యవస్థ

రాజ్యమునకు సైన్యము ముఖ్యమైనది. కేంద్రవ్యవస్థ, మాండలికవ్యవస్థ, సామంత సైనిక వ్యవస్థ లుండెను. సైనికులు, దండనాయకులు, సైన్యాధ్యక్షులు సామ్రాజ్యరక్షణభారము వహించుచుండిరి. దుర్గాధ్యక్షులు, సామంతమాండలికులు, యుద్ధసమయములందు, తమ సైన్యమును రాజుకు సహాయముగా పంపుచుండిరి. దండనాయకులకు, చమూపతులకు జీతబత్తెముల క్రింద, సైన్యమున కగు వ్యయము క్రింద రాజు భూములనిచ్చుచుండెను. సేనానాయకుల ప్రశంసనీయమైన సేవలకు ప్రతిఫలముగా రాజు వారికి విశాల భూభాగముపై సైన్యాధిపత్య మొసంగుచుండెను. కొందరు మంత్రులు సేనానాయకులుగను వ్యవహరించుచుండిరి. సంధివిగ్రహి, సేనాధిపతి, కార్యఖడ్గ ధురంధరుడు. సమస్త సేనాధిపతి లేక సర్వసైన్యాధ్యక్షుడు సైనిక వ్యవస్థలో ముఖ్యమైన అధికారులుగ నుండిరి.

## ప్రజాహిత కార్యములు

రేనాటి చోళుల కాలమున తటాకములు నిర్మింపబడి కాలువలు త్రవ్వింపబడినవి. చెఱువులు, కాలువలు త్రవ్వించుట హిందూమత సంప్రదాయము ప్రకారము సప్తసంతాన ప్రతిష్ఠలలో చేరును. రాజులు చెఱువులు త్రవ్వించి దేవాలయముల కొసంగి, ఆ చెఱువు నీటితోపారుపొలములను, బ్రాహ్మదేయములుగను, దేవభోగములుగనుచేసి దానమిచ్చుచుండిరి.

భూమిపైవచ్చు పన్ను ఆదాయములో ముఖ్యభాగము కావున రాజులు వ్యవసాయాభివృద్ధికి కృషి చేయుచుండిరి. రాజ్యమునగల భూమి, వ్యవసాయ యోగ్యము, వనములు, తోటలు, బీళ్ళు అను విభాగములుగ నుండెను. రాజు లేక మంత్రి సామంతాదులు, ధనాఢ్యులు, భూస్వాములు, దేవాలయములకు, బ్రాహ్మణులకు, భూమి దానము చేయుచుండిరి. దేవభోగములకు, బ్రాహ్మణులకు ఇచ్చిన భూములపై పన్ను లేకుండెను. ప్రజలు సుఖముగానున్నను యుద్ధములు విశేషముగా నున్నట్లు తోచుచున్నది. రేనాటి చోళులు పాలించిన కాలములోను, వైదుంబుల కాలమునను, చిన్నచిన్న సామంతరాజ్యములు, కడప, చిత్తూరు అనంతపురం జిల్లాలలో నుండెను. ఆరేడు శతాబ్దములలో విష్ణుకుండినులు, తూర్పు చాళుక్యులు, పల్లవులు, ఆంధ్రదేశమున ఆధిపత్యమునకై పోరాడుచున్న సమయమున రేనాటి చోళు లాంధ్రదేశములోని కొన్ని భాగములను పాలించుచుండుటనుబట్టి, వీరు సామంతులతోను, మాండలికులతోను, యుద్ధములు చేయవలసి వచ్చెను. ఐనను ప్రజోపయోగ నిర్మాణములం దీరాజు లాసక్తి జూపిరి.

## మతము

రేనాటిచోళులు పాలించిన కాలమునం దాంధ్రదేశమున వైదికమతము వృద్ధిజెందినది. విష్ణుకుండిన ప్రభువులు వైదికమతానుయాయులై యజ్ఞయాగాది క్రతువు లాచరించుచున్న కాలమున రేనాటి చోళులు వైదికమతమును వృద్ధిపరచినారు. ఈ కాలమున శైవమత మాంధ్రదేశమున వ్యాపించెను. విష్ణుకుండిన నాలుగవ మాధవవర్మ ఏకాదశాశ్వమేధాది క్రతువులు నిర్వర్తించుచుండ కడపమండలప్రాంతములను పాలించు రేనాటిచోళులు హిందూమతానుయాయులై వైదికమతోద్ధరణకు పాటుపడినారు. వీరు పల్లవులకు, విష్ణుకుండినులకు, తూరు

చాళుక్య ప్రభువులకు సామంతులుగ వ్యవహరించుటను బట్టి వారివలెనే వైదికమతము నాదరించి, దేవాలయములకు, బ్రాహ్మణులకు అగ్రహారముల నొసంగినారు. చోడమహారాజు రేనాటిని పాలించు సమయమున 'రేయమయ్యరు' అను నతడు సూర్యగ్రహణ నిమిత్తమున సూర్యునికి ఒక దేవాలయమును నిర్మించి, చోడమహారాజు ఆజ్ఞగొని, సిఱుమూర, ఆ ఆలయమునకు కొంతభూమిని, ఒక గానుగును దానమిచ్చినట్లు తెలియుచున్నది.

'......................సిఱుమూర
రేయమయ్యరు ఆదిత్యగ్రిహంబు
నిల్పి శూర్య్యగ్రహన నిమిత్తంబున
చోడమహారాజు వేణ్డికొనియా
.........భటరలకు నిచ్చిన దియ్యారి పడుమ
.........ణ యుత్తరంబున రాజమానం......
ప్రితుడ్లు నేలయు నొక్కొ గానుగు
నిచ్చిన దీనికి వక్రంబు వచ్చినవారు......'[18]

సూర్యారాధన మానాడు విశేష వ్యాప్తిలో నుండెను. రాజులు, దండనాథులు, సూర్యదేవుని కాలయములు నిర్మించిరి. ఆలయమున నిత్యారాధన, నిత్యసేవలు, ధూపదీప నైవేద్యములకు, అంగరంగ భోగములకుగాను, భూదానము చేయుచుండిరి. గ్రామములందుగల అధికారులు ముఖ్యముగా రెడ్లు లేక రట్టొడ్లు దేవాలయములను నిర్మించుచుండిరి. వారి పతులు సుతులు శాసనములు వేయించుచుండిరి. బాదెయ్య రట్టొడ్ల భార్య మారకణ్డరు, వారి కొడుకు చాముణ్డయ శాసనమును వేయించినట్లు తెలియుచున్నది.[14] అనగా సామాన్యులైన గ్రామాధికారులు, రట్టొడ్లు, దేవాలయములను నిర్మించుచుంతటి భాగ్యవంతులై యుండిరనియు, దైవభక్తి, పాపభీతి, పుణ్యకార్యాచరణమునందుత్సాహము కలిగియుండిరనియు భావింపవచ్చును. వసన్తపోతి చోళమహాదేవి, వసన్తీశ్వరంబున వసంతీశ్వరునికి 300 మర్తురువేల, రెండు తోటలు, నివిపర్తి లోను, 12 మర్తులనేల వావ పోతుల ముచ్చియకు, దైవమునకు సేవలొనర్చుట కొసంగినట్లు శాసనమువలన తెలియుచున్నది.[15]

వల్లభ మహారాజు పాలించు కాలమున పెర్బాణ వంశీయుడగు భుజంగడి శూపాదిత్యుడు వంగమాళ్ల చరువశర్మ కుమారుడగు విన్నశర్మకు భూమిదానమిచ్చినట్లు ఆరకతవేముల శాసనమువలన తెలియుచున్నది.[16]

బ్రాహ్మణుల సైతము ధనవంతులైయుండి ప్రతిగ్రహీతలుగనేకాక, గుళ్ళు గోపురములు కట్టించుచు, దేవాలయములకు దానములిచ్చుచుండిరి. భారద్వాజ గోత్రికుడును కేచుపశర్మ కుమారుడును నగు రేవశర్మ స్వయముగా గుడి కట్టించినట్లు, కలుమళ్ళ శాసనమందున్నది.[17]

రేనాటిచోళులు పాలించినకాలమునం దచ్చటచ్చట మతయుద్ధములు జరుగుచుండెను. దేవాలయమునకు వచ్చు ఆదాయము నపహరించిన కలుగు పాపమును తెలుపుచు ప్రత్యేకముగ శాసనములు వేయింపబడినవి. దైవద్రవ్యాపహరణ మొనర్చువారుండిరనియు, అట్టివారికొఱకు ప్రత్యేకమైన శాసనములు వెలసినట్లును భావింపవచ్చును. సాధారణముగా ప్రతిశాసనాంతమున దానమును పాటించిన కలుగు ఫలము, దానముచెఱిచినవారికి కలుగు పాపఫలము చెప్పబడును. పెద్దముడియం శివాలయమునగల శాసనశకలమున[18] 'దేవస్వంబు లఖ్ఖంబు గొణ్నవాన్డు వారనాశివ్రచ్చిన పాపంబు గొణ్నువాణ్డు' అని కలదు.

చోళ వంశీయులు తొలుత నివసించిన భూమి నల్లగొండ, మహబూబునగర మండలముల ప్రాంతమని, అదియే చోళవాడియగునని ఆచార్య శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనంగారు తెలిపిన విషయమున కనుగుణముగా పాలమూరు మండలమున పదునొకండవ శతాబ్దిలో వేయింపబడిన చోడవంశీయుల శాసనములు కనిపించుచున్నవి. ఈ చోడవంశీయులు రేనాటి చోడవంశీయులలో నొక తెగవారు కావచ్చును. మహబూబునగరంజిల్లా కల్వకుర్తితాలూకాలోని రాచూరు గ్రామమునగల శివాలయమునమన్న శాసనమున ఉద

13. S. I. I. Vol. X No. 593.
14. S. I. I. Vol X. No. 598.
15. ,, ,, No. 599.
16. ,, ,, No. 604.
17. ,, ,, No. 608.
18. S. I. I. Vol. X No. 611.

యన చోడమహారాజు ప్రశంస యున్నది. శివాలయము పశ్చిమ చాళుక్యులకాలమున నిర్మింపబడినట్టిది. శాసనమున 'సూర్యవంశోద్భవకులతిలక కాశ్యపగోత్ర కరికాలాన్వయ నామాది సమస్తప్రశస్తి సహితులైన శ్రీ మన్మహామండలేశ్వర కోడూరి ఉదయన చోడ మహారాజని' వర్ణింపబడినాడు. ఈ శాసనము శక సంవత్సరము 1014 లో వేయింపబడినది. ఉదయన చోడమహారాజుప్రశంసకల శాసనము లీమండలమునందింకను కలవు. శాసనశిల నల్లగానుండి మూఁడు వైపుల మూఁడు శాసనములును, ఒకవైపు మహా నాగమును చెక్కబడినవి. ఈ మూఁడు శాసనము లింతవరకు ప్రకటింపబడలేదు. ఈ శాసనములలో నొకటి ఉదయనచోడమహారాజు ప్రశంసగల శాసనము శ. సం. 1014 లోను, శ్రీమత్త్రైలోక్యమల్ల గంగాపురము త్రిభువనమల్ల బ్రహ్మదేవరశెట్టి రెండవ శాసనమును శ. సం. 1081 లోను, రావి తొటితి పెగ్గడ మల్లిసెట్టి మూఁడవ శాసనమును శ. సం. 1081 లోను వేయించినట్లు తెలియుచున్నది. ఈ శాసన శిలయున్న ఆలయ మతిప్రాచీనమైనది. శివాలయము గర్భగుడి, మంటపము విశాలమై యున్నవి. ఆలయము ముందు ఆవరణలో చక్కని నల్లరాతితో చెక్కబడిన పెద్దగణపతి విగ్రహము మున్నది.

ఈ కాలమున దాన ధర్మములు చేయుటయందును, సప్తసంతానప్రతిష్ఠలు చేయుటయందును, ప్రజ లుత్సాహము చూపుచుండిరి. వనప్రోలు అపిమనగంగు ఒక చెఱువు నిర్మించినట్లు బూడిదగడ్డపల్లి శాసనమువలన తెలియుచున్నది.[19]

ఈ కాలమున శైవమతము వ్యాపించినది. పల్లవరాజులు, తూర్పు చాళుక్యులు వైదికమతానుయాయులై దేవాలయముల నిర్మించుచు, వైదిక పండితుల నాదరించి, పోషించి, అగ్రహారముల నొసంగుచుండుటవలన ప్రజలు తత్ప్రభావమున శైవము నాదరించుచు, శివాలయములకు భూదానము లిచ్చుచుండిరి.

జైన బౌద్ధమతముల నాదరించు ప్రజలు, ఆ మత సన్యాసుల ప్రవర్తనల ననుసరించి జైనబౌద్ధముల నిరసించి, వైదికమతావలంబులగు చుండిరి. జైన మతమం దేర్పడిన కాపాలికజైనవిభాగమువలన జైనకాపాలికుల మధుమాంస భక్షణము, కాపాలిక స్త్రీలతో విహారము, ప్రజలలో సంచలనము బయలు దేరదీసినది. ఇక బౌద్ధమునం దేర్పడిన వజ్రయాన బౌద్ధమత విభాగమువలనను, బౌద్ధసన్యాసుల యొక్కయు, సన్యాసినులయొక్కయు అవధులులేని ప్రవర్తన ప్రజలలో నసహ్యము కలిగించి వైదిక మతమువైపు వారి మనస్సులను మరల్చినది. ఈ మతములలోవచ్చిన మార్పులవలన ప్రజలలో నంతకు పూర్వమున్న గౌరవాదరములు సన్నగిల్లి జైనబౌద్ధ మతముల పతనమునకు దారితీసినది. బౌద్ధజైన మతములపతనము వైదికమతము ముఖ్యముగా శైవ మత విజృంభణకు దోహదమైనది. శైవమున రాను రాను కాలాముఖాదిభేదము లేర్పడినవి. క్రమముగా వైష్ణవము శైవమునకు ప్రతిస్పర్ధిగావచ్చి నిలిచినది. ఈ రెండు మతములు సమానస్థాయిలో దేశమున వ్యాపించి, ప్రజాభిమానమును, గౌరవాదరములను, భక్తిప్రపత్తులను సంపాదించుకొనినవి.

## భాష

రేనాటిచోళులు పాలించిన కాలమున ఆంధ్ర వాఙ్మయ మారంభదశలో నుండెను. తెలుఁగు పద్యములను బోలిన పద్యములు వీరి శాసనములందు కనిపించినను నవి గణ యతి ప్రాస నియమరహితముగ నున్నవి. రేనాటిచోళుల శాసనములలో ధనంజయుని కలమళ్ల శాసనము మొదటి తెలుగు శాసనము క్రీ. శ. 575 లో వేయింపబడినది. కడప మండలములోని ప్రొద్దుటూరు, జమ్మలమడుగు ప్రాంతములలో వీరి శాసనములు లభించినవి శాసనము లందు పేర్కొనబడిన రాజులందరును రేనాడు ఏడు వేల దేశమును పాలించినవారే.

చాళుక్యులకు పూర్వము వెలసినభాష శాసనాత్మకమైనది. ఇక్ష్వాకులు, పల్లవులు, ఆనంద గోత్రికులు, బృహత్పలాయనులు, శాలంకాయనులు, విష్ణుకుండినులు, ప్రాకృతములోను, సంస్కృతము లోను శాసనములు వేయించినారు. కాని దేశభాషయం

19. S. I. I. Vol X. No. 633.

దభిమానముగల రేనాటిచోళులు తెలుంగుభాషలో శాసనములు వేయించినారు. ఈ కాలమున వేయింపబడిన సంస్కృత శాసనములలోను, గ్రామనామములతోపాటు వానికి సంబంధించిన వివరములు తెలుంగుభాషలో వ్రాయబడినవి.

ఈ కాలపు శాసనములు గద్యమయములు. ఇందు వృత్తగంధివాక్యము లున్నవి. పుణ్యకుమారుని మాలెపాడు శాసనమున రగడ, వెంకయచోడుని దొంగలసానికనుమ శాసనమున మహాక్కర యున్నట్లు తెలియుచున్నది. ఈ పద్యములలో గణములు సరిపోయినను యతిప్రాసలలో వ్యత్యాసము కనిపించుచున్నది.

క్రీ. శ. 575 నుండి వేయింపబడిన రేనాటి చోళుల శాసనములన్నియు దాన విషయమును తెలుపును. రాజుపేరు, విజయరాజ్యసంవత్సరము, శాసనములందు పేర్కొనబడినవి. కొన్నిశాసనములందీ విజయరాజ్య ప్రశంస, శాసనాంతమున నున్నది. ప్రధానమైన దానవిషయము శాసనమధ్యమున వర్ణింపబడుటయేగాక, దత్తములగు గ్రామములు, క్షేత్రములు, వాటి సరిహద్దులు, ఫలశ్రుతి చెప్పబడును. సాధారణముగ ఈ కాలపు శాసనములందు ఫలశ్రుతి ఒకేవిధముగ నున్నది. దానమును కాచినవారి కశ్వమేధయాగ ఫలమును, వక్రము చేసినవారికి వారణాసిలో బ్రాహ్మణులను, కపిలగోవులను చంపిన పాపము కలుగుననియు చెప్పబడినది. ఫలశ్రుతి యనంతర మాజ్ఞప్తి కర్తృ లేఖకుల పేళ్లు శాసనమున చేర్చబడును. కొన్నిశాసనములం దీ ఆజ్ఞప్తికర్తృలేఖకుల పేళ్ళులేవు.

రేనాటిచోళుల శాసనములలోని తెలుగుభాషా పదములు, భాషాభివృద్ధిని తెలిసికొనుట కుపయోగపడుచున్నవి. శాసనములలో ప్రాకృతశబ్దప్రయోగము విరివిగ కనిపించుచున్నది.

| | |
|---|---|
| దుజయరాజులు<br>దుకరాజులు<br>పన్నస | ఎఱ్ఱగుడిపాడు శాసనము |

ఆణతి—రామేశ్వరస్తంభ శాసనము.

పణం—చిలంకూరు శాసనము.

అణపోతులు—పొట్లదుర్తి మాలెపాడు శాసనము.

శాసనములలోని కొన్ని తెలుగుం పదములు అపరిచిత రూపముతోనుండి అన్యదేశ్యపదములవలె కన్పట్టును. రేవణకాలు, కుఙ్డికాళ్ళు, నివబుకాను, రట్టకుట్ట, పుద్దణకాలు, ఉచ్చువాన్లు; పుళొంబున్న ముట్ఫు, ఇఱ్ఱకాను, ఆడ్లపట్టు మొదలైనవి.

రేనాటి చోళుల శాసనములందు భూతతద్ధర్మ క్రియలు కనిపించును. కాని అసమాపక క్రియా వాక్యము లెక్కువగా నున్నవి. సమాపక్రియా వాక్యము లిచట ఉదహరింపబడుచున్నవి.

విరిపతితి కమ్మరి వినియఱ వ్రాసె—రామేశ్వర స్తంభ శాసనము.

మరుతున్లు ప్రసాద చేసిరి — చిలంకూరు శాసనము.

కోసియ వాఱకిచ్చిరి.
కాచేఱు పాఱ ఎఱమ వ్రాసిరి.
కుట్టరి కున్నడా అనువాన్లు కుట్టె.
—వెల్దుర్తి శాసనము.

దన్తియ మన్సుతోళన్ పొడిచి పడియెన్—బ్రాడిద గడ్డపల్లి శాసనము.

దీనికి వక్రంబు వచ్చినవారు పంచమహాపాతకు అగు—ఉరుటూరు శాసనము.

అఱువది వేలేండ్లు నరకయోని నుండు దురు—ఏడువాడలపాలెపు శాసనము.

కొన్ని చోట్ల తచ్ఛబ్దానుగత క్రియాజన్య విశేషణములు క్రియలుగా వాడబడినవి.

దీనికి వక్రమ్బు వచ్చువాన్లు బారనాగి వేవురు పాఱజమ్పిన వాన్లు—రామేశ్వర స్తంభ శాసనము.

కొన్ని శాసనములలోని వాక్యముల అర్థము భూతకాల క్రియా విశేషణములలో వ్యక్తీకరింపబడినవి.

ఎఱిగల్ దుగరాజుల్ ఇచ్చిన పన్నస
—ఇందుకూరు శాసనము.

అగ్గిశమ్మాళ్‌రి కిచ్చినదత్తి—వెల్దుర్తిశాసనము.

శాసనములందు సంబంధబోధక సర్వనామములతో రెండు వాక్యములొకే వాక్యముగ కలిపి వ్రాయుట కనిపించును.

ఇచ్చిన పన్నసపెన్నాఱ ఇసె తేనికిన్
తేని ఒచ్చిన వాన్డు పఞ్చమహాపాతకున్డకున్
—పొట్లదుర్తి మాలెపాడు శాసనము.

రేనాటిచోళుల శాసనములన్నియు తెలుఁగు భాషలో వేయింపబడినవి. ఈ కాలమున వేయింపబడిన ఇతర శాసనములలోనున్న గ్రామనామాదులు తెలుఁగుభాషాసంబంధము కలిగియున్నవి. ఆరేడు శతాబ్దులలో వెలిసిన తెలుఁగు శాసనములు వచన రూపములో నున్నవి ఐనను అందలి పదములు ప్రాచీనరూపములోనుండి తెలియరానిస్థితియందున్నవి. ఈ శాసనములలోని పదములు దాక్షిణాత్యభాషలగు తమిళకర్ణాటాదులతో సన్నిహితసంబంధము కలిగియున్నవి. తెలుఁగుభాషాపరిణామవికాసవిధానమును సూచించు పదము లందు కనిపించును. ఈ కాలపు తెలుఁగుభాషపై ప్రాకృత ప్రభావ మెక్కువగ కనిపించును. శాసనములలోని పదములు సులభగ్రాహ్యములుకావు ఆంధ్రభాష ప్రాచీనతను తెలుపుట కివి తోడ్పడుచున్నవి. తెలుగు పలుకుబళ్ళు, ప్రాచీన ద్రావిడ సంప్రదాయమును, ప్రాకృతభాషాసంపర్క ప్రభావము కలిగి క్రొత్త పరిణామమును పొంది తెలుఁగుభాషావికాస పరిమితిని, పరిణామమును సూచించుచున్నవి.

అసినైరువు లిఖితమ్—ఓరుటూరు శాసనము.

అణపోతులు—మాలెపాడు శాసనము.

| | |
|---|---|
| దుగరాజు<br>దుగిరాజు | ఇందుకూరు శాసనము. |
| నివబుకొను<br>పన్నస<br>ఇరువదియాదినాల్కు మఱుతుఌ | E. I Vol. XXVII P. 228. |
| చీకున | E. I. Vol. XXVII P. 223. |
| పూల్లవట్టమ్బున | ,, P. 235. |
| కోటుఖున<br>రట్టగుళ్ళ | చిలంకూరు శాసనము. |

మున్నగు వింతపదములు ఈ శాసనములందు కనిపించుచున్నవి. పన్నస, దత్తి, మఱుతు, ఇత్యాది పదములు తూర్పు చాళుక్యుల శాసనములందును, తరువాతి శాసనములందును కొలది మార్పులతో కనిపించుచున్నవి. చాళుక్యుల కాలమునాటి కాంధ్రభాష కావ్యభాషగా రూపు దిద్దుకొనినది. శాసనములందు కనిపించు పన్నస, దత్తి, మఱుతు మున్నగు పదములు వింతగా నున్నను ఆ కాలమున జనసామాన్యమున వాడుకలో నుండెను.

పన్నస=పణ్ణాయ=పెద్దపొలము=సేరి.

దత్తి=దానము=దత్తము=ఈయబడినది.

మఱుతు=భూమి కొలమానమున కొకపరిధి.

మఱుతు=నివర్తనము=పది హస్తముల దండముతో ముప్పది దండములు కొలిచిన ఒక నివర్తనము[20].

ఆ కాలమున నీరునేల అనగా తరిభూములను మఱ్తులలోను, మెట్టనేల అనగా ఖుష్కీభూములను పుట్లలోను కొలిచెడివారు. తెలుఁగు భాష ప్రారంభ స్థితిలో నున్నను ఈ కాలమున ముఖ్యముగా ఆంధ్రదేశ తూర్పుతీర ప్రాంతమున భాషాభివృద్ధి జరిగినది. కొన్ని శాసనములు దేశీయచ్ఛందస్సునకు సంబంధించిన జాత్యుపజాత్యాది పద్యములతో తెలుఁగు కవితా వాసనలు వికసించుచున్నవి. సంస్కృత భాషలో వాడుకలోనున్న ఛందస్సు ననుసరించి ఆంధ్రభాషలోని మార్గకవితారూపకల్పన గావింపబడినది. మార్గకవితకు పూర్వ మాంధ్రదేశమున దేశి రచనలు వ్యాప్తిలో నుండెను. దేశిరచనలలో జాతులు, ఉపజాతులు పేర్కొనదగినవి ఈ జాత్యుపజాతులు ప్రాఙ్నన్నయ శాసనములందు కనిపించుచున్నవి. దేశి రచనా విధానము క్రీ. శ. ఆరవ శతాబ్దినుండి అమలులోనున్నను, పరిపక్వ స్థితిని పొందలేదు ఆరవ శతాబ్దినుండి, ఆంధ్రదేశములోని కొన్ని మండలములను పాలించిన రేనాటి చోళులు

20. దశహస్తేన దండేన
త్రింశద్దండానివర్తనమ్,
పంచ వింశతిభిర్దండై
రుభయోస్తు నివర్తనమ్ –.

వేయించిన శాసనములతో తెలుఁగు కవిత కనిపించు చున్నది.

రేనాటి చోళుల శాసనములలో ధనంజయుని కలమళ్ళ శాసనము, తిప్పలూరి శాసనము, శ్రీరామేశ్వర స్తంభ శాసనము, పొట్లదుర్తి మాలెపాడు శాసనము, చిలంకూరు శాసనము, బూడిదగడ్డపల్లి శాసనము, ఏడువాడలపాలెపు శాసనము ముఖ్యమైనవి. ఈ శాసనములలోని తెలుఁగు భాష ప్రాకృత ప్రభావము కలిగి యుండుటయేగాక, మాత్రాగణములతో గూడి, తెలుఁగు భాష ప్రాథమిక దశను, తెలుగు ఛందస్సుయొక్క ప్రథమ దశను సూచించుచున్నది

రేనాటి చోళుల శాసనములందున్న వృత్తగంధి పద్యములలో ముఖ్యమైనవి పేర్కొనబడు చున్నవి.

1. పుణ్యకుమారుండు గణ్యమానుండు — తిప్పలూరు శాసనము. ఇది ద్విపద పాదము. ఇందు ప్రాస యతి వాడబడినది.

2. విరిపత్తి కమ్మరి వినియణ ప్రాసె— రామేశ్వర స్తంభ శాసనము. ద్విపద పాదము — యతి సరిగా నున్నది.

3. శ్రీ మహేంద్రన్ మానరవి మాఱు రాపిడుగు పంచమాత్రకములగు నాలుగు గణము లీ పాదమునం దున్నవి. ఈ పాదము ద్విరదగతి రగడకు సంబంధించినది. యతిమాత్రము లేదు.

4. మగడు పుదల యేలువాడు
కాడి చోళ ముత్తరాజా.

నాలుగేసి సూర్యగణములతో కూడిన రెండు పాదములు. తురగవల్గన రగడకు సంబంధించినవి. యతిలేదు.

5. అచ్చెర్వా నను నరివర జముండన్వాడు.
దన్తియనుంగు తోడన్ పొడుచి పడియెన్.

—బూడిదగడ్డపల్లి శాసనము. కొలది మార్పులతో సీస పద్యమువలె నున్నది. కాని యతులు లేవు.

6. అణపోతులు శేవణకాలు పుద్దణకాలు.
ఇచ్చిన పన్నస పెన్నార ఇాశె రేవికిన్.
—పొట్లదుర్తి మాలెపాడు శాసనము.

అణపోతులురే

వణకాలు పుద్దణకాలు — లో ప్రాసయతి యున్నది. రెండవ పాదమున సమాక్షర యతి యున్నది. యతి స్థానములు సమస్థానమున లేవు. ఐదేసి మాత్రలకొక గణము విరుగుట లేదు. మొదటి పాదమున 15 మాత్రల తరువాతను, రెండవ పాదమున పదుమూడు మాత్రల తరువాతను యతి ఉన్నది. మూఁడవ గణాద్యక్షరము యతిగా లేదు ఆద్యంత ప్రాసలు లేవు. మాత్రానియమము మాత్రము కనిపించుచున్నది. ద్విరదగతిరగడ లక్షణము లేదు. మాత్రల లెక్కనుబట్టి చూచిన ప్రతిరచనయు ఏదో ఒక పద్యపాదమునకు సరిపోవును. ఇది ద్విరదగతి రగడ కాదు, వృత్తగంధికాదు. ఈ పాదములందలి మాత్రలు విరుగుటలేదు. ఆంధ్రవాఙ్మయారంభ దశలో వేయింపబడిన రేనాటిచోళుల శాసనములం దీవిధమైన వృత్తగంధి రచన లుండుట విశేషము. ఈ కాలమునాటికి తెలుఁగుభాష జనసామాన్యమున వ్యాపించి, శాసనస్థమై, గద్య పద్య రచనా విశేష సామర్థ్యమైన భాషగా రూపొందినదని భావింపవచ్చును. ఈ కాలపు శాసనములందు సీసపద్యపాదములు సైతము కనిపించుచున్నవి.

'వక్రంబు
శ్రీ పర్వతంబు వచ్చిన...........'[21]

ఇాదు సీసపద్యపాద లక్షణములు కనిపించు చున్నవి.

ప్రభుచోఱరట్టోడి—పరహితు డితడు.
ఇది ద్విపదపాదము.

'కట్టించె కవిక పొం—పట్టంబుహాణులుగు'[22]
ఇది సీసపద్యపాద పూర్వార్థము.

21 S. I. I. Vol X No. 593.
22. ,, ,, No. 598.

'దేవస్వంబు లంచంబు గొన్నవాడు,
వారణాసి వచ్చిన పాపంబు గొన్నవాడు.'[23]

ఇవి తేటగీతి పాదములు. ఇందు యతిలేదు. 'స్వ'ను తేల్చి పలుకవలెను.

'పనియు ఱోగొన్నవాడు విచ్చినవాడు
చెడువాడు చ్చినవాడు వెంట.'[24]

ఇది సీసపాదము. ఇందు యతిలేదు.

దొంగలసానికనుమ శాసనము నందు మహాక్కర యున్నది. మహాక్కరలో ఒక సూర్యగణము, 5 ఇంద్రగణములు, ఒక చంద్రగణముండును. ప్రాస ముండును. పంచమ గణాద్యక్షరము యతి.

'వెంకయా చోళ్ల మహారాజు వెంకణాదిత్యుండు
కొమరార భీముండు పుసి ఇళ్ల దాష్టజ్మ నీ ధర్మ మా
చంద్రార్కతారకంబును వారి లనునుండు.'

ఇందు గణములు సరిపోవుచున్నను, మొదటి పాదమున చంద్రగణము నందొకమాత్ర ఎక్కువగను, రెండవ పాదమున చంద్రగణము నందొకమాత్ర తక్కువగను ఉన్నవి. మొదటి పాదమున నాలుగవ గణాద్యక్షరము యతిస్థానమున నున్నది. ఇది ప్రాస యతి. కాని లక్షణము ప్రకారము 5 వ గణాద్యక్షరము యతి స్థానమునం దుండవలయును. రెండవ పాద మున యతిప్రాసలు లేవు. దీనిని మహాక్కఱ యనుటకు బదులు మహాక్కఱ పాదములుగల వృత్త గంధియనుట సమంజసము.

రేనాటి చోళుల కాలమున ప్రారంభ దశలో మన్న తెలుగు కవిత తూర్పుచాళుక్యుల కాలమున పరిణతిపొంది నన్నెచోడుని కుమారసంభవ కావ్య రచనకు దగిన భాషగా రూపు దిద్దుకొనినది.

## సాంఘిక పరిస్థితులు

రేనాటి చోళులు పాలించిన కాలమున ప్రజలు సుఖమయజీవనము గడుపుచుండిరి. సంఘమున వర్ణవ్యవస్థ యేర్పడియుండెను. బ్రాహ్మణులు స్వమతాచారవ్యవహారముల వెలింగి, రాజులచేతను, ప్రజలచేతను, గౌరవింపబడుచుండిరి. రాజులు, దండనాయకులు, సేనాపతులు ధనాఢ్యులు విద్యావంతులైన బ్రాహ్మణులకు, భూములను దానమిచ్చుచుండిరి. ప్రజలలో నధిక సంఖ్యాకులు వ్యవసాయము ముఖ్య వృత్తిగా కలిగియుండిరి. సంఘమున అన్నివృత్తుల వారుండిరి. రేనాటి చోళులు ఏడువేల గ్రామములు సిద్ధివెయ్యి గ్రామములుగల దేశమును పాలించిరి. బహుశః ఈ గ్రామములు, చిన్నవి పెద్దవి కలిసి ఏడువేలై యుండవచ్చును. గ్రామములు కూటములుగా, గ్రామకూటములు మండలములుగా, మండలములు దేశముగా నేర్పడియుండవచ్చును. గ్రామముల కూటమి మండలములుగా నేర్పడి యుండుటనుబట్టి మండలాధిపతుల యధికారమున కొన్ని గ్రామకూటములు, గ్రామకూటముల అధిపతుల క్రింద కొన్నిగ్రామములుండి, గ్రామములు రట్టొడ్ల చేత పాలింపబడుచుండెను.

ప్రజలు సంఘీభావముతో జీవించుచుండిరి. రాజాజ్ఞలను మండలాధిపతులు పాటించుచుండిరి. ప్రజలు తమతమ వృత్తుల నవలంబించుచు, ప్రశాంతమైన జీవితము గడుపుచుండిరి.

ప్రజలలో కొన్ని కట్టుబాట్లుండెను. ఒకానొక సమయమున 108 మంది కలిగి వారిలో నెవరైనను లంచమిచ్చినను, తీసికొన్నను, పాపము బడ యుదురని నిర్ణయించుకొనినట్లు పెద్దముడియము శివాలయమునన్న శాసనమువలన తెలియుచున్నది.

'స్వస్తిశ్రీ నూటయెణు
బొన్ట ఇడ్డ స—
మయంబు......ఱు
పాల ఆ జెవి యన్నయే
నియు ఱోగొణ్ణ వాను నిచ్చి
న వాన్ను చెడువాన్ను క్షొచిన—
వాన్ను వెణ్ణ వడ్డచి
కుఞ్ఞబమ్మ వడ్డచి.........[25]

23. ,, ,, No 611.
24. ,, ,, No. 612.
25. S. I. I. Vol. X. No. 612.

భూమిని మఱుతులలో కొలిచెడివారు. రాజులకు ప్రియపుత్రులుండిరి. అందు ప్రథమ ప్రియపుత్రుఁడు భూదానములిచ్చు అధికారము కలిగియుండెను. విక్రమాదిత్యుడనురాజు ప్రథమ ప్రియపుత్రుడు క్షేత్రమును దానమిచ్చెను.

‘‘..............బుపె  
విక్రమాది.........  
త్య చే............  
త్య.........రాజా  
ప్రథమ ప్రి  
య పు.........  
త్రును ఇచ్చి......  
నక్షేత్రంబు......’’

పురుషులలో కొందరికి త్రిభువనసింగం బను బిరుదముండెను.[27] వైదుంబ రాజుల కాలమున జరిగిన సోరవడి కయ్యంబు చారిత్రక ప్రసిద్ధి జెందిన యుద్ధముగ దోచుచున్నది ఈ కాలమున వెలసిన అనేక శాసనములం దీ యుద్ధ ప్రశంసయున్నది

యుద్ధమున మరణించిన వారి గుణగణములను ప్రశంసించుచు శాసనములు వేయించుచుండిరి. యుద్ధములందు సాధారణ ప్రజలు పాల్గొనుచుండిరి. వీరులు, యోధులు, యుద్ధములందు ప్రాణములను తెగించి పోరాడుచుండిరి. వీరస్వర్గమలంకరించుటయే వీరుని ఆశయమైనట్లు తెలియుచున్నది. యుద్ధములో మరణించినవారు ఇంద్రలోకమేగుదురను నమ్మకము వీరులలోను ప్రజలలోను వుండెను. వైదుంబ రాజుల కాలమున వెలసిన శాసనములలో ఎక్కువ శాసనములు యుద్ధవీరుల మరణమునకు, ముఖ్యముగా సోరవాడి కయ్యంబున మరణించిన వారికి సంబంధించినవే యున్నవి రాజులు వీరయోధులు చోళులతో యుద్ధము లెక్కువ చేసినట్లు తెలియుచున్నది. పురుషుల పేళ్ళు స్త్రీల పేళ్లవలె కనిపించుచున్నవి. అట్టివి శాసనములందున్నవి. ‘రేమణ్డాళ శ్రీ జయమాయిరెసెఱళుకుమ్బళ కొడుకు కుళ్ళమ్మ’ అని గంగిరెడ్డిపల్లి శాసనమునందున్నది.[28] కొందరు ధనాఢ్యులు తటాకముల ద్రవ్వించుచుండిరి. వణ్రవోలు అపిమనగంగుకెన్సరాజా చెఱువు నిర్మించినట్లు బూడిదగడ్డపల్లి శాసనము వలన[29] తెలియుచున్నది. వైదుంబులచేత పట్టం కట్టబడిన గండర ముత్తారాజా యుద్ధమున మరణించినట్లు ముదిలేడు శాసనమున నున్నది.[30] సంఘమున విశ్వబ్రాహ్మణులు ముఖ్యముగ శాసనాక్షరములను చెక్కు శిల్పులు గౌరవింపబడుచుండిరి. పంచాణమువారిలో కమ్మరులు శాసనమును చెక్కెడివారు. రామేశ్వర స్తంభ శాసనాక్షరములను చెక్కినవాడు విరిపతితి కమ్మరి వినియణ. సామాన్యజనులు భూమి కొలతలు ‘పన్నస’లలో కొలిచెడివారు. ఆనాడు చేను అను పదము పొలమునకు మారుగా ఉపయోగించుచుండిరి. మఱుతులు, మఱుతురులు, మఱుర్తులు, భూమి పరిమాణమును సూచించు మఱుతుయొక్క రూపవైవిధ్యపదములు.

ప్రజలలో వినోదప్రదర్శనలను ప్రోత్సహించువారుండిరి. ఆ కాలమున వాడుకలోనున్న కోడి పందెములు, మేషమహిషయుద్ధములు, పండుగలు, ఏరువాకపున్నమవంటి పండుగలు ప్రజావినోదములుగ పరిగణింపబడుచుండెను. జనులలో దైవభక్తి పాపభీతి యుండెను. ప్రజానురంజకముగా రాజులు పాలించుచుండిరి.

స్త్రీలు కరాభరణములు, ముక్కరలు, కొప్పులకు పూవులు, కంకణములు ధరించుచుండిరి. వివాహములు సాధారణముగా నాలుగు రోజులు జరుగుచుండెను. బాలికలు బొమ్మలాటలు, పర్వదినములందాయా పండుగలకు సంబంధించిన ఆట లాటచుండిరి.

వేట లనినను, యుద్ధము లనినను ప్రజలు ఉత్సాహము చూపుచుండిరి. యుద్ధములందు స్త్రీలు, పురుషులకు సహాయ మొనర్చుచుండిరి. ఈ కాలమున ప్రజ లనేక చిన్నచిన్న యుద్ధముల తాకిడి నెదుర్కొనవలసివచ్చెను. చిన్నచిన్నరాజులు, ఒకరితో నొకరు పోరాడుచుండుటవలన ప్రజల సాంఘిక

---

26. S. I. I. Vol. X. No. 617.  
27. ,, ,, No. 618.  
28. S. I. I. Vol. X No. 631.  
29. ,, ,, No. 633.  
30. ,, ,, No. 640.

జీవనమునకు కొంతవరకు అంతరాయము కల్గుచుండెనని భావింపవచ్చును.

## వ్యాపారము - ఆర్థిక స్థితి

రేనాటిచోళులు పాలించిన కాలమందు దేశము చిన్నచిన్న మండలములుగ విభజింపబడినను, ప్రజలు వ్యవసాయము ముఖ్యవృత్తిగాగలిగి ధనధాన్య సమృద్ధి కలిగి సిరిసంపదలతో వర్ధిల్లినారు. దేశమున వర్తక వ్యాపారములు విశేషముగా సాగుచుండెను. చక్కని రాజమార్గము లుండెను. రేనాటిచోళులు, వైదుంబులు, చిన్నచిన్న మాండలికులతోను, తదితర రాజ వంశీయులతోను, యుద్ధములు చేయవలసి వచ్చుచుండెను. ఈ యుద్ధములందు సేనలు నడుచుటకు చక్కని రహదారు లుండెను. యుద్ధములు లేని సమయములందీ మార్గములు వాణిజ్యమునకుపయోగపడుచుండెను. దేశమున పెద్దపెద్ద నగరములను కలుపుచు రాజమార్గములు వేయబడెను. బండ్లు, గుఱ్ఱములు, ఎద్దులు, సరుకుల నొకచోటి నుండి మరియొకచోటికి తీసుకొనిపోవుట కుపయోగపడుచుండెను. ఒంగేరుమార్గము, ఆంధ్రపథము, తదితర రాజమార్గము లానాడు ముఖ్యమైన స్థలములను, పట్టణములను, రేవుపట్టణములను కలుపుచుండెను.

వర్తకులు వర్తకసుంకమును చెల్లించుచుండిరి, వర్తకపు సుంకములవలన వచ్చు ఆదాయమును రాజులు, వ్యాపారాభివృద్ధికి వినియోగించుచుండిరి. పట్టణములలోను, నగరములలోను వర్తకపు టంగడు లుండెడివి.

రేనాటిచోళులు పాలించిన కాలమున గొప్ప దేవాలయములు వెలసినట్లు కాన్పింపదు. ఆంధ్ర దేశమునందితర ప్రాంతములందు నిర్మించిన దేవాలయములు-శిల్పము, ఆయాప్రాంతములను పాలించిన రాజవంశీయుల కళాభిమానమునకు, మతాభిమానమునకు నిదర్శనములేకాని రేనాటిచోళులకు సంబంధించిన ప్రత్యేక శిల్పకళాసంపద కానరాదు.



# 'సామవేదా దిదం గీతం'

శ్రీ యల్లాప్రగడ వెంకటనారాయణ

"సామవేదా దిదం గీతమ్'' అనెడి సూక్తి కలదు. అంటే సంగీత—నృత్యకళలకు మూలము సామవేదము. మన హైందవ విజ్ఞానమునకు మూలము ఋగ్యజుస్సామఅథర్వణము లనెడి నాలుగు వేదములు. ఈ చతుర్వేదములలో నొక్కటియే సామ వేదము. ఈ సామవేదమునుండియే సంగీతము జనించి యుండినది. ఇట్టి యీ నాలుగు వేదములనుండిన్నీ తిరిగి ప్రత్యేకముగా నాలుగు ఉపవేదములు ఉద్భవ ములై యుండినవి. అవి వరుసగా ఆయుర్వేదము, ధనుర్వేదము, గాంధర్వవేదము, అర్థవేదము లనునవి. (నాల్గవది 'శిల్పము' అని కొందరి యభిప్రాయము.) వీనిలో గాంధర్వవేదము అనునదియే సంగీతమునకు మూలము. ఈ గాంధర్వవేదమును బ్రహ్మ సృష్టించి నట్లుగా తెలియుచున్నది. ఎట్లంటే ! 'ఋగ్యజుస్సామా ధర్వాఖ్యాన్ దృష్ట్వా వేదాన్ ప్రజాపతిః। విచింత్య తేషా మర్థంచ గాంధర్వం చకార సః'— అని చెప్పఁబడి యున్నది. అందువల్లను బ్రహ్మ చతుర్వేదముల మన్నూ చూచి గాంధర్వవేదమును రచించియుండి నట్లుగా తెలుస్తూవున్నది. పైనను చెప్పఁబడియుండి నట్టి చతుర్వేదములలోనున్నూ సామవేదము ఉపాసనా ప్రాధాన్యతను గలిగినట్టిది. ఈనాడు వాడుకలో నుండి యున్నట్టి వేదమంత్రములలో డెబ్బదిఅయిదు (75) మంత్రములు సామవేదమునుండియున్నూ, తక్కినవి అన్నియునూ ఋగ్వేదమునందలి 8, 9 (అష్టమ, నవమ) మండలాంతర్గతములైనట్టి మంత్రములై యున్నవి. ఇవి మాత్రమే గ్రహింపఁబడి ప్రస్తుతమున వాడుకలో నుండియున్నవి. కాని, యథార్థముగా ఆధారసహితముగా మనము చూచినట్లయితే ఈ సామవేదమునందలివగునట్టి శాఖలు ఒక వేయ్యింటికి పైగా నుండియున్నట్లుగా మనకు తెలుస్తున్నది. 'సహస్ర వర్మా సామవేదః'—అని చెప్పబడియున్నది. కాని, అట్టి యీ సామవేదశాఖ లన్నియును ఈనాడు మనకు లభ్యములుగా లేవు. దీనికి ఆధార మేమంటే 'సామవేదస్య కిల సహస్రభేదా అసన్। ఇత్యస్మిన్నయత్ పరంవిరల ప్రచార తథా తాన్ విలోపంగతా— ఇత్యసౌ నామాతు కుపశకం — గీతిషు సామాఖ్యా' అని భాష్యమునందున విశదీకరింపఁబడియున్నది. పూర్వ మున వేదకాలంలో యజ్ఞయాగాదులయందున ఉద్గా త్రులవల్లను గానమొనర్పబడియుండినది గనుకను దీనికి 'సామవేదము' అని పేరు కలిగియుండినది. 'ఉద్గాత్రేవ శకునే సామగాయసి, బ్రహ్మపుత్ర ఇవ సవనేషు శంససి'—అని చెప్పబడినది. ఇట్టి యీ సామ వేద మంత్రములన్నియును గూడ గాంధర్వవేదమునం దుండియున్నవి.

ఆనాటి యాచారము, ఈ సామవేదము ననుస రించి వర్ణాక్రమేడితము; వర్ణ—వర్గీకరణము; వర్ణాం తరక్షేపణము మొదలగునట్టి యీ యీ రూపకల్పనల రీత్యా గీతికలను నిర్మించి, వాటిని సామవేద స్వరములగునట్టి ఉదాత్త అనుదాత్త స్వరిత ప్రచితాది స్వరయుక్తములుగా గాన మొనర్చుచుండెడి వారని తెలుస్తూ ఉన్నది. గాంధర్వవేదము ఈ గాయ కులను నాలుగు రీతులుగా విభాగ మొనర్చి పేర్కొని యుండినది. ఎట్లంటే సామగాయకులు; ఛందోగీతి గాయకులు; గేయగాయకులు; ఛందోగాయకులు; అని చతుర్విధ గాయకులనుగా పేర్కొని యుండినది. ఆ నాల్గు రీతులలోనున్నూ 'సామగాయకులను' సర్వాంగ సంపూర్ణులనుగా చెప్పి యుండినది. అంటే ఈ సామ గానమునకు అనుగుణ్యములైనట్టి ఉపాంగములగు రాగ, భావ, తాళ, లయాది విశేషములు గలిగి నట్టి గాయకులు (సామగాయకులు) సంపూర్ణులుగా చెప్పబడియుండిరి. ఇట్టి యీ విధానము సామాన్య సంగీత శాస్త్రమునకంటెను కొంచెము విలక్షణముగా

నుండును. అయినను ఈ నాటి ప్రయోగమునందునె గల షడ్జ, ఋషభ, గాంధార, మధ్యమ, పంచమ, ధైవత, నిషాదములనెడి సప్తస్వరముల యొక్కయు ప్రయోగము సామగానము నుండియే సముద్భూతమై యుండినది. ఆ నాటి కాలమునందున వాడబడియుండినట్టి కొన్ని గీతికలను మహాకవి యగునట్టి కాళిదాసు తనయొక్క "విక్రమోర్వశీయ'మనే నాటకములో (చతుర్థాంకమునందున) పేర్కొని విశదీకరించియుండెను. అవి: జృంభవికా; ఖండధారా; చర్చరీ; ఛిన్నకః; ఖండకః; ఖురకః; కుటిలికా, మందఘటీ; అర్ధద్విచతురస్రకః; ఖండికా; గళితకః; మొదలగునట్టి గీతి విశేషములను పేర్కొని వివరించి యుండెను. పైనను చెప్పియుండినట్టి రీతిగా నీ షడ్జాది సప్తస్వరములున్నూ సామవేద సంజనితములైనట్టివియే యగును. కాని, ఆ విధానము, వరుస క్రమము, వేరుగా నుండగలదు. సామవేదములోని స్వరములు వరుసగా అవరోహణాక్రమములో—'గ. రి. స. ని. ధ. ప' అని—చెప్పఁబడి యుండినవి. వీటికి వరుసగా ప్రథమ, ద్వితీయ, తృతీయా, చతుర్థ, మంద్ర, అతిస్వృవు' అని పేర్లు చెప్పఁబడి యున్నవి. వీటికంటెను గాంధారస్వరమునకంటెను పైనను మధ్యమస్వరము కూడ పలుకగలదు. దానిని 'కృష్ట' అని సామవేత్తలు పేర్కొని యుండిరి. ఈ తీరుగా సామవేదస్వరములు వరుసగా (అవరోహణాక్రమములో) 'మ. గ. రి. స. ని. ధ. ప' అని ఏర్పడి యుండినవి. వీనినే ప్రస్తుత కాలమునందున 'మగరిస' అనెడి భాగమును 'సరిగమ' అనిన్ని 'నిధప' అనెడి భాగమును 'పధని' అనిన్ని తలక్రిందులుగాఁజేసి, ఈ రెండింటినిన్ని కలిపి వరుసగా 'సరిగమపధని' అని సప్తస్వరప్రత్యయములను షడ్జగ్రామ సంబంధములుగా పేర్కొని వాటిని సంగీత స్వరములుగా నుపయోగించి యుండిరి. కనుకను సామవేద సంజనితమైనదియే 'సంగీతము' అనఁబడి యున్నది. ఈ సామగానము యొక్క రీతియును, గానవిధానమున్నూ పూర్వమున నెట్లుండి యుండెడిదో కొంచెము విచారించి తెలిసికొందము. పై నాలుగు వేదములనున్నూ గూర్చి చెప్పి యుండినట్టి యొకమంత్రము ఉండియున్నది. అది ఎట్లంటే 'పాహినో అగ్న ఏకయా; పాహ్యుత ద్వితీయ యా; పాహి గీర్భిశ్చ తిసృభి రూర్జాంపతే— పాహి చతసృభి ర్వసో......' అనునది (సామ. 4. శ. మం...36). ఈ మంత్రమునందలి అర్థభావము ఏమంటే—'భగవత్స్వరూపుడవగు నో యగ్నిదేవా! చతుర్వేదములయందలి వాక్కులద్వారా మమ్ములను రక్షింపుము' అని. ఇట్లీరీతిగా ఋగ్యజుస్సామాథర్వణము లనెడి నాలుగు వేదముల ప్రసక్తియును గూడ దీనియందున్నది. కనుక వాటిద్వారా ఆధ్యాత్మికతత్వమునన్ నా పరమాత్మస్వరూపుడగునట్టి యా భగవానుని యుపాసించుటయే లక్ష్యమై యున్నది. సంగీతము సామవేదమునుండి పుట్టినదిగా చెప్పబడినది. ఇకను ఈ సంగీతము అనునది గీత నృత్య వాద్యాదికములు మూడింటి యొక్కయును చేరికయై 'తౌ త్రికము' అని పేర్కొనబడినది. కనుక సంగీతము సామవేదము నుండి జనించినదై నృత్త నృత్య తాళ లయా గీతాది విశేషములను గలిగినట్టిదై 'గాంధర్వము' అనెడి నామముతో లోకమునందున ప్రసిద్ధిని గాంచి యుండినది.

ఇకను పూర్వమునందుండినట్టిదగు సామవేద గానమును గురించి కొంతవరకు తెలిసికొందము. ఈ సామవేదమునందలి పైనచెప్పినట్టిదగు స్వరభేదము మాత్రాభేదమువల్లను సంభవించును. ఈ సామగానము అనఁబడునట్టిది. ఛాందోగ్యోపనిషత్తునందున—హింకార, ప్రస్తావ, ఉద్గీథ, ప్రతీహార, విధానములని అయిదు విధములుగా విభాగించి చెప్పఁబడియున్నది. వాటియందున మొదటివగు మూడు స్వరములు (గరిస) గలిగినది. అందలి భేదమును స్థాయీభావము, అంతరము, ఆభోగము అనిన్ని చెప్పి, మరల దానికి తానమూ విధానమున్నూ చెప్పియుండిరి. ఈ సామగానము ఎట్లుండునో ఉదాహరణముగా నొక మంత్రమును ఈ క్రిందను ఉదాహరించుచున్నాను. (ఇది మా పాఠకులయొక్క విజ్ఞానమున కొఱకై యుదాహరణ మాత్రముగా నిందున నుదాహరించి చూపుదను ) ఎట్లంటే..........

'అగ్ని ఆయాహి వీత మే గృణానో హవ్యదాతమే విహోతా సత్సి బర్హిషి' (సామ వేదం). గానం: ఓం — గి—గ్న — ఇ (ప్రస్తావము); ఓం — ఆయాహి—వీత

మే గృణానో హవ్యదాతమే । (ఉద్గీథము); నిహోతా సత్సి బర్హిషి—ఓం (విధానము)—ఇటుల నీరీతిగా విభాగములో విధానమే రాగ పూర్తికొఱకు మూడు పర్యాయములుగా ఆ వృత్తము లగుచున్నది.*

ఈ సామగానమును గురించి నారదీయ (కృత) మగునట్టి 'నారదశిక్షా' యనెడి గ్రంథము నందున చక్కగా చెప్పబడియున్నది. ఈ గ్రంథమును గురించినట్టి వివరణము చివరను చెప్పబడియున్నది.

'ఇట్టి ఋగ్ సామగానమునందలి మంత్రములు ఛందోబంధనమును సహింపవు. ఇట్టి ఋగ్ సామ గానము లేనట్టి యజ్ఞమే లేదని శతపథ బ్రాహ్మణమునందున చెప్పబడినది. ఇంకను దానియొక్క మహిమావిశేషము విషయజ్ఞులకు తెలియును' అని అందు చెప్పబడియున్నది. ఈ రీతిగా నాలుగు వేదములకునూ మరల నాలుగు ఉపవేదములు ఉండి యున్నవి. అందు గాంధర్వవేదము సామవేద సంజనితమైనది. ఈ గాంధర్వమునందున అంతర్భూతమైనట్టిదియే నాట్యముగా చెప్పబడినది. ఈ సామ గానముయొక్క విధాన విశేషములను తెలుపగల సంగీత గ్రంథము లుండియున్నప్పటికిన్నీ సప్తస్వరయుక్తమై, తాళలయాదివిశేషములతో నుండినట్టిదగు సామగాన గ్రంథము లోపించియున్నది.

ఇకను ఈ సంగీతమునందలి సప్త స్వర విశేషములను గురించి ముందు విశదీకరింపబడును. పూర్వమునందు ఆదిదేవుడైనట్టి పరమ శివుడు, ఆదినటుడు, మహానటుడు, నటనాథుడు, నటరాజా—తనకు బ్రహ్మాదిదేవతాగణములు సహకార వాద్యములద్వారా సహకరింపుచునుండగా (తాండవ) నాట్యము నొనర్చియుండినట్లుగా చెప్పబడియున్నది. 'బ్రహ్మాతాళధరో — హరిశ్చపటహో— వీణాకరాభారతీ । వంశజ్ఞౌశశిభాస్కరౌ — శ్రుతిధరౌ స్సిద్ధాప్సరాః కింనరాః । నందీభృంగిరటాదిమర్ద్దళధరాః—సంగీతకో నారదః । శంభోర్నృత్తకరస్య మంగళతనో ర్నాట్యం సదా పాతునః'—అని చెప్పబడియున్నది. అంటే: బ్రహ్మతాళమును ధరించిన్నీ, హరి పటహవాద్యమును ధరించిన్నీ, సరస్వతి వీణను ధరించియున్నూ, చంద్ర సూర్యులు వంశములను (పిల్లనగ్రోవులను)న్నూ, సిద్ధాప్సరకిన్నరాదులు శ్రుతికారులుగానున్నూ—నందీశ్వరుడు — భృంగీశ్వరుడు ఈ యుభయులున్నూ మార్దంగికులుగానున్నూ నారదుడు సంగీతమును పాడుచూ ఉండగానున్నూ శంభువు నృత్యము నొనర్చెన్నూ ఆ రీతిగా నృత్య మొనర్చు చుండినట్టి యా పరమ శివుడు నటనాథుడు నటరాజా ఎల్లప్పుడున్నూ రక్షించుగాక!!! యని ఇందలి మంగళాశీర్వాద పూర్వకమైనట్టి భావమై యున్నది.

పూర్వమునుండిన్నీ ఈ సంగీత నృత్య కళలు రెండున్నూ అవినాభావసంబంధము గలిగి ప్రసిద్ధిని గాంచియుండినవి. మహానటనాథమూర్తియొక్క సప్తవిధతాండవములలో నీ సంగీత నృత్యములు రెండున్నూ తదంగములుగా అందున నిమిడియే యుండినవి. సంగీతము ఆపాతమధురమైనట్టిది.

* (N. B. ఈ సామగాన మంత్రములు నావద్దనుగల పూర్వప్రసిద్ధ వేదపండితులు కీ॥ శే॥ శ్రీ బంకుపల్లి మల్లయ్యశాస్త్రిగారు ఆంధ్రము లోనికి అనువదించి యుండినట్టి ఋగ్వేదము, సామవేదము లనెడి గ్రంథములనుండి గ్రహింపఁబడి యున్నవి. చిన్నతనములో 'ఓం అగ్నిమీళే పురోహితః......ఇత్యాదిగాగల ఋగ్వేదమునందలి మంత్రములను వేదపాఠము చెప్పుకొనెడి రోజులలో గురుముఖతహా సంతచెప్పుకొని వల్లించియుండినట్టి కించిత్పరిజ్ఞానముతో పై మంత్రములు ఇందున నుట్టంకించి చెప్పబడియున్నవి. కాని వాటియందున నాకు సంపూర్ణ పరిజ్ఞానము ఏమాత్రముగానీ లేదని మాత్రము పండితప్రకాండులకు వినయపూర్వకముగా మనవి చేయుచున్నాను. ఇందేవియైన లోపము లుండినచో మన్నింపమని ప్రార్థించుచున్నాను. పైనను చెప్పినట్టి అనువాదగ్రంథములు రెండునూ ప్రస్తుతమునందున కాకినాడ జగన్నాథపురంలోని కీ॥ శే॥ శ్రీ చిరువోలు కోటేశ్వరరావుపంతులుగారి యొక్క పుత్రికయగు శ్రీమతి పూళ్ళ సుభద్ర (మా విద్యార్థిని)గారి వద్దనుగల సంగీత గ్రంథ భాండాగారమునందున నుండియున్నవి అవియే మాకు ప్రస్తుతమున ఆధారములై యున్నవి.

ఇట్టి యీ మధుర సంగీత (నాదము)నకు శిశుపశు పక్ష్యాదులు మాత్రమేగాకుండా స్థావరములైనట్టి వృక్షములుగూడను ఈ సంగీతమునకు పులకరించుచున్నట్లుగా దృష్టాంతములు గలవు. 'శిశుర్వేత్తి పశుర్వేత్తి వేత్తిగానరసం ఫణిః' అనుటచేతను గానరసమునకు విషసర్పములు గూడను వశములగుచున్నవి మరియును కొన్ని కొన్ని రాగములను ఆలాపనము చేయుటవల్లను కొన్ని సద్యఃఫలితములు కలిగినట్లుగా నిదర్శనములుండి యున్నవి. మేఘరంజనీ రాగమును ఆలాపించినచో వర్షములు గురిసినట్లున్నూ; దీపక రాగమును ఆలాపించి పాడగా దీపములు వెలిగి యుండినట్లున్నూ; ఇంకనూ ఇట్లే పూర్వమునందున ఆంజనేయులు సంగీతమునుపాడి రాళ్లను సహితము కరగించినట్లుగా నారద తుంబురు సంవాదము నందున చెప్పఁబడియున్నది. ఇట్లే ఇంకనూ అనేకములైనట్టి యాధారములు గలవు. ప్రస్తుత కాలమున కొన్ని కొన్ని రాగములను పాడి వినిపించుట మూలముగా కొన్ని కొన్ని దీర్ఘ రోగములు నివారణమగుచుండినట్లుగా రోగ నిదానమునందున గలదు. కొందరు ప్రముఖులగునట్టి వైద్యశేఖరులు అనుభవపూర్వకముగా ప్రయోగించి నిదర్శనపూర్వకముగా ఋజువు చేయుచున్నారుగూడను. కనుక గానవిద్య యనునది గొప్పకళగా ప్రఖ్యాతినందియున్నది. ఇంకనూ శ్రౌత స్మార్తకర్మాదిక విశేషముల యందున నీ సంగీతపు ప్రసక్తి ఉండియున్నది. పూర్వకాలములో మహావ్రతము అనెడియొక యాగము (యజ్ఞము లేక క్రతువు) ఆచరింపఁబడుచుండెడిదట అందు బాలికలు సంగీతమును పాడుచూ అగ్నికి చుట్టూనున్నూ ప్రదక్షిణముగా తిరుగుదురు. సామవేదము అంతయును గూడ నీ సంగీత రూపమే అయియున్నది. సత్రయాగము అనెడి యొక క్రతువును చేయునప్పుడు ఆ యజ్ఞకర్తయును, యజ్ఞమును చేయించునట్టి ఋత్విక్కులున్నూ అందరున్నూ కలసి అతివినోదముగా సామగానముచేస్తూ క్రీడింతురు' అని 'హరివంశము'నందు చెప్పఁబడి యున్నది. ఈ సంగీతమును గురించి అనేకములైనట్టి అద్భుత విశేషములు చెప్పబడి యున్నవి. ఈ సంగీతమునందలి షడ్జాదిస్వరములు—'షట్‌జ' ఆరుస్థానములనుండి యుద్భవించి యుండినవి. ఎట్లంటే 'నాభిహృత్కంఠతాలౌచ నాసా దంతోష్టయోః క్రమాత్। షడ్జశ్చఋషభ గాంధారౌ మధ్యమః పంచమ స్తదా। ధైవతశ్చ నిషాదశ్చ స్వరా స్సప్త ప్రకీర్తితాః'—అని చెప్పబడి యున్నది. పైనను చెప్పబడినట్టి రీతిగా షడ్జ—ఋషభ—గాంధార—మధ్యమ—పంచమ—ధైవత—నిషాదములనియెడి సప్త స్వరములున్నూ వరుసగా మానవునియొక్క నాభి—హృద్-కంఠ—తాలు—నాసా—దం—తోష్టములనెడి (షట్) ఆరుసానములనుండిన్ని యుద్భవించుచున్నట్లుగా చెప్పఁబడియున్నది—అందువల్లనే షట్ స్థానముల నుండి పుట్టబడినవి గనుక షడ్జాది స్వరములు అని పేర్కొనఁబడి యుండినవి. మరియొక రీతిగా 'షడ్జము'నకు అర్థము ఆరింటిని ఉద్భవింపఁ జేసినది గనుకను షడ్జము అని సార్థకముగా పేర్కొనబడియుండినట్లు చెప్పబడుతూ వున్నది. శ్రీ త్యాగరాజస్వామివారు 'నాభిహృత్కంఠరసన— నాసాదులయందు — శోభిల్లు సప్తస్వరసుందరుల భజింపవే మనసా' అని గానము చేసివున్నారు. మరియునూ; 'ధరఋక్సామాదులలో వర గాయత్రీ హృదయమున—సురభూసుర మానసమున— నియెడ శోభిల్లు సప్తస్వరసుందరుల భజింపవలె మనసా !' — అని జగన్మోహినిరాగము రూపకతాళకృతి యందున చెప్పియున్నారు. మరియు నింకనూ చిత్తరంజని రాగములో ఆదితాళమునందున

ప॥ 'నాదతను మనిశం శంకరం నమామి మే మనసా శిరసా నమామి॥ నాదతను మనిశం శంకరం నమామి॥

అ॥ప॥ మోదకర నిగమోత్తమ సామవేదసారం వారంవారం।

చరణం ॥ సద్యోజాతాదిపంచవక్త్రజ 'సరిగమ పధనీ' వరసప్తస్వర—విద్యాలోలం—విదళితకాలం—విమల హృదయ త్యాగరాజపాలం॥' నా॥

అని చెప్పియుండిరి.

ఈ కీర్తనయందున శివునియొక్క సద్యోజాత, వామదేవ, అఘోర, తత్పురుష, ఈశానము లనియెడి పంచముఖములమండిన్ని 'స—రి—గ—మ—ప—ధ—ని'

అనియెడి సప్తస్వరములున్నూ జనించినట్లు చెప్పి యుండిరి.

పైనను చెప్పియుండినట్టిరీతిగా ఆరు స్థానములనుండిన్ని జనించినట్టివియగు రాగములకు జాతులను నిర్ణయించి, మధ్యమజాతి— పంచమజాతి, షడ్జ మధ్యమములు అని పేర్కొనియుండిరి. మరియును పూర్వమునందున ప్రస్తుతమునందువలె 'రాగములు' అనే పేరుతో నుండెడివికావు. అప్పుడవి (18) పదునెనిమిది విధములగునట్టి జాతులుగా పేర్కొనబడి యుండినవి. అవి వరుసక్రమమున—షడ్జగ్రామ సంబంధములగునట్టి శుద్ధజాతులు ఏడున్నూ, షాడ్జీ, ఆర్షభీ, నైషాదీ, ధైవతీ, షడ్జోదీచ్యవతి, షడ్జకైశికి, షడ్జమధ్యమ—అనునవియున్నూ—మధ్యమగ్రామ సంబంధములగునట్టి వికృతిజాతులు 11న్నూ— గాంధారి, రక్తగాంధారీ, గాంధారోదీచ్యవతి; మధ్యమోదీచ్యవతి—మధ్యమ, పంచమ, గాంధారీ పంచమ, ఆంధ్రి, నందయన్తి, కర్మారవి, కైశికి యనునవి—మొత్తము 18 జాతులు గలవు. (చూడు—భ. నా.—శాస్త్రము) కనుకను ప్రాచీనకాలములో ఈ జాతులు అనంబడునవియే గానమొనర్ప బడుచుండెడివి. ఈ జాతుల నుండియే క్రమముగా ప్రస్తుత రాగములు జనించి యుండినవి. ప్రప్రథమముగా 'రాగము' అనే నామమును పేర్కొనియుండినట్టి లక్షణకర్త 'మతంగుడు' అను నతడు. 'బృహద్దేశి' అనే గ్రంథములో ఈ రాగములను గూర్చి అతడు చెప్పియుండెను. అప్పటి నుండిన్ని ప్రస్తుతమునందుగల రాగములు ఆచరణములోనికి వచ్చియుండినవి అంతకు పూర్వమునందు భరతునియొక్క నాట్యశాస్త్రకాలమునాటికి జాతులు అనునవియే ప్రసిద్ధిలో నుండెడివి. దత్తిలునికాలము వరకున్నూ అట్లే యుండినవి. ఆ తరువాత కాలమున ఈ రాగములు అనునవి, మతంగుని కాలము నుండిన్ని నాల్గవ శతాబ్దమునుండి ఏడవ శతాబ్దము మధ్యకాలమునందున బాగుగా నభివృద్ధిలోనికి వచ్చియుండినవి. అటుతరువాతను 13 వ శతాబ్ది కాలములో శార్ఙ్గదేవుడు తనయొక్క సంగీతసత్నాకరమునందున అనేకములగునట్టి దేశిరాగములను పేర్కొని వాట్లకు లక్షణాదికములను చెప్పియుండెను. ఆ యనంతరమునందున వరుసక్రమముగా 'శ్రీ విద్యారణ్యులు' అను వారిచే (14 వ శతాబ్ది) 'సంగీతసారము' అనే గ్రంథములో 15 మేళములను చెప్పబడి, వాటి క్రిందను జన్యములుగా కొన్నిరాగములు గుర్తింపబడియుండినవి. 16 వ శతాబ్ది మధ్యమునందున (క్రీ॥ త॥ 1550 సం॥రం॥) రామామాత్యుడు 21 మేళములు చెప్పి, వాటి క్రిందను కొన్ని జన్యరాగములను, వాట్లకు లక్షణాదికములను వివరించి చెప్పియున్నాడు—ఆయనయొక్క 'స్వరమేళ—కళానిధి' అనెడి గ్రంథములో. అటుతరువాతను షుమారుగా 17 వ శతాబ్ది ప్రారంభములో (1609—సం॥రం॥)నిట్టల సోమనాథుడు అనునాతనిచేతను 'రాగవిబోధము' అనునట్టి గ్రంథములో అనేకములైనట్టి జనక జన్యరాగములనుచెప్పబడి వాటికి లక్షణాదికములు వివరింపబడి యుండెను. అనంతరమందున క్రీ. వె 1630–1670 ప్రాంతములో అహోబిలుడను నాతనిచేతను 'సంగీత పారిజాతము' అనెడి గ్రంథము రచింపంబడి యుండినది. ఇంచుమించుగా నదే కాలమునందున గోవిందదీక్షితులు అనువారియొక్క ద్వితీయపుత్రుడు వెంకటమఖి యను నాతడు తనకు పూర్వమునందుండినట్టివగు 19 పూర్వ మేళలను పేర్కొని, తత్తత్ జన్యములనుచెప్పి వాటి యొక్క లక్షణములను కూర్పును వివరించియుండెను. ఇతడు సప్తస్వరములయొక్కయును 22 శ్రుతులతో, పదునారు రూపములుగల 12 స్వరస్థానములనుండిన్ని అనగా ప్రకృతి, వికృతి స్వరరూపములచేతను వరుసగా 72 మేళములు పుట్టగలవని నిరూపించియుండెను ఆ డెబ్బది రెండంటినిన్ని పేర్కొని యుండెను. వాటి క్రిందను అనేకములగునట్టి జన్యరాగములను చెప్పియుండెను. అతనికి తరువాత కాలమునందున అవి యన్నియును గూడ వాడుకలోనికి రాగలవని అతడే చెప్పియుండెను. ఈయనయొక్క గ్రంథము 'చతుర్దండి ప్రకాశిక' యనునది. దీనియందున సంగీతవిషయికము లగునట్టి యావద్విషయములమన్నూ చర్చించి యుండెను. ఆ గ్రంథమే ఈ నాడు అధికారికమైనట్టి లక్షణగ్రంథముగానై యుండినది. ఇంతకంటెను కొంచెము ముందటికాలమునందున అనగా 17 వ శతాబ్ద ప్రారంభములో (1600–71

సం. రం. (ప్రాంతం) తంజావూరిని పరిపాలించి యుండినట్టి శ్రీ రఘునాథ నాయకుని కాలములో ఈయనయొక్క మంత్రియే యగునట్టి గోవింద దీక్షితులు (వెంకటమఖి తండ్రి) అనెడి వారియొక్క సలహా సంప్రదింపులతో 'సంగీత సుధ' యనెడి గ్రంథమును రచించియుండెను. ఈ గ్రంథము శ్రీవిద్యారణ్యులవారియొక్క 'సంగీతసారము' నే గ్రంథమును అనుసరించి వ్రాయబడి నట్లుగా నాతడే ఆ గ్రంధమునందున చెప్పియుండెను. ఈ సంగీత సుధా (నిధి) అనే గ్రంథమును తన తండ్రియగునట్టి, గోవిందదీక్షితులే రచించియుండి ప్రభువు అగునట్టి శ్రీ రఘునాథనాయకునికి అంకితము చేసినట్లుగా వెంకటమఖి తన చతుర్దండి ప్రకాశిక గ్రంథములో—'మత్తాతకృతౌ సంగీతసుధా యాం గ్రంథే శ్లోకాజ్ఞాతా లిఖామ్యహమ్' అని చెప్పియున్నాడు. (చూడు. చ. ప్ర. (153—154 శ్లోకములు). అంటే: మా తండ్రిగారిచేతను చేయం బడినట్టిదగు 'సంగీత సుధ' యనెడి గ్రంథమునందలి శ్లోకములను ఉదాహరించి వ్రాయుచున్నాను, అని వ్రాస్తూ ఆ దిగువను కొన్ని శ్లోకములను 'సంగీత సుధా' గ్రంధస్థ శ్లోకముల నుదాహరించి యున్నాడు.

ఇకను తరువాతను 18 వ శతాబ్దములోని వాడగు (క్రీ వె. 1725—30 ప్రాంతము) తంజా పూరి పరిపాలకు డగునట్టి మహారాష్ట్ర ప్రభువు అగు శ్రీ తులజా మహారాజా...'సంగీత సారామృతము' అనియెడి గ్రంథమును రచించియుండెను. దాని యందున ఆ నాటికి ఉండియున్నట్టి జనక—జన్య రాగములయొక్క లక్షణములను విశదీకరించి యుండెను, ఇతడు 22 పూర్వమేళములను పేర్కొని వాటి యందలి జన్యరాగములను పేర్కొని వివరించియుండెను. ఇకను వీటికన్నింటికిన్నీ తరువాతను 'గోవింద'యను నతడు 'సంగ్రహ చూడామణి' యనెడి యొక గ్రంథమును రచించియుండెను. దానియందున వెంకట మఖి చెప్పియుండినట్టి 72 మేళముల పద్ధతినే తాను అవలంబిస్తూనున్నూ ఆయన (వెంకటమఖి) చెప్పి యుండినట్టి మేళనామములను కనకాంబరి, ఫేన ద్యుతి, గానసామవరాళి మొదలుగాగల వాటిని 72 నున్నూ వరుసక్రమముగా పేర్కొనుచూ, వాటికి లక్షణాదికములనుచెప్పి, ప్రతిదానికిన్నీ అంత్యము నందున నూతన నామములను 'కటపయాది సూత్రాను గుణ్యములుగా కనకాంగి; రత్నాంగి; గానమూర్తి మొదలుగాగల ప్రస్తుతమునందు వాడుకలోగల 72 మేళకర్తలయొక్క నామములనున్నూ వరుసగా చెప్పియుండెను. తత్తత్ జన్యములైనట్టి 294 జన్యరాగముల కున్నూ 72 మేళకర్తరాగముల కున్నూ మొత్తమునకు 366 మూడువందల అరు వదియారు రాగములకున్నూ అన్నింటికిన్నీ వరుసగా నొక్కొక్క రాగమునకు ఒక్కొక్క లక్షణ గీతమును గూడను రచించియుండెను. తత్తజ్జన్య ములైనట్టి అన్నిరాగములకున్నూ (300) లక్ష ణములను నిరూపించియుండెను. ఇదియే ప్రస్తుతము నందున ఆచరణయందునగల మేళకర్త జన్యరాగ విధానమై యున్నది. ఈ పైనను చెప్పినట్టి వన్ని యును గూడ ప్రముఖములైనట్టి లక్షణ గ్రంథ ములు. వీటికి తరువాతను ఇంకనూ మరికొందరు మరికొన్ని లక్షణ గ్రంథములను రచించియుండిరి కాని, యవి యంతటి అధికారిక గ్రంథములుగా పరిగ ణింపబడుటలేదు. పైనను చెప్పబడినట్టి గ్రంథ ములే అధికారికగ్రంథములై ప్రాముఖ్యత నంది యుండినవి.

అటుతరువాత కాలమున — సంగీతమూర్తి త్రయము (Musical Trinity) వారగు శ్రీ త్యాగ రాజా, శ్యామశాస్త్రి, ముద్దుస్వామిదీక్షితులనువారు వెలసియుండిరి. వీరు ముప్పురికిన్నీ 'మూర్తిత్రయము' అని పేరు కలిగెను. కర్ణాటక సంగీతమునకు వీరే గురువులుగా వెలసియుండిరి. వీరు ముప్పురున్నూ వేనకువేలుగా తమతమయొక్క రచనలనుజేసి వెల యించియుండిరి. ఇయ్యదియే ప్రస్తుత కాలము నందున ఆచరణవిధానములోగల కర్ణాటక సంగీత చరిత్రయునూ, దానియొక్క పరిణామమున్నూ (History and Evolution of the Karnatic Music) అయియున్నది. ఈ ముప్పురున్నూ 72 మేళకర్తల విధానమునే అనుసరించియుండిరి. వీరిలో ముఖ్యముగా త్యాగరాజు ఈనాడు ప్రచారములో నుండి

యున్నట్టి కనకాంగి—రత్నాంగి—ఇత్యాది నామములు గల నూతనవిధానమునే అవలంబించియుండెను. కాని, ముద్దుస్వామి దీక్షితులు తమ పూర్వుడయినట్టి వెంకటమఖియొక్క కనకాంబరి—ఫేనద్యుతి—మొదలుగాగల నామావళితో నుండినట్టి పూర్వపు విధానమునే అనుసరించియుండెను. శ్యామశాస్త్రి సమయోచితముగా వ్యవహరించి రెండింటినిగూడ నవలంబించియుండెను. ఇట్లు 72 మేళములను అనుసరించి వేర్వేరు రీతులలో నాయాస్వరకూర్పుల ననుసరించి యనేకములగునట్టి జన్యరాగములను వేనకువేలుగా సృష్టించి కర్ణాటక సంగీత సరస్వతిని అలంకరించుచూ, తమతమయొక్క రచనావిశేషములచేతను సేవించియుండిరి. వీరిలో శ్యామశాస్త్రియును త్యాగరాజున్నూ ఆప్తులగునట్టి మిత్రులు. శ్యామశాస్త్రి ముద్దుస్వామిదీక్షితులవారికి శ్రీవిద్యోపదేశమును జేసెను. వీరు ముప్వురున్నూ సమకాలికులుగానే యుండిరి. వీరు ముప్వురున్నూ క్రీ॥ వె॥ 1762 మండి 1847 వరకున్నూగల ఈ మధ్యకాలమునందుండినట్లుగా చరిత్రనుబట్టి తెలియగలదు. వీరి యొక్క రచనాశైలులు మూడున్నూ వేరువేరు బాణీలు (Styles) గా నుండగలవు. అందు త్యాగరాజుని శైలి ద్రాక్షాపాకముగను, ముద్దుస్వామి దీక్షితులవారి శైలి నారికేళపాకముగను, శ్యామశాస్త్రి యొక్క శైలి కదళీపాకముగనూ పోల్చబడినవి. ఈ మూడున్నూ విభిన్నశైలులలో చెప్పబడియున్నవి. ఇకను వీరియొక్క రచనా విశేషములనుగురించి తెలిసికొన్నట్లయితే అనేకములైనట్టి సంగీతశాస్త్ర మర్మములు మనకు తెలియగలవు. త్యాగరాజు స్వరార్ణవ మర్మములను తెలిపియుండెను. ఇతడు అనేకవేల కృతులను చేసియుండెను. వాల్మీకి 24000 ల గ్రంధముల (శ్లోకముల)చేతను శ్రీమద్రామాయణమును సంస్కృతములో రచించియుండెను. త్యాగరాజు 24000 కీర్తనములచేతను శ్రీరామునియొక్క దివ్యచరిత్రమును కీర్తించియుండెను.

ఇకను ముద్దుస్వామి దీక్షితులు తమ పూర్వుల యొక్క సాంప్రదాయమునే అనుసరించి వెంకటమఖి చెప్పియుండినట్టి లక్షణ లక్ష్యముల ననుసరించి, కేవలమును సాంకేతికముగా సశాస్త్రీయముగా నుండెడి విధానమును రూపొందించుచూ తమయొక్క రచనలను జేసియుండెను. వీరి రచనలు అన్నియును సంస్కృతమునందే చెప్పబడియున్నవి ఏవియో కొన్ని వర్ణములు మొదలగునట్టి రచనలు మాత్రము కొద్దిగా తెలుగునందున గలవు. తక్కిన అన్నియునూ సంస్కృత రచనలే యగును. సుమారు 300 లకు పైగా నుండియున్నవి.

శ్యామశాస్త్రి మిక్కిలియును క్లిష్టతరములైనట్టి తాళజాతులయందున తమ ఇష్టదైవతమగునట్టి శ్రీ కామాక్షీదేవీపరముగా తమయొక్క రచనా విశేషములను వెలయించియుండిరి. (వీరియొక్క రచనలు ప్రస్తుతమున బహుకొద్ది మాత్రముగనే ప్రచారమునందుండి యున్నవి.)...........

శ్రీ త్యాగరాజస్వామివారు సంగీతశాస్త్రమును గురించి విశేషించి యొకకీర్తనలో నిర్వచించి యున్నారు. ముఖారి రాగములో ఆదితాళమునందలిదగు నొక కీర్తనను ఈ క్రిందను ఉదాహరణముగా నుటంకించి చూపెదను. పాఠకులు అందలి విశేషములను తెలిసికొందురుగాకయని మా ఆశయమై యున్నది.

పల్లవి : సంగీతశాస్త్రజ్ఞానము
సారూప్యసౌఖ్యదమే మనసా' ॥సంగీత॥

అ. ప : శృంగార రసా ద్యఖిలనాద పూరిత
రామకథానందాదియుత ॥సంగీత॥

చరణం : ప్రేమ విహార సుగుణ వాత్సల్యము
శ్రీ మద్రమావర కటక్షమూ,
వేమనిష్ఠ యశోధనము గల్గనే
నేర్పుమర త్యాగరాజు నేర్పిన ॥సంగీత॥
శాస్త్ర జ్ఞానము
సారూప్య సౌఖ్యదమే మనసా.........

ఈ కీర్తనయందున సంగీత శాస్త్రము యొక్క మహత్తును విపులీకరించి చెప్పియున్నారు. దానివల్లను కలుగునట్టి ఫలితములనుగూడ నిరూపించియుండిరి. ఇట్లే శ్రీవారియొక్క రచనలయందంతటను సంగీత లక్షణ లక్ష్య విశేషములనే

నిరూపించియుండిరి. నారదమహర్షి వారికి ఇచ్చి యుండినట్టి స్వరార్ణవగ్రంథమర్మముల నన్నింటి నిన్నీ లోకమునకు తెలియబరచి యుండిరి. పైనను చెప్పబడియుండినట్టి లక్షణకర్త లందరున్నూ తమ తమ గ్రంథములయందున ఆయా కాలముల యందుండునట్టి సంగీత లక్షణ లక్ష్య విశేషముల నన్నింటినిన్నీ నిరూపించియుండిరి. అవియన్నియును గూడను నాదమునకు ప్రమాణలక్షణలక్ష్యగ్రంథములై అధికారికములై యుండియున్నవి. వాటిని అతిక్రమించుటకు వేరు మార్గము లేదు.

కనుకను గాంధర్వవేదము అనునదియే సంగీత శాస్త్రమై యుండినది. మరియు నింకనూ ఈ గాంధర్వ వేదమునందే సంగీతనాట్యములకు ఉపయుక్తములగునట్టి వాద్యవిశేషములు గూడ పేర్కొనబడి యుండెను. వాటిలో కొన్ని ఈ క్రిందను ఉదహరించి చూపబడును. ఇవి పూర్వకాలమువగునట్టి వాద్యవిశేషములుగా తెలియదగును. అవి ఏవి యనగా:—వల్లకీ, ఝల్లరీ, పటహ, దుందుభి, ఢక్కా; కాహళ; భేరీ; డమరుకము; శంఖము; మృదంగము(మర్దళము); శ్రుతి (Drove) తాళకము; వేణువు; హోళో; వంశాది వాద్యములు. ఇంకనూ మరికొన్ని అవాంతర భేదములుగా చెప్పబడి యుండినవి. ఇదియే గాంధర్వశాస్త్రమునందలి విశేషము అయియున్నది. కనుకను ఈ రీతిగా పూర్వకాలమునందున (బ్రహ్మ) ప్రజాపతివలనను ఈ శాస్త్రము (గాంధర్వము) పుట్టబడి యుండినట్లుగా చెప్పబడుచున్నది. పూర్వకాలములో బ్రహ్మదేవునిని సూర్యుడు తనకు శ్రమావనోదనము కొఱకై ఏదైన నొక విశేషమును సృష్టించి యొసంగుమని ప్రార్థించి యుండెను. అంతట నా బ్రహ్మ ఇంచుక ధ్యానించి నట్టివాడై యోచించి, చతుర్వేదములనుండిన్నీ వరుసగా ఋగ్వేదమునుండి పాఠ్యమును (నాట్యమును)న్నూ; యజుర్వేదమునుండి అభినయమునున్నూ; సామవేదము నుండి సంగీతమునున్నూ; అథర్వణవేదమునుండి రసమునున్నూ గ్రహించి, యాతడే గాంధర్వమును రచించి పంచమవేదము (నాట్యవేదము)గా నొనర్చి యుండెను. ఇదియే భరతుని నాట్యశాస్త్రమై వెలసి యుండినది. ఇంకను—

ఈ నాట్య విధానములో తాండవము, లాస్యము అనెడి భేదములుండి యున్నవి. శివుడు తాండవమునున్నూ పార్వతి లాస్యమునున్నూ రూపొందించి యుండిరి. శ్రీ మహావిష్ణువుఅందుకు అనుకూలములగునట్టి చతుర్విధవృత్తులనున్నూరూపొందించియుండెను. విశ్వకర్మ రంగమండపమును నిర్మించెను. బ్రహ్మదేవుని యాజ్ఞానుసారముగా— భరతముని ఈ (గాంధర్వ) నాట్యవేదమును మానవలోకమునందున వ్యాప్తి నొనరించియుండెను. మరియును శివునియొక్క భక్తాగ్రేసరుడు బాణాసురుడు. ఈ బాణాసురుని — కుమార్తెయే ఉషాకన్య. ఈ యుషాకన్య పార్వతీదేవి వద్దను నాట్య (గాంధర్వ) వేదమును అభ్యసించి యుండెను. ఈమె శ్రీకృష్ణునియొక్క కుమారుడు అగు ప్రద్యుమ్నుని పుత్రుని అనిరుద్ధుని వలచి, వరించి వివాహమాడెను. అతనియొద్దను ఆమె వీణా సంగీతములను నేర్చుకొనియుండెను. ఈమె ద్వారకాపురవాసులగునట్టి గోపికలకు సంగీతనాట్యములను అభ్యసింపజేసియుండెను— అని ఇట్లు పౌరాణికముగా నున్నూ చారిత్రకముగానున్నూ తెలియుచున్నది.

ఈయొక్క గాంధర్వవేదమును—నాద—గంధర్వ—భరత — తౌర్యత్రిక—సంగీతగ్రహ— సమగ్రహ — అతీతగ్రహ—అనాగతగ్రహ — విషమ—కాల—మార్గ—క్రియ—అంగ—జాతి— ద్రుతలయ—మధ్యలయ — విలంబితలయ లనెడి పేర్లచేతను పిలువబడుచుండెను. ఈ గాంధర్వవేదమనునది అందలి గీతనృత్తనృత్య(నాట్య)వాద్యము లనునట్టి భేదముల చేతను బహుళవ్యాప్తిని జెంది యుండినది దీనియొక్క ప్రయోజనము— దేవతారాధనాదులయందున్నూ; నిర్వికల్ప (నిష్ఠాగరిష్ఠ) సమాధులయందున్నూగూడ నీ గాంధర్వ వేదము యొక్క సిద్ధిని పొందవచ్చునని నిరూపింపబడి యున్నది. ఇయ్యదియే దీనియొక్క మహద్విశేషముగా తెలియదగినది.

ఇకను—ప్రస్తుత కాలమునందలి గాయకోత్తములనుగురించి ఇంచుక విమర్శించి తెలిసికొందము. 'ఎందరో మహానుభావులు—అందరికీ వందనములు' — అని త్యాగరాజస్వామివారు కీర్తించియున్నారు. కనుకను

ఈనాడు కర్ణాటక సంగీత సరస్వతిని యుపాసించి ఆరాధించుచున్నట్టి మహనీయుల గునట్టి యీ గాయ కోత్తములున్నూ, గాయనీమణులున్నూ ఎందరెందరో ఉండియున్నారు. అట్టి యీ మహనీయుల కందరి కిన్నీ వందనముల నర్పించుకొందము. అట్టి వారంద రున్నూ ఈనాడు సంగీతకళావ్యాప్తి నొనరింపు చున్నారు. బహుళముగానీనాడు దేశవ్యాప్తముగాకాని ప్రస్తుత కాలమునందున కొంతవరకు బాహుళ్యము గానీనాడు విచారించి చూచినట్లయితే మనయొక్క గాయకులు కేవలమున్నూ లక్ష్యము మాత్రమే ప్రాధా న్యముగా గ్రహించి, లక్షణమును విస్మరించుచున్నారు. అందువల్లను పశాస్త్రీయమైనట్టి కళ కొందరి యందున లోపించుచున్నది. సాంకేతిక పరిజ్ఞానలోపము చేతను ఎట్లయిననూ లక్ష్యమును అనుసరించియే లక్ష ణముకూడను ఉండవలయునియెడి సూత్రమును అనుసరించి విమర్శించి చూచినట్లయితే ఈనాడు చాలమంది గాయకులలో శాస్త్రలక్షణాదిక పరి జ్ఞానము లోపించినట్లుగా కనుపడుచునేయున్నది. సంగీతము శాస్త్రసమ్మతము, భక్తియుక్తము, భగవ త్కీర్తనమున్నూ కానట్టిది నిరుపయోగము అని పెద్దలు విజ్ఞానవేత్తలున్నూ చెప్పియున్నారు. 'సంగీత శాస్త్రజ్ఞానమున – భక్తివినా — సన్మార్గము గలదే ఓ మనసా?' యని త్యాగరాజస్వామివారు ధన్యాసిరాగము నందలి ఆదితాళమునందుగల కీర్తనలో చెప్పియున్నారు. మరియును వీరు (త్యాగరాజస్వామివారే) కేవలమున్నూ డాంబికులు, వేషధారులును అయినట్టివారినిగూర్చి నిరసించియున్నారు. ఒకానొక సందర్భములో శ్యామ శాస్త్రిగారియొక్క శిష్యులలో కొందరు త్యాగరాజా వారి వద్దకువచ్చి శ్యామశాస్త్రిగారియొక్క రచనలను పాడి యుండిరట. శ్యామశాస్త్రులవారియొక్క రచనా మాధుర్య విశేషములనుగురించి త్యాగరాజస్వామివారికి సంపూర్ణముగ తెలిసియేయుండినట్టి కారణముచేతను, వారలు ఆ కీర్తనలను పాడుటలో యథార్థ భావ రాగ తాళ లయాది రసవిశేషములను గుర్తెంటుగక ఎట్లో పాడియుండిన కారణముచేతను శ్రీ త్యాగరాజస్వామివారు చాల అసంతృప్తిని పొందినట్టివారై వారిని నిరసించి యుండిరి. అట్టి ఆ సందర్భములోననే వారలను మందలించి విషయములను అన్నింటివిన్నీ వారికిచెప్పి పంపియుండిరి. అప్పటి యీ సందర్భములోనే శ్రీ త్యాగరాజస్వామివారు చెంచు కాంభోజిరాగములో ఆది తాళమునందున ఈ క్రింద నుదాహరింపఁ బడినట్టి కీర్తనను రచించియుండిరని తెలియగలదు.

పల్లవి॥ 'వర రాగ లయజ్ఞులు దా మనుచు
వదరేరయా శ్రీరామా ॥వరరాగ॥

అ॥ ప॥ స్వరజాతి మూర్ఛనా భేదముల్
స్వాంతమందు దెలియక యుండినా
॥వరరాగ॥

చరణము॥ దేహోద్భవంబగు నాదముల్
దివ్యమౌ ప్రణవాకారమనే
దాహంబెఱుంగని మానవుల్
త్యాగరాజనుత యేచేరు రామా॥
వర రాగ లయజ్ఞులు దామనుచు
వదరేరయా శ్రీరామా॥.........

ఇత్యాదిగ చెప్పియుండిరి.........అట్టిదాంబిక గాయకులను నిరసించియుండిరి. ప్రస్తుతమునందున నీ నాడుకూడను అట్టి దాంబికులగునట్టి గాయక నామధారులు కొందరుండి యుందురని మనము తెలిసి కొనుట చాలా అవసరమై యున్నది. అట్టి యీ దాంబి కులవల్లను కళ ఉద్ధరింపబడకపోగా క్షీణింపగలదు. ఈనాడున్నూ మనకు ఉత్తమోత్తములైనట్టి గాయ కాగ్రేసరులెందరో ఉండియే యున్నారు. అట్టివారి వల్లనే కళోద్ధరణము జరుగగలదు. అట్టియీ మహనీయులందరున్నూ సామాన్యులుగనే నిరాడంబ రులై, నిర్వికారులై యుందురు. అట్టియీ మహ

సీయుల కందరకును వందన శతంబులు అర్పింతును.*

ఇకను 'నారదశిక్షా' గ్రంధమును గురించిన్నీ తద్గ్రంధస్థ విషయములను సంగీత సంబంధములైనట్టి ముఖ్యవిషయములగు కొన్నింటిని ఈ క్రిందను వివరింతును. పాఠకులు గమనింపఁ దగుదురు.

## నారదీయశిక్షా గ్రంథము

దీనిని 'నారద శిక్ష' అనిన్నీ 'శిక్షా' గ్రంధము అనిన్నీ పిలుతురు. ఈ గ్రంథమును నారదుడు రచించెను. 'ఈ నారదు డనునతడు పూర్వకాలము నందుగల పురాణ ప్రసిద్ధి నొందినట్టి వఱొని నారదుడా?—లేక తరువాత కాలమున ఆ పేరుతో పిలువబడెడి మరియొక నారద నామధారియా?' అని మనము విచారించి తెలిసికొనవలసి యున్నది. వఱొని యగునట్టి నారదుడు 'స్వరార్ణవము' అనెడియొక గాంధర్వవేదగ్రంథమును త్యాగరాజునకు ఇచ్చియుండెనని మనకు త్యాగరాజునియొక్క రచనలవల్లను తెలియుచున్నది. ఇకను తరువాత నారదుడు అనే పేరుగల మరియొకరు 'సంగీత మకరందము' అను నొక సంగీత గ్రంధమును రచించి యుండిరి. ఈ నారదుడు షుమారుగా , క్రీ. శ. 7 వ శతాబ్దమునందలి వాడు అని తెలుస్తున్నది. దీనియందున సూర్యాంశ, చంద్రాంశ రాగములు, రాగ రాగిణీ పుత్ర మిత్ర రాగ విధానములను గురించి చెప్పఁబడియున్నది. మరియు నింకనూ—ఈ నారదుడు పూర్వకాలమునందలి పౌరాణికవఱొనియగునట్టి నారదునిగురించి ఆతనియొక్క సంగీతమకరందమనెడి గ్రంథములో ప్రస్తుతించి యున్నాడు. అందువల్లను వీరిద్దరును వేరువేరు వ్యక్తులనియే తెలుస్తున్నది. నారదశిక్షా గ్రంథస్థ విషయములనుబట్టి విమర్శించి చూచినట్లయితే - ఆ శిక్షా గ్రంథము ప్రత్యేకముగా పూర్వకాలమునందుండినట్టి సామగానమును గురించిన్నీ, ఆ సామగానముయొక్క గానవిధానపురీతినిగురించిన్నీ, ఇంకనూ పూర్వమున వేదకాలమునుండిన్నీ ఉండియున్నట్టి పౌరాణికోక్తము లగునట్టి గానవిధానవిశేషములనే చెప్పచున్నది. కనుకను ఇది పూర్వకాలమునందలి పురాతన గ్రంథమేనని తెలుస్తూవున్నది కూడను. నారదకృతమగునట్టి సంగీతమకరంద గ్రంథముయొక్క వ్రాత ప్రతి (Manuscript) నావద్దను సేకరింపఁబడియున్నది. ఈ రెండింటియందలి విషయ వివరణములనుబట్టి చూచినట్లయితే వాటియొక్క వ్యత్యస్థములు తెలియగలవు. కనుక నీ రెండున్నూ భిన్నభిన్నవ్యక్తులచేతను భిన్నభిన్నకాలములయందున వ్రాయబడియుండినట్టి గ్రంథములని రూఢిగానే తెలియుచున్నది. కనుకను శిక్షాగ్రంథమే పూర్వపుదిగా తెలియగలదు. ఇకను ఈ నారదీయశిక్షాగ్రంథమునందలి విషయములను ముఖ్యములైనట్టి వాటిని కొన్నింటిని క్లుప్తముగానున్నూ, సూత్రప్రాయముగానున్నూ ఈ క్రిందను విశదీకరించి చూపెదను. వాటినిబట్టి ఆ శిక్షా గ్రంధముయొక్క ప్రామాణ్య, ప్రాశస్త్యములు మనకు బోధపడగలవు. కనుకను ఆయావిషయ వివరణమును కొంతవరకు క్లుప్తముగాచెప్పి ఈ వ్యాసమును ముగింతును.

'నారదశిక్ష' యనెడి గ్రంథములో సామగానమును గురించి ఈ క్రిందివిధముగా చెప్పఁబడియున్నది.

> 'సామవేదేతు వక్ష్యామి
> స్వరాణాం చరితం యథా।
> తాన రాగ స్వర గ్రామ
> మూర్ఛనానాంతు లక్షణం'—

---

* నోట్:—ఈ వ్యాసమునందున నుదాహరింపబడియుండినట్టి విషయము లన్నియును గూడ—ఆధార, అధికార సహితములుగనే వ్రాయబడి యున్నవి. ఆయా అధికారములను ఆయా గ్రంధములయందువ చూడదగును. ఇందున నుదాహరించి యుండినట్టి లక్షణ గ్రంథము లన్నియునూ ముద్రితములుగావీ, అముద్రితములుగానీ (వ్రాతప్రతులు) నా వద్దను సేకరింపబడియున్నవి. ఏవియైననూ సందేహము లుండినట్టి వారు నన్ను కలుసుకొని ఆయా గ్రంథస్థ విషయములను చూచుకొనవచ్చును. వారియొక్క సందేహములుగానీ సంశయములుగావీ నివారణము కాగలవు. కనుకను ఎవ్వరికైనను ఎట్టి సందేహము లుండియున్నచో నాకు వ్రాసి తెలుపవలసినదిగా వారికి నా యొక్క మనవి. ఇందేవైనను లోపములుండువెడల విజ్ఞానులైనటి పెద్దలు అట్టి విషయములను సాధికారములుగా నాకు తెలుపగలందులకు వారిని ప్రార్థించుచున్నాను.

'సప్తస్వరా స్త్రయోగ్రామా
మూర్ఛనా ద్యేకవింశతిః ।
తాన ఏకోనపంచాశ
దిత్యేత త్స్వరమండలం ।
షడ్జశ్చ ఋషభశ్చైవ
గాంధారో మధ్యమ స్తథా ॥
పంచమో ధైవతశ్యాద్
నిషాద స్సప్తమస్స్వరః'—

అనగా-సామవేద స్వరములను, వాటియొక్క నడకలను చెప్పుచున్నాను ఏడు స్వరములు, మూడు గ్రామములు, ఇరువదియొక్క మూర్ఛనలు, నలుబదితొమ్మిది తానములు—అందు షడ్జ—ఋషభ—గాంధార—మధ్యమ—పంచమ ధైవత—నిషాదములని ఏడు స్వరములు ఇత్యాదిగా నన్నింటియొక్క లక్షణములున్నూ చెప్పబడెను. నారదాదిశిక్షలు వేదాంగములలోనివి. శిక్షలు అనంబడెడివాటిలో నారదశిక్ష యనునది యొక్కటియే గాక నింకనూ మరికొన్ని శిక్షాగ్రంథములు ఉండియున్నవి. వీటిలో సంగీతశాస్త్రములైనట్టి పారిజాతాది గ్రంథములలో చెప్పినట్లే స్వరగ్రామతానాది విశేషములు చెప్పబడెను. కావున సంగీతమంతయును సామవేదమునందు పుట్టినది అవదగును. కనుకనే 'గాంధర్వవేదము' అని ఉపవేదములలో దీనిని ఒక్కటిగా పరిగణించి చెప్పియున్నారు. మరియునూ ఈ యొక్క గానస్వరూపమును మరికొంతగా వివరింపవలయును.

'గానస్యతు దశవిధా గుణవృత్తిః । తద్యథా రక్తం; పూర్ణం; అలంకృతం; ప్రసన్నం;—వ్యక్తం; వికృష్టం; శ్లక్ష్ణం; సమం; సుకుమారం; మధురం;—

అని గానమునకు పది గుణములు గలవు. అవి వరుసగా :

రక్తం—వేణువీణాది స్వరముల ఏకీభావము రక్తమనంబడును.

పూర్ణం—అనగా స్వరశ్రుతిఛందఃపాదాక్షరముల వల్లను పూర్ణత గలిగినట్లయితే అట్టిది 'పూర్ణము' అనంబడుచున్నది.

వ్యక్తమ్—అనగా—పదపదార్థస్ఫూర్తి గలుగునట్లుగా గానము చేయుట వ్యక్తము అనంబడును.

వికృష్టమనగా—ఉచ్చైస్స్వరములో పాడిననూ అర్థము -పదములు- స్పష్టముగానుండుట వికృష్టము.

మధుర మనగా స్వభావముచేతను లలితాక్షర విన్యాసమూ తదుచ్చారణాలాలిత్యము గలుగుట.

ఇట్లే ఇతరములు అన్నియును నారదశిక్షలో వ్రాయబడియున్నవి. ఈ పది విధములైనట్టి గాన విశేషములలోనున్నూ—

'ఆచార్యా స్సమ మిచ్ఛన్తి
పరిచ్ఛేదంతు పండితాః।
స్త్రీణాం మధుర మిచ్ఛన్తి
వికృష్ట మితరేజనాః'

అని చెప్పబడినది. అంటే: సమగానమును ఆచార్యులు ఆమోదింతురు. పరిచ్ఛేదమును పండితులు ఆమోదింతురు. మధురగానమును స్త్రీలు ఆమోదింతురు. వికృష్ట గానమును తదితరులు ఆమోదింతురు అని ఆ గ్రంథమునందుననే చెప్పబడి యున్నది. ఇంకనూ మరియొక విశేషమును గూడ గమనింపదగును.

'యస్సామ గానాం ప్రథమః
సవేణోర్మధ్యమస్వరః
యోద్వితీయ స్సగాంధార
స్తృతీయ స్త్వృషభస్మృతః'—

అనగా సామగానమునందలి ప్రథమ స్వరము వేణుగానమందున మధ్యమ స్వరమగును. రెండవది గాంధారమున్నూ మూడవది ఋషభమున్నూ అగుచున్నవి. ఇత్యాదిగా సామవేద స్వరములకును వేణునాదస్వరములకునూ భేదము గలదని చెప్పబడెను. మరియునూ,

'దారవీగాత్ర వీణాచ ।
ద్వేవీణే గాన జాతిషు ।
సామికే గాత్రవీణాతు
తస్యాఃశ్రుణుత లక్షణమ్॥
గాత్రవీణాతు సా ప్రోక్తా
యస్యాం గాయంతి సామగాః
స్వర వ్యంజన సంయుక్తా
అంగు ళ్యంగుష్ఠ సంజ్ఞితా।
హస్తౌ సుసంయుతే ధార్యౌ
జానూభ్యా ముపరిస్థితౌ'

ఇత్యాదిగా—కరతో చేసినది యొకవీణ—శరీర యొక వీణ (గాత్రవీణ) అని వీణలు రెండు. గాత్ర వీణతో సామగానమును చేతురు. కాలి మణుకుల విూదను చేతులు వ్రేళ్ల అంగుష్ఠమును కలియ కుండగాచాచి, యా వ్రేళ్లతో స్వరముల సంజ్ఞలను చూపుచూ శిష్యులకు గురువు సామగానమును నేర్ప వలెను. ఫలానా వ్రేలు ఫలానా స్వరమునకు గుర్తు అని యొక పరిభాష గలదు.

'హస్తేనాధ్యాపయేచ్ఛిష్యాన్
శైక్షేణ విధినా ద్విజః'

శిక్షతో చెప్పినట్టి విధమున చేతితో శిష్యులకు గానమును నేర్పవలెనని నారదశిక్షలో గలదు. అట్లే ఈనాటి యనుసరణమున్నూ గలదు మరియునూ;

"ఉదాత్తే నిషాదగాంధారే
అనుదాత్తే ఋషభ ధైవతౌ।
స్వరితప్రభవా హ్యేతే:
షడ్జ మధ్యమ పంచమాః'

ఉదాత్తమందున నిషాధ గాంధారములు, అను దాత్తమందు ఋషభ ధైవతములు, స్వరితమందున షడ్జపంచమ మధ్యమములున్నూ పుట్టెను. అందువలన సప్తస్వరములునూ ఉదాత్తాదిగా మూడు స్వరములలో నిమిడియున్నవని తాత్పర్యము. ఈ యుదాత్తాది స్వర త్రయము కొంత మార్పుగలిగి అయిదు స్వరములు అనఁబడెను. (చూడు. నారద శిక్షా).

'ఉదాత్తోహ్యనుదాత్తశ్చ
స్వరిత ప్రచితేతధా।
విఘాతశ్చేతి విజ్ఞేయః
సర్వవేదస్తు పంచధాః'

అని ఉదాత్తానుదాత్తస్వరితములు గాక సామ వేదమున ప్రచయము, విఘాతము, అని మరి రెండు స్వరములు చెప్పబడెను. మరిన్నీ — అంక స్వరము; అక్షరస్వరము అనునవి గూడను కొన్ని సంకేతములు గలవు. ఆ సంకేతముల ననుసరించి సామగానవేత్తలు, సామమును, గానము ఒనర్తురు. అందువల్లను ఈ ఏడు స్వరములున్నూ పరిశుద్ధము లైవట్టివిగా వెంచబడివున్నవి—'శుద్ధ స్వరములు' అని పేర్కొన బడినవి. తక్కిన అన్ని స్వరరూపములున్నూ (15) సామాన్య జానపదగానమునందున్నూ, లౌకిక గానమునందున్నూ ఉపయోగించుటవల్లనూ సామ గానమునందువ నివి దూష్యములు అగుటవల్లనున్నూ అవి—'వికృతులు' అని పిలువబడినవి. ఇటు నీరీతిగా నారద శిక్షా గ్రంథమునందున చెప్పబడియుండెను.

నారద కృతములు అని చెప్పబడుతూవున్నట్టి గ్రంథములుమూడు మాత్రమేగలవు. అవి(1)నారదీయ శిక్షా గ్రంథము (2) రాగ నిరూపణము (3) సార సంహిత' యనునవి. కాని ఈ మూడింటిలో తక్కిన రెండింటి విషయములున్నూ చెప్పటకు ఆ గ్రంథ ములు ప్రస్తుతమునందున మనకు లభ్యములుగా లేవు. ఇకను నారద కృతము అని చెప్పబడినట్టి గ్రంథము 'సంగీత—మకరందము' అనునది. దానిని గురించి ఇంతకుముందు చెప్పబడియుండెను కనుక ప్రముఖముగా చెప్పబడి యుండినట్టిది 'నారద శిక్షా' యనెడి గ్రంథమే యగును. దీనియందంతటనున్నూ సామగాన విషయికముగావే చెప్పఁబడియున్నది. ఈ నారదశిక్షాగ్రంథము సంగీతమకరందమున కంటెను గూడ పూర్వపు గ్రంథమై యున్నది. కనుక ప్రస్తుతమునందు ముఖ్యముగా చెప్పఁదగినట్టి విష యము సంగీతమునకు మూలము సామవేదమేనని రూఢిగా చెప్పవలసియున్నది. ఆ సామవేదమునుండియే గాంధర్వవేదము సృష్టింపబడినది. పూర్వకాలము నందున 'మార్గ'సంగీత మనునది సామగాన విధాన మును అనుసరించియే పాడబడుచుండెడిది. అనంతర కాలమునందునను 'మార్గ' సంగీతము అంతరించి 'దేశి' సంగీతము ప్రచారములోనికి వచ్చియుండెను. మతంగుని కాలమునుండిన్నీ ఈ 'దేశి' విధానమే ప్రచారములోనికి తేబడినది. అందువల్లనే అతడు (మతంగుడు) తన గ్రంథమును 'బృహద్దేశి' యని పేర్కొనియుండెను. ఆతడు ఆ గ్రంథమునందున మొట్టమొదటగా దేశి రాగములను చెప్పియుండెను. తరువాతను రాగసాంప్రదాయము క్రమముగా నభి వృద్ధిపరుపబడినది. ప్రస్తుత కాలమునందున నీ రాగ సాంప్రదాయమే మన కర్ణాటక సంగీతమునందు ప్రచారములో నుండియున్నది. ఇది అత్యుత్తమ సంప్ర దాయముగా పరిగణింపఁబడియుండినది. ఇట్టి దీనినే ('Melodical System') 'మెలోడికల్ సిస్టమ్' అని యందురు. పాశ్చాత్యులయొక్క గాన విధానమును ('Harmonical System') 'హార్మోనికల్ సిస్టం' అనియునందురు. ఈ రెండు విధానములే ఆచరణ యందువ నుండియున్నవి.

# కాళరాత్రి

శ్రీ శనగన నరసింహస్వామి

## 1

శ్రాంతలోకము స్వాపయోషాకరోప
లాలితం బౌచు మెల్లగా సోలి తూలె—
ఈ చలచ్చంచలావళీరోచిరుగ్ర
ఘన ఘనాఘన గర్జా ప్రకంప్యమాన
వార్షిక నిశీథవేళ— దుర్వారదంష్ట్రి
కాంత రుద్భిన్న వికటాట్టహసిత రసిత
వీచుల మదీయకుటి దీపమే చలింప—

పలిత కేశ పరీత దుర్లలిత రోష
భీషణాకారమున కనిపించి యెదుట
తాండవ మొనర్తువేల అకాండముగ కృ
తాంతదూతి! ద్యావాపృథివ్యంతరమున ?

## 2

ఓ కఠోర మనస్వినీ! ఓ దురంత
పాపపంకిలకేళినీ! ప్రాణిలోక
మోహినీ! తావకోన్నిద్ర బాహుబంధ
బంధన విమూర్ఛితుడు గాని పంచజనుడు—
తావకారక్త వృత్తనేత్ర ప్రదీప్తి
కాచ్ఛటం బడి భస్మంబుగాని మర్త్య
డీ జలధిమేఖ లోర్వర నెవడు లేడు!
అపజయములేని మారణోద్యమము నీది!

శిథిల గేహము వోలె, విశీర్ణవృద్ధ
బహుజటాజూట వట మహీరుహమువోలె;

ముడుతలంబడ్డదేహము, బడుగుమోము
తోడ పాలించుకొమ్మ నిస్తులితరజని !

## 3

ఎవరెఱుంగరు నీ పరు వవధరింతు
వొక శ్మశానంబుగా జగం,బొక కరాళ
కాళరాత్రిగ ప్రతినిశ గౌరవింతు,
వెపుడు పుట్టితివో ! వయస్సెంతొ ! పొంచి
వివిధ జీవుల వెంటాడి వేటలాడు
వృత్తమే ! నిత్య ముద్ధతనృత్తమే ! యి
కెంతకాలము ప్రభుత నెగ్గించుకొందు
వీ యమాయికజంతుసౌహృదముమీద —

వర సతీజనదుఃఖాశ్రు వారిపూర
సాగరోదర పావకజ్వాల లందు
మాడిపోయెద వొకనాడు మదము కరగి !

దుర్భర దురంత రోగ సందర్భ దుర్బ
లాంగపిశితాశనమ్మొ ! జన్మైకసిద్ధ
పరమదారిద్ర్య వేదనా ప్రతిదిన పరి
శుష్కమాణాంగమాంసమస్తిష్క భక్ష
ణమ్మొ ! నిందా నితాంత మందాక్ష వినత
జడ బధిర వృద్ధదేహ భోజనమొ ! మఱగి

జిహ్వారుచిచచ్చిపోయినచెనటిరక్క
సీ ! యసీ ! యని శపియింప సిగ్గులేదు !
నీకు లజ్జలేమి యెఱింగి నిఖిలజగము
సిగ్గుపడిపోయె నేటికి శిరము వంచి !

## 5

కంటకక్రిమిసంకులగాత్రసంగ
భూరిశృంగారయోగము — పూతిగంధి

శవదహనధూమపానానుభవము· -నర్ధ
దగ్ధవస్త్రైకభోగ మస్నిగ్ధకేశ
పాశసంచయనియమవైభవము—భగ్న
కుంభలాభము—భస్మ కుసుంభ లేప
నోపయోగము—నరకపాలోరుదీర్ఘ
కంఠమాలాసహస్రసదుష్కరభరణము —

ఒక మహాభాగ్యశాలిగా నాఱగిపోదు
వేమి కాటివెన్నెలనవ్వు లేమి సిరులు !

## 6

అల్లదే ! నాకుటీదీపమాఱిపోయె,
నాగిపోయెను పవమాను డాకసమున
విచ్చిపోయెను మబ్బులు విలవిలమని,
వర్షధారాభిషేకము వట్టిపోయె,
మొద్దుజగము నిశ్శబ్దము మునిచివైచె;
స్వాగతము ! మృత్యుదేవతా ! స్వాగతమ్మ !
ఉక్కుచెప్పులు దాల్చియోహో ! యటంచు
నడచి పామ్మంక నా లేతయెడదపైన.



# ఆధునిక భాషాశాస్త్రం - మరికొన్ని విశేషములు

డా. పి. ఎస్. సుబ్రహ్మణ్యం

పందొమ్మిదో శతాబ్దంలో పండితులకి ప్రపంచంలోని వివిధ భాషల్ని గురించిన విజ్ఞానం లభించడంవల్ల ఈ భాషల నిర్మాణంలో విభిన్నత ఉందనే సత్యం తెలిసింది దానితో ప్రపంచ భాషలన్నీ హీబ్రూనించి జన్మించాయనే దురభిప్రాయం తొలగిపోయింది ఈ కాలానికిముందే లుదోల్ఫ్, హెర్వాస్ మొదలైన పండితులు భాషల జనన సంబంధాన్ని నిర్ణయించడానికి పదాల్లో సామ్యంకన్న వ్యాకరణనిర్మాణంలో సామ్యం ప్రధానం అన్న విషయం గుర్తించారు. పందొమ్మిదో శతాబ్దంలో ఈ సూత్రాన్ని ఆధారంగా చేసుకుని భాషల పరస్పర సంబంధాన్ని వర్ణాలలోనూ, వ్యాకరణ నిర్మాణంలోనూ పండితులు అన్వేషించడం ప్రారంభించారు. సుదూరప్రాంతంలోని సంస్కృతభాషకీ, లాటిన్ గ్రీకు భాషలకీ పదాలలోను వ్యాకరణనిర్మాణంలోనూ సామ్యం కనపడేటప్పటికి అందరి పండితుల ఆసక్తి ఇండో యూరపియన్ భాషలమీద కేంద్రీకృతమైంది. ఈ కాలంలోనే ఫిన్నో–ఉగ్రియన్ భాషా కుటుంబంలోని భాషల పరస్పర సంబంధం, సెమిటిక్ భాషా కుటుంబంలోని భాషల పరస్పర సంబంధం తెలిసినా, పండితులు చాలామంది వీటిపై పరిశోధన సాగించలేదు. దీనికి కారణం: ఫిన్నో–ఉగ్రియన్ భాషలు చాలా ప్రాచీన కాలంలోనే విడిపోవడంవల్ల వాటిలోని సామ్యాలు చాలా తక్కువగా ఉన్నాయి. వీటిలో ప్రాచీనకాలంనించీ గ్రంథాలుకాని, శాసనాలుకాని లేకపోవడంకూడా దీనికి మరొక కారణం. ఇంక సెమిటిక్ భాషలలో అనేకమైన ప్రాచీన గ్రంథాలూ, శాసనాలూ లభిస్తున్నా ఈ భాషలు వాటి ప్రాచీన రూపాల్లోకూడా చాలా మార్పులుపొంది వాటిలో ఒకటికూడా మూలభాషకి సన్నిహితంగా లేవు. అయినా వాటి పరస్పర సంబంధం అతిస్పష్టంగా గోచరించడంవల్ల వాటిలో పరిశీలించి కనిపెట్టవలసిన విషయాలు అంతగా లేవు. ఈ కారణాలవల్ల ఇండో–యూరపియన్ భాషలనే ఆ నాటి పండితులంతా పరిశోధించి ఆధునిక భాషా శాస్త్రానికి పునాదులైన మూలసూత్రాల్ని కనుగొన్నారు. ఈ పరిశోధనలు సాగించిన పండితుల్ని గురించీ, వారు ప్రతిపాదించిన సిద్ధాంతాల్ని గురించి వరసక్రమంగా పరిశీలిద్దాం.

## 1. ఫ్రెడ్రిక్ వోన్ ష్లెగెల్

ఫ్రెడిక్ వోన్ ష్లెగెల్ జర్మన్ భాషలో రచించిన గ్రంథం (1808) భాషా శాస్త్రాభివృద్ధికి చాలా సహకరించింది. ఈ గ్రంథంలో సంస్కృతం, జెర్మన్ గ్రీక్, లాటిన్ భాషల్లోఏమాత్రం మార్పు లేకుండా సమానంగా ఉండే పదాల్ని ఈయన సంగ్రహించి చూపారు. ఈపదాల్లోసామ్యం సంస్కృత భాష, ఈ పదాల్ని యూరపియన్ భాషల్నించి ఎరువు తెచ్చుకోవడంవల్ల వచ్చిందనే అభిప్రాయాన్ని ఈయన ఖండిస్తూ, ఈ సామ్యం ఇటువంటి పదాల్లోనేకాక వ్యాకరణ నిర్మాణమంతటా కూడా గోచరిస్తోందని సూచించారు. ఈయన ధ్వనుల్లో ఏవీ మార్పులేకుండా ఉన్న సమానపదాలనే (Cognates) గ్రహించి, ధ్వనుల్లో కొంచెం మార్పులున్న సమానపదాలపై దృష్టి కేంద్రీకరించకుండా వదలివేశారు. లాటిన్ భాషలో 'ఫ' ('f') అనే వర్ణం స్పానిష్‌లో 'హ'గానూ లాటిన్ 'ప' జర్మన్‌లో 'ఫ' ('f') గానూ తరచుమారుతాయి అనే

విషయం గుర్తించికూడా ఇటువంటి 'ధ్వనిసూత్రాలు' మిగిలిన భాషలలో ఏర్పరచడానికి ఈయన ప్రయత్నించలేదు. అట్లా చేసి ఉంటే భాషా శాస్త్రానికి ఈయనే మూలకారకులయ్యేవారు. జర్మన్ భాషకీ, ఇర్షియన్‌కీ సన్నిహిత సంబంధం ఉందనే సమర్థనీయంకాని అభిప్రాయానికికూడా ఈయన లోనయ్యారు. తులనాత్మకవ్యాకరణం రచించకపోయినా "Compa-rative grammar" ('తులనాత్మక వ్యాకరణం)' అనే పదాన్ని మొదట ఉపయోగించిన వారు ఈయనే అని మనం గుర్తించాలి. ఇంకా ప్రపంచంలోని భాషలన్నింటినీ రెండు ముఖ్యమైన తెగలుగా విభజించడానికి ఈయన ప్రయత్నించారు. మొదటి తెగలో ధాతు రూపంలోని మార్పులవల్లే అనేకార్థాలు సూచిస్తూ, ప్రత్యయాలు ఎక్కువగాలేని సంస్కృతం మొదలైన ఇండో—యూరపియన్ భాషల్ని, రెండవ తెగలో ప్రత్యయాల్ని ఎక్కువగా ఉపయోగించే మిగిలిన ప్రపంచ భాషల్ని ఈయన చేర్చారు. కాని చైనా భాషవంటి కొన్ని భాషలు ధాతువుల్లో రూపభేదంలేక ప్రత్యయాల్నికూడా ఉపయోగించక పోవడంవల్ల ఈ రెండు తెగల్లో దేనికీ చెందవని ఆయనే గుర్తించారు. కాబట్టి ఈయన సోదరుడు ఎ. డబ్ల్యు. ష్లెగెల్ ప్రపంచ భాషల్ని ఈ మూడు తెగలుగా విభజించారు. 1. ధాతువుల్లో మార్పులుచెందే సంస్కృతం వంటి భాషలు; 2. చరిత్ర తెలుసుకోవడానికి వీలైన ప్రత్యయాల్ని ఉపయోగించే భాషలు; 3. చైనా భాష వంటి ప్రత్యయ రహితమైన భాషలు. ఈ విభాగమే తరవాత చాలా కాలంవరకు వ్యాప్తిలో ఉంది.

భాషల జననాన్ని గురించికూడా ఈయన కొన్ని అమూల్యమైన అభిప్రాయాల్ని వెలిబుచ్చారు. ప్రపంచ భాషల నిర్మాణంలో భిన్నత్వం గోచరిస్తూ ఉండడంవల్ల అన్నిభాషలకీ జననసంబంధంలేదని ఈయన ప్రతిపాదించారు. కొన్ని భాషలలో కొన్ని పదాలు అవి సూచించే జంతువులుచేసే ధ్వనులని అనుకరించి సృష్టించబడినవిఅని చెప్పడానికి వీలున్నా, అన్నిపదాలకీ అవి సూచించే వస్తువులకీ ఇట్టి సంబంధం చూపడం సాధ్యంకాదు కాబట్టి మొదట అస్పష్టమైన ధ్వనులనించి భాషలు పుట్టాయి అనడం సమర్థనీయం కాదనికూడా ఈయన చెప్పారు. అతిప్రాచీనమైన భాషలలోనే వ్యాకరణ నిర్మాణం క్లిష్టంగా ఉండడంవల్ల మూలభాషలలో నిర్మాణం అతిసాధారణంగా ఉంటుందనే అభిప్రాయాన్ని కూడా ఈయన ఖండించారు. ఈయన వెలిబుచ్చిన ఈ అభిప్రాయాలన్నీ చాలావరకు ఈయన తరవాతవారు ఆమోదించినవే.

## 2. రాస్మస్ రాస్క్ (1787–1832)

రాస్మస్ రాస్క్ ఇండో—యూరపియన్ భాషలలోని సమానపదాలలో నియతంగాఉండే కొన్ని ధ్వని పరిణామాలని మొట్టమొదట పరిశోధించి చూపడం వల్ల ఆయనే శాస్త్రీయదృష్టితో భాషల్ని పరిశీలించినవారిలో ప్రథముడని చెప్పవచ్చు. ఈయన డెన్మార్క్ దేశస్థుడు. డేనిష్ ఎకాడమీ 1811 లో '(ప్రాచీన స్కాండినేవియన్ భాష ఏ భాషనించి పుట్టింది, దానికీ జర్మనీభాషకీగల సంబంధం ఎటువంటిది; ఈభాషని ఇతరభాషలతో పోల్చడానికి ఆధారంగా పెట్టుకోవలసిన మూలసూత్రాలు ఏవి" అనే విషయమై ఒక పోటీ నిర్వహించింది. దీనికి రాస్మస్ రాస్క్ 1814లో "ప్రాచీన నోర్స్ లేక ఐస్లాండిక్‌భాష ఉత్పత్తివిచారం" అనేగ్రంథం డేనిష్‌భాషలో వ్రాసి పంపారు. ఈ గ్రంథం ఈపోటీలో బహుమతిపొందింది, 1818లో రాస్క్ స్వీడన్, ఫిన్‌లాండు, రష్యా, పర్షియా, ఇండియాదేశాలలో పర్యటిస్తూ ఉండగా అచ్చయింది. ఈయన ఈగ్రంథంలో తులనాత్మక వ్యాకరణంలో ఉపయోగించవలసిన పద్ధతుల్ని, దాని ప్రయోజనాల్నిగురించి ప్రప్రథమంగా అతి విస్పష్టంగా వివరించారు. ఈ గ్రంథం డేనిష్‌భాషకన్నా విశేష ప్రచారంగల జర్మన్, ఫ్రెంచివంటి వేరొకభాషలో వ్రాయబడి, వ్రాసిన వెంటనే ప్రచురింపబడి ఉంటే ఆధునికభాషాశాస్త్రజన్మకారకుడుగా ఈయనకే విశేషకీర్తి దక్కిఉండేది. అయినా ఈయన ఈ గ్రంథంలో వెలిబుచ్చిన అభిప్రాయాలు ఇప్పటికి భాషా

శాస్త్రజ్ఞులు అంగీకరించేవే కాబట్టి వీటినిగురించి కొంత ఇక్కడ చర్చించాలి.

ఒక జాతిచరిత్ర కనుగొనడానికి ఆజాతి మాట్లాడేభాషే ప్రధానాధారం. ఒక జాతిమతం, అలవాట్లు, సంఘనియమాలు మొదలైనవి మారినంత త్వరగా ఆజాతిభాష మారకుండా వేలకొలది సంవత్సరాలు నిల్చిఉండడమే దీనికి కారణం. ఒకభాషకి ఇతర భాషలతోగల సంబంధాన్ని నిరూపించడానికి ఆభాష మొత్తం నిర్మాణాన్ని అంతటినీ పరిశీలించాలిగాని కొన్నికొన్నివిషయాలుమాత్రం పరిశీలించి వదలివెయ్యకూడదు. భాషల జననసంబంధాన్ని నిరూపించడానికి వాటిలోగల వ్యాకరణనిర్మాణంలోని సామ్యాలు ముఖ్యంకాని పదాలసామ్యంకాదు ఎందుచేతంటే, పదాలను ఒకభాషలోంచి ఇంకొకభాషలోకి సులభంగా ఎరువు తెచ్చుకుంటారు; కాని ఒకభాష వ్యాకరణ నిర్మాణం మరొకభాష ప్రభావంవల్ల అంత సులభంగా మారదు. అతిక్లిష్టమైన వ్యాకరణ నిర్మాణంగల భాష మూలభాషకి సన్నిహితంగా ఉంటుంది. రెండు భాషల్లో సర్వనామాలు, సంఖ్యావాచకాలు మొదలైన అత్యవసరమైనపదాలు సమానంగాఉంటే ఆ భాషల్లో ఇతరభాషాపదాలు ఎన్ని ఉన్నప్పటికీ ఆరెండూ ఒకే భాషాకుటుంబానికిచెందినవని చెప్పవచ్చు. ఇటువంటి సమానపదాల్లో ధ్వనులమార్పులు నియతంగా ఉండి అవి సూత్రాల్లో చెప్పడానికి వీలయితే ఆభాషలకి జననసంబంధం ఉంటుంది దానికితోడు ఆభాషల్లో వ్యాకరణ నిర్మాణంలోకూడా సామ్యంఉంటే అది వాటి జననసంబంధాన్ని మరింతగా ధ్రువపరుస్తుంది. ధ్వనులమార్పులు వాటి స్థాన ప్రయత్నాలపై ఆధారపడిఉంటాయి—ఇవి ఈయన వెలిబుచ్చిన ముఖ్యాభిప్రాయాలు.

ఈ అభిప్రాయాల్ని ఆధారంగా చేసుకొని యీయన ప్రాచీన ఐస్‌లాండిక్‌భాష సోదరభాషలని అన్వేషించడం ప్రారంభించారు. ఇది జర్మానిక్ భాషా కుటుంబంలోనిదని మొదట నిర్ణయించి తరవాత దీనికి కొంచెం దూరసంబంధంగల భాషల్ని అన్వేషించడం ప్రారంభించారు. స్లావోనిక్‌భాషలు, లిథువానియన్, లెట్టిక్‌భాషలుకూడా దానికి సంబంధించినవే అని నిర్ణయించి, దీనికి లాటిన్, గ్రీకుభాషలతోగల సన్నిహితత్వాన్ని గురించి సుదీర్ఘంగా చర్చించారు. ఈ చర్చలో ఇండో—యూరపియన్ తులనాత్మక వ్యాకరణంలోని ముఖ్యాంశాలన్నీ మొట్టమొదట యీయన ప్రతిపాదించారు. పర్షియన్‌భాష, సంస్కృతభాష వీటికి సంబంధించినవే అని సూచనప్రాయంగా పేర్కొన్నా వాటినిగురించి యిందులో చర్చించలేదు. జెర్మానిక్ భాషలకి గ్రీకు మూలభాషఅనే దురభిప్రాయానికి లోనైనా, దానినెక్కడా యీయన సమర్థించలేదు.

ఈవిధంగా యీయన ఇండోయూరపియన్ భాషాకుటుంబంలోని భాషల్ని గుర్తించి వాటి పరస్పరసంబంధాల్ని నిర్దుష్టంగా ప్రతిపాదించడమేకాక, ఇతర భాషాకుటుంబాల్లోని భాషల్నిగురించి కూడా కొంత పరిశోధనచేశారు. ఫిన్నోఉగ్రియన్ భాషా కుటుంబంలో విభాగాల్ని సరిగా సూచించడమేకాక, ద్రావిడభాషలకు (ఆయన ఉపయోగించినమాట : మలబారిక్) సంస్కృతంతో సంబంధంలేదనికూడా ప్రప్రథమంగా స్పష్టపరిచారు. ఈయన భాషల్ని గురించి ఆకాలపు పండితులలా పుస్తకాలద్వారా నేర్చుకోవడంకాక, స్వయంగా ఆ ఆభాషల్ని మాట్లాడే వారిద్వారా నేర్చుకొని అనేకభాషలకి వ్యాకరణాలు వ్రాశారు. ఐస్లాండిక్, ఫ్రిజియన్, లస్, డేనిష్, స్పానిష్, ఇటాలియన్ మొదలైన భాషలకి యీయన రచించిన వ్యాకరణాలు దోషరహితత్వానికీ విషయసమగ్రత్వానికీ, శాస్త్రీయపరిశీలనకీ మచ్చుతునకలనవచ్చు. ఈ భాషలలోని కొన్ని వ్యాకరణాంశాలకి చారిత్రకమైన కారణాలని సూచించి, యిటువంటి చారిత్రక కారణాలని అన్వేషించినవారిలోకూడా యీయనే ప్రథముడయ్యారు. దారిద్ర్యంవలనా, జబ్బువలనా బాధపడుతూ, విశేషవ్యాప్తిలోలేని డేనిష్‌భాషలలో గ్రంథాలువ్రాసినా విశాలదృక్పథం, విమర్శనాత్మకదృష్టి పరిశీలనానైపుణ్యం కలిగిఉండడంవల్ల భాషాశా

సృష్టికి కారకులైన అగ్రగణ్యులలో యీయన ఒకరని మనం నిస్సందేహంగా చెప్పవచ్చు.

### 3. యాకోబ్ గ్రిమ్ (1785–1863)

యాకోబ్ గ్రిమ్ జర్మనీదేశస్థుడు. ఈయన 1819లో "జర్మన్ వ్యాకరణం" అనేపేరుగలగ్రంథం మొదటిభాగం ప్రచురించారు. ఈయన "జర్మన్"అనే పదాన్ని ఒక జర్మన్‌భాషకే పరిమితంచెయ్యక, జర్మానిక్ భాషా కుటుంబానికిచెందినభాషలన్నిటికీ వర్తించేటట్లు ప్రయోగించారు. కాబట్టి యీ గ్రంథం, జర్మన్ భాషకి వ్యాకరణంకాక జర్మానిక్‌భాష లన్నిటి తులనాత్మక వ్యాకరణం. ఈ గ్రంథం మొదట వ్రాసి నప్పుడు యీయన రాస్మస్ రాస్క్ గ్రంథం చూడ లేదు. కాబట్టి సోదరభాషలలో సమానపదాల్లో ధ్వనుల్లో వ్యత్యాసం యథేచ్ఛంగాకాక నియమ బద్ధంగాఉంటుందని రాస్క్ నిరూపించిన పరమ సత్యం యీయన గ్రహించలేదు. అందువల్లనే యీ గ్రంథం మొదటి ప్రచురణలో ధ్వనులని గురించిన చర్చలేక, పదనిర్మాణచర్చకే పరిమితమైఉంది. పదనిర్మాణంలోని సామ్యాల్ని పరిశీలించేటప్పుడు ధ్వనుల మార్పుల్ని గమనించినా వాటిలోగల నియమబద్ధతని యీయన అప్పుడు గమనించలేదు. కాని ఇది ప్రచురించిన వెంటనే ఆయన రాస్క్ గ్రంథం చూడటం తటస్థించింది. రాస్క్ తనగ్రంథంలో ఇచ్చిన "ధ్వని సూత్రాలు", వాటికి జర్మానిక్ భాషలలో కొన్ని మంచి ఉదాహరణలు చూచిన వెంటనే గ్రిమ్‌కి ధ్వనుల మార్పులలోని నియమబద్ధత తెలిసి, ధ్వనిపరిణామ పరిశోధన ప్రాధాన్యం తెలియవచ్చింది. కాబట్టి మొదటిప్రచురణలో ఆ అసలేలేని ధ్వనిపరిణామచర్చ, 1922లో వచ్చిన రెండవప్రచురణలో 595 పేజీలు ఆక్రమించుకుంది. ఈయన యీగ్రంథంలో తన పరిశోధన జర్మానిక్‌భాషలకే పరిమితంచేసుకోవడం భాషాశాస్త్రాభివృద్ధికి రెండువిధాలుగా ఉపకరించింది. రాస్క్ అంతకుముందు సూచనప్రాయంగా తెలిపిన జర్మానిక్‌భాషల్లో ధ్వనిసూత్రాలకి యీయన విరివిగా ఉదాహరణలిచ్చి ధ్వనిసూత్రాలు ఒకభాషలోని కొన్ని పదాలకికాక ఆ ధ్వనులుగల అన్నిపదాలకీ వర్తిస్తాయి అనే సత్యాన్ని తరవాతవారు గ్రహించడానికి దోహదం చేశారు. అంతేకాకుండా భాషల్లో సాదృశ్యంగల ధ్వనులు సమానమైన మార్పులుచెందుతాయి అనే విషయాన్నికూడా యీయన తమ గ్రంథంలో నిరూపించారు. ఈ విధంగా యీయన భాషాశాస్త్ర సిద్ధాంతాలజన్మకి కారణభూతుడవడమే కాకుండా, యీయన పరిశోధన ఇండో యూరపియన్ తులనాత్మక వ్యాకరణ వృద్ధికికూడా తోడ్పడింది. ఈయన పరిశోధించిన జర్మానిక్‌భాషా కుటుంబం అతివిస్తృతమైన ఇండో—యూరపియన్‌భాషా కుటుంబంలో ఒక ప్రధానమైన ఉపకుటుంబం. ఈ భాషలలో వ్యాకరణాంశసామ్య సమగ్రపరిశోధన ఇండో—యూరపియన్ తులనాత్మక వ్యాకరణ సమగ్రపరిశోధనకి అత్యావశ్యకం. ఈ గ్రంథం యీ విధంగా ఇండో—యూరపియన్ తులనాత్మకతాభివృద్ధికి కూడా తోడ్పడింది.

ఈ గ్రంథంలో గ్రిమ్ జర్మానిక్‌భాషలలో కనిపించే అనేకమైన ధ్వనిపరిణామాలు, వాటికిగల కారణాలు సమగ్రంగా పరిశోధించారు. వీటిలో తరవాతవారు 'గ్రిమ్ సూత్రం'*('Grimm's Law') అనే పేరుపెట్టిన ధ్వనిపరిణామసూత్రం అతిముఖ్యమైనది. ఈ సూత్రాన్ని ఇట్లా చెప్పవచ్చు:

| గ్రీక్‌లో | గాథిక్‌లో |
|---|---|
| ప | ఫ (f) |
| త | థ (θ) |
| క | ఖ (x) |
| — | — |
| ద | త |
| గ | క |
| ఫ | బ |
| థ | ద |
| ఖ | గ |

గా మారుతుంది

ఉదా :

| గ్రీక్ | గాథిక్ | |
|---|---|---|
| పొఉ'స్ | ఫొతుస్ | 'పాదం' |
| త్రెఇస్ | థ్రిఇస్ | 'మూడు' |
| కర్ది'ఆ | హఇర్తొ | 'హృదయం' |
| దె'క | తఇహూన్ | 'పది' |
| గె'నొస్ | కుని | 'జాతి' |
| ఫెరొ | బఇరన్ | 'ఎలుగు' |
| థ్యు'గతేర్ | దఉహ్తర్ | 'కూతురు' |
| ఖొంరొ స్ | గర్దస్ | 'అడుగు' |

ఈ ధ్వని పరిణామాలన్నీ రాస్మస్ రాస్క్ ఇంతకుముందే కనిపెట్టి తన గ్రంథంలో సూచించినవే. కాని గ్రిమ్ వీటివన్నిటినీ ఒకచోటచేర్చి వీటిలో అంతర్లీనమై ఉన్న సమానత్వాన్ని గ్రహించి వెలిబుచ్చడంవల్ల ఈ సూత్రానికి 'రాస్క్ సూత్రం' అనే పేరుకాక 'గ్రిమ్‌సూత్రం' అనే పేరు వచ్చింది. ఈ పరిణామాల్లో సమానత్వం ఏమిటంటే గ్రీక్‌లో శ్వాసస్పర్శాలు (Voiceless Stops: గ్రిమ్‌వాడిన పదం Tenues) గాథిక్‌లో శ్వాస ఈషత్–స్పర్శాలు (Voiceless Spirants: గ్రిమ్‌వాడిన పదం Aspiratae)గానూ; గ్రీక్‌లో నాదస్పర్శాలు (Voiced stops: గ్రిమ్ వాడిన పదం Mediae) గాథిక్‌లో శ్వాస స్పర్శాలుగానూ, గ్రీక్‌లో మహాప్రాణశ్వాసస్పర్శాలు (Aspirated Voiceless Stops: గ్రిమ్‌వీటికి కూడా Aspiratae అనే పదమే వాడారు) గాథిక్‌లో నాదస్పర్శాలుగానూ మారడమే. అంతేకాకుండా ఈ మార్పులన్నీ ఒక చక్రభ్రమణంలో జరిగినట్లు ఈయన అభిప్రాయపడ్డారు. ఈ చక్రభ్రమణం ఈ క్రింది విధంగా చూపవచ్చు.




ఈ ధ్వని పరిణామాలు అన్ని జర్మానిక్‌భాషలలోనూ కనపడుతున్నాయి కాబట్టి ఇవి మూల జర్మానిక్‌భాషలోనే (ఈ భాషలన్నీ విడిపోకముందు) జరిగేయని చెప్పవచ్చు. తరవాత కొంతకాలానికి హై జర్మన్ అని చెప్పబడే ఈ భాష ఒక మాండలికంలో మరికొన్ని మార్పులు వచ్చాయి. ఈ మార్పులలో కూడా శ్వాసస్పర్శాలు శ్వాసఈషత్–స్పర్శాలుగా మారడంవంటివి కొన్ని ఉన్నాయి. గ్రిమ్ వీటిని కూడా గమనించి, వీటికీ, ఇంతకిముందు జరిగిన వాటికీ సాజాత్యం ఉండడంవల్ల ఇవికూడా ఈ చక్రం ఇంకొకసారి తిరిగినట్లు ఉన్నాయని సూచించారు. ఒక భాషలో ఒక కాలంలో జరిగిన మార్పుకీ, తరవాత కాలంలో జరిగిన మార్పుకీ సాజాత్యం ఉంటుందనే విషయంలో గ్రిమ్‌తో మనం ఏకీభవించక పోయినా, ఒక భాషలో ప్రయత్న సాదృశ్యంగల ధ్వనులు ఒకే విధంగా మార్పుచెందడానికి అవకాశం ఉంటుంది అనే సత్యాన్ని మొట్టమొదట నిరూపించినవారు గ్రిమ్ అనే విషయం మనం గుర్తుంచుకోవాలి. సమాన పదనిర్ణయంలో ధ్వనిసూత్రాల ప్రాధాన్యం మొదట గుర్తించినవారు కూడా ఈయనే. ధ్వని సూత్రాల ననుసరించి ఉండని పదాలు, వాటిలో వర్ణార్థ సామ్యమున్నా, సమాన పదాలు కాజాలవని ఈయన మొదట నిరూపించారు.

గ్రిమ్ ఈ ధ్వనిసూత్రమే కాకుండా జర్మానిక్ భాషలలో జరిగే మరికొన్ని ధ్వనిపరిణామాలని కూడా కనుగొన్నారు. వీటిలో ప్రధానమైనవి 'ఉమ్‌లౌట్' (Umlaut), ఎబ్‌లౌట్ (Ablaut), అనేవి. అచ్చులు వాటితరవాతవచ్చే ఇ, య, ఉ, వ అనే ధ్వనులవల్ల పొందే మార్పులకి గ్రిమ్ 'ఉమ్‌లౌట్' అని పేరు పెట్టారు; ఈ పేరే నేటికీ వాడుకలో ఉంది. బిగిన్, బిగేన్, బిగన్ మొదలైన ఇంగ్లీషు క్రియల్లో కనపడే అచ్చులలో మార్పే 'ఎబ్‌లౌట్'. (ఈ పదం సృష్టించినదీ, ఇది ఉండే క్రియలకి 'Strong verbs' అని మొదట పేరు పెట్టినదీ ఈయనే.) ఈ 'ఎబ్‌లౌట్' జర్మానిక్‌భాషల్లోనే

కాక అన్ని ఇండోయూరపియన్ భాషల్లోనూ ఉందనే విషయంకూడా ఈయన గుర్తించారు. కాని ఇది భిన్నార్థాలనిసూచించడానికి ఈ భాషల్లో పుట్టిందనే దురభిప్రాయానికి ఈయన లోనయ్యారు.

ఈయనగాని రాస్క్‌గాని తాము గుర్తించిన ధ్వనిసూత్రాలకి అపవాదాలు ఉండవని అనలేదు. ధ్వని సూత్రాలు చాలా పదాలకి వర్తించినా వాటికి కొన్ని అపవాదాలుండటం సహజమనే వీరు అనుకొని అట్టి అపవాదాలనికూడా ఎత్తి చూపారు. కాని ధ్వని సూత్రాలకి అపవాదాలుండవనే విషయం వీరి తరవాత చాలా కాలానికిగాని తెలియలేదు. ఒక ధ్వని సూత్రానికి అపవాదంగా కనపడే పదాల్లో మరొక ధ్వనిసూత్రం వర్తించడమో లేకపోతే మరేదో కారణమో ఉండడమో జరుగుతుంది. వీరు తమ సూత్రాలకి అపవాదాలని భ్రమించిన పదాల్లో మరొక ధ్వని సూత్రం వర్తిస్తూ ఉన్నట్లు వీరి తరవాత ఏభై ఏళ్లకి పండితులు కనుగొన్నారు. వీరిద్దరూ ధ్వనుల పరిణామాల్లో ఇంత పరిశోధన సాగించినా, వ్రాసే అక్షరాలకీ, అవి సూచించే ధ్వనులకీ భేదముంటుందనే చిన్నవిషయం వీరు గుర్తించలేదు. అంతేకాకుండా గాథిక్‌లో అ, ఇ, ఉ అనే మూడు అచ్చులే ఉండటం వల్ల మూలజర్మానిక్‌భాషలోకూడా మూడు అచ్చులే ఉండేవనే దురభిప్రాయానికి గ్రిమ్ లోనయ్యారు. ఈ ధ్వనిపరిణామాలు , జర్మానిక్‌భాషలు మాట్లాడేవారి స్వేచ్ఛాప్రియత్వం వల్ల కలిగాయని, వీటివల్ల జర్మానిక్‌భాషలు పతనం చెందాయని కూడా ఈయన అపోహపడ్డారు. ఇటువంటి చిన్నచిన్న లోపాలున్నా, గ్రిమ్ వ్రాసిన గ్రంథం జర్మానిక్‌భాషలలో ధ్వనిపరిణామాలని కూలంకషంగా చర్చించడంవల్ల భాషాశాస్త్రాభివృద్ధికి మూలకందమయిందని చెప్పడంలో సందేహంలేదు.

## 4. ఫ్రాంజ్ బప్ (1791—1867)

ఫ్రాంజ్ బప్ జర్మనీ దేశీయుడు. ఈయన పారిస్‌లో సంస్కృతభాష అభ్యసించి, 1816 లో సంస్కృతభాష క్రియారూపాల్ని గ్రీక్, లాటిన్, పర్షియన్, జర్మానిక్‌భాషలలో క్రియారూపాలతో పోలుస్తూ, ఒక గ్రంథం రచించారు. రాస్మస్ రాస్క్ తన గ్రంథంలో సంస్కృతం, పర్షియన్‌భాషల్ని గురించి చర్చించలేదు. కాబట్టి ఇండోయూరపియన్ తులనాత్మకవ్యాకరణపరిశీలనలో ఈ భాషల ప్రాముఖ్యాన్ని లోకానికి మొదట తెలిపినది బప్పే అని చెప్పవచ్చు.

ఈ గ్రంథంలో ఈయన ఇండో—యూరపియన్ భాషలలో క్రియాప్రత్యయాల్లో సామ్యాలు మాత్రమే పరిశీలించారు; కాని ఈ భాషలలో ధ్వని సంబంధాల్ని ఏమాత్రం చర్చించలేదు. సోదరభాషలలో సమానపదాల్లో ధ్వనిభేదాలు నియమబద్ధంగా ఉంటాయని ఈయన గుర్తించలేదు. క్రియాప్రత్యయసామ్యచర్చలోకూడా ఈయన ప్రత్యయాలన్నిటినీ కొన్ని మూలపదాలనుంచి పుట్టినవిగా నిరూపించడానికి ప్రయత్నించారు. ప్రతిక్రియలోనూ 'ఉండు' అనే ధాతువు ఉండిఉండాలనే దురభిప్రాయం ఈయనకి ఉంది. కాబట్టి 'స' అనే ధ్వని ఉన్న ప్రత్యయాలన్నీ లాటిన్ ఎస్—, సంస్కృతం అస్—అనే ధాతువుకి సంబంధించినవని ఈయన వ్రాశారు. అల్లాగే 'బ' అనే ధ్వనిఉన్న ప్రత్యయాలన్నీ సంస్కృతం 'భూ' ధాతువునించి వచ్చినవని ఈయన చెప్పారు. ప్రపంచభాషల్లో ఒకటి రెండు ప్రత్యయాలు పూర్వకాలంలోని ప్రత్యేక పదాలు వాటి ముందు పదాలతో కాలక్రమేణ కలిసిపోవడంవల్ల పుట్టాయని చెప్పడానికి ఆధారాలున్నా (ఉదా: తె. చెయ్యాలి వంటి క్రియల్లో—ఆలి ప్రత్యయం <వలెను: <వలయును: ప్రా. తె. చేయవలయును; ఇంగ్లీషు క్రియావిశేషణ ప్రత్యయం—ly <like: man-ly <man-like) అన్నిభాషల్లో అన్నిప్రత్యయాలూ ప్రత్యేక పదాలనించి పుట్టినవని చెప్పడం సాహసమే అవుతుంది ఇటువంటి ధ్యేయంతో సాగే పరిశోధన నియమబద్ధమైనదికాక కేవలం ఊహాబలంమీదనే ఆధారపడి ఉంటుందనే విషయం బప్ వంటివారి

గ్రంథాలు చదువుతూఉంటే మనకి తోచకపోదు. కాని ప్రప్రథమంగా తులనాత్మకవ్యాకరణం రచించిన బప్‌లో ఈ దోషం ఏవిూ పెద్దది కాదు.

ఈయన కొన్నివిషయాల్లో రాస్కకన్నా, గ్రిమ్ కన్నా నిజానికి అతిసన్నిహితంగా వెళ్లారు. గ్రిమ్ ఇండో—యూరపియన్ భాషల్లో 'ఎబ్లౌట్' మార్పులు అర్థభేదాల్ని సూచించడానికి వచ్చినవని అభిప్రాయ పడితే, యీాయన అవి భిన్నప్రత్యయాలవల్ల వచ్చిన వని చెప్పారు. కాని ఇవి నిజంగా ఉదాత్తానుదాత్త స్వరభేదంమీాద ఆధారపడినవని తరవాతవారు కని పెటారు; అయితే ఇండో-యూరపియన్ భాషలకి ప్రాచీనకాలంలో స్వరభేదం ఉండేదని బప్ కాలంలో ఎవరికీ తెలియదు. రాస్క కెల్టిక్‌భాషలకి ఇండో—యూరపియన్ భాషలతో సంబంధం ఉందనే విష యంలో సందేహం వ్యక్తపరిస్తే, యీాయన కెల్టిక్ భాషలలో పదాదిహల్లులలో మార్పు రావడానికి వాటి ముందు పదంలో పూర్వకాలంలో ఉన్న ధ్వని కారణమని నిరూపించి యీా భాషలు ఇండో—యూరపియన్ కుటుంబానికి సంబంధించినవే అని స్థిరపరిచారు.

ష్లెగెల్ అంతకుముందు చేసిన ప్రపంచ భాషల విభజన సరియైనదికాదని, యీాయన ఈ క్రింది విధంగా చేశారు: I. ధాతువులూ, ధాతు ప్రత్యయ సంయోగమూా లేని చైనాభాషవంటి భాషలు. ఈ భాషలలో వాక్యంలో పదాల సంబంధం వాటి స్థానంపైననే ఆధారపడిఉంటుంది; II. ఏకాచ్క ధాతువులు కలిగి వ్యాకరణనిర్మాణమంతా ధాతు ప్రత్యయసంయోగంపైనే ఆధారపడిఉండే ఇండో—యూరపియన్ భాషలూా, ఒకటవ మూాడవ విభాగాల్లో చేరని ఇతర భాషలు; III. ద్వ్యచ్క ధాతువులు కలిగి ప్రతిపదంలోనూా మూాడు హల్లులు తప్పకుండా ఉండే సెమిటిక్ భాషల్లో ధాతు ప్రత్యయ సంయోగమే కాకుండా, ధాతువుల్లో అచ్చుల్లో మార్పులుకూడా పదనిర్మాణానికి ఉపక రిస్తాయి.

బప్ సిద్ధాంతాలన్నీ ఆయన తరవాత వారు ఆమోదించక పోయినా, ఆయన గ్రంథం ఇండో యూరపియన్ భాషాచరిత్రపరిశోధనకి సంస్కృత భాష ప్రాముఖ్యాన్ని చాటి చెప్పిందనే విషయం నిర్వివాదాంశం. ఈ విధంగా యీాయన తులనాత్మక వ్యాకరణ పరిశోధనకి పునాది వేశారని చెప్పవచ్చు. బప్ ప్రత్యయాల చరిత్రని అన్వేషించడానికి ప్రయత్నిస్తూ తులనాత్మకవ్యాకరణాన్ని కనుగొనడం కొలంబస్ ఇండియాని అన్వేషించడానికి ప్రయత్నిస్తూ అమెరికాని కనుగొనడం వంటిది' అని ప్రొఫెసర్ మెయ్యే అభివర్ణించారు.

## 5. ఆగస్ట్ ఫ్రెడ్రిక్ పాట్

బప్ తరవాత ఇండో—యూరపియన్ తులనాత్మక వ్యాకరణంలో కృషి చేసిన వారిలో ఆగస్ట్ ఫ్రెడ్రిక్ పాట్ ముఖ్యులు. ఈయన ముఖ్య గ్రంథం 1833—36 లో వెలువడింది ఇందులో యీాయన గ్రిమ్ జర్మానిక్‌భాషలకి రచించిన తులనాత్మక వ్యాకరణంలా ఇండో—యూరపియన్ భాషలిన్నిటికీ తులనాత్మకవ్యాకరణంరచించడానికి ప్రయత్నించారు. గ్రిమ్‌కి మల్లే యీాయనకూడా ధ్వనిశాస్త్రానికి యిందులో ప్రాధాన్యం ఇచ్చారు. ఈ గ్రంథంలో ధ్వని పరిణామమే కాకుండా అన్ని ఇండోయూరపియన్ భాషలలోని ప్రత్యయాల తులనాత్మక చర్చ కూడా ఉంది. అంతేకాకుండా సంస్కృతంలోనూ మిగిలిన ఇండోయూరపియన్ భాషలలోనూ సమానంగాఉన్న మూాడువందల డబ్భైఐదు క్రియలు కూడా యీాయన ఇందులో చేర్చారు. ఇది ఇండో యూరపియన్ భాషల వ్యుత్పత్తి నిఘంటువు (Etymological Dictionary) రచనకి ప్రథమ ప్రయత్నమని చెప్పవచ్చు.

ఈ గ్రంథంలో యీాయన కొన్ని అమూాల్యమైన విషయాల్ని కనుగొని వివరించారు. ఉదాహరణకి: కొన్ని భాషలలో కొన్ని శబ్దాలలో వర్ణార్థ సామ్యం ఎక్కువగాఉన్నా వాటికి చారిత్రకమైన సంబంధమేవిూ లేకపోవచ్చు; ఉదా. ఇంగ్లీషు bad పర్షియన్ బాద్. ఈ రెండు భాషల పదాల్లో వర్ణార్థసామ్యమున్నా వీటికి చారిత్రక సంబంధం

లేదు. కాని వర్ణార్థసామ్యం ఎక్కువగా లేని భిన్న భాషాపదాలు, అవి క్రమబద్ధమైన పరిణామాలు చెందిఉంటే చారిత్రకంగా ఒకదాని కొకటి సంబంధించినవే కావచ్చు. దీనికి పాల్ ఇచ్చిన ఉదాహరణ: ఆధునిక పర్షియన్ ఖ్వాపర్ (Xvapar), ఒసెటిక్ ఖొ (Xo), ఇంగ్లీషు Sister. ఈ మూడు మాటలలో వర్ణార్థసామ్యం ఎక్కువగా లేనప్పటికీ ఇవి చారిత్రక సంబంధం కలిగినవే. ఇటువంటి దానికి మన ద్రావిడ భాషలనించి యీ క్రింది ఉదాహరణం ఇవ్వవచ్చు: తమిళం, మలయాళం, తెలుగు — చెవి: బ్రాహుయీ ఖఫ్ (Xaf). బ్రాహుయీ లో మాటకీ మిగిలిన భాషల్లో మాటకీ వర్ణాల్లో సామ్యం అంతగా లేకపోయినా బ్రాహుయీ మాటలో వర్ణాలన్నీ ధ్వని సూత్రాల్ని అనుసరించి మార్పు చెందినవే. ఈ పదాలన్నిటికీ 'కెవి' అనే మూలద్రావిడభాషాపదమే మూలం. ఈ విషయమే కాకుండా యీయన లాటిన్ భాష గ్రీకుభాషనించిపుట్టిందనే మూఢనమ్మకాన్ని కూడా విశితంగా విమర్శించి సరియైన ఉపపత్తులతో ఖండించారు. ఈయన తమ గ్రంథమంతటా ఒక భాష చరిత్రని కనుగొనడానికి ఆ భాషలో ధ్వనుల చరిత్ర కనుగొనడమే ప్రధానాధారమని చాటి చెప్పారు.

కాని పాల్ కూడా తమ పూర్వీకులమల్లే ధ్వని సూత్రాలకి అపవాదాలుండవనే విషయం గ్రహించ లేదు. కాని యీయన చేసిన పరిశోధనలు ధ్వని సూత్రాలకి అపవాదాలుండవనే సత్యాన్ని యీయన తరవాత వారు గ్రహించడానికి తోడ్పడాయని నిస్సందేహంగా చెప్పవచ్చు. ఈయన ఇండో—యూరపియన్ భాషల మూలభాష సంస్కృతమే అనే దురభిప్రాయానికి లోనయ్యారు. సంస్కృతంలో లేని కొన్ని ధాతువులు మిగిలిన ఇండో—యూరపియన్ భాషలు చాలా వాటిలోవున్నా, అవి మూల ఇండో—యూరపియన్ భాషకి చెందినవిగా యీయన గ్రహించలేదు. అంతేకాకుండా అన్ని పదాల్లోనూ సంస్కృతంలోఉన్న అచ్చులూ, హల్లులే అతిప్రాచీనమైనవని యీయన నమ్మారు. ఇది నిజం కాదని కొన్ని సంస్కృత పదాల్లో మూలభాషలోని వర్ణాలు మార్పులు చెందాయని తరవాత వారికి తెలిసి వచ్చింది.

ఈ విధంగా పందొమ్మిదో శతాబ్దం మొదటి భాగంలో రాస్క్‌నించి పాల్‌వరకు ఉన్న పండితులు భాషల్లో ధ్వనిపరిణామాలు నియమబద్ధంగా ఉంటాయనే సత్యాన్ని వివిధభాషల్ని పరిశోధిస్తూ క్రమక్రమంగా గ్రహిస్తూ వచ్చారు. అయితే ధ్వని పరిణామ సూత్రాలకి అపవాదాలుండవనే విషయం వీరి తరువాత ఆ శతాబ్దం రెండో భాగంలో ఉన్నవారికే అవగతమైంది.

## ఈ వ్యాసానికి ఆధారాలైన గ్రంథాలు


1. L. Bloomfield, Language- New York, 1933.

2. Francis P. Dinneen, An Introduction to General Linguistics; New York, 1967.

3. H. A. Gleason, Jr, Linguistics and English Grammar; New York, 1965.

4. Louis H. Gray, Foundations of Language; New York, 1939, 1950.

5. Otto Jespersen, Language, its nature, development and Origin; London, 1922.

6. Holger Pedersen, The Discovery of Language (Translated by J. W Spargo)- Bloomington, 1962.

7 John T. Watermann, Perspectives in Linguistics; Chicago, 1963.

# 'పూర్ణమ్మ' కథలో గురజాడవారి కవితా శిల్ప వైభవం

శ్రీ పి. వి. రామశర్మ

'ఏకో రసః కరుణ ఏవ' అన్నది లాక్షణికులు ప్రామాణికంగా అంగీకరించిన మాట

'వాక్యం రసాత్మకం కావ్యం' అన్నది సైతం అంతే ప్రమాణంగా ఆమోదితమయిన లక్షణం.

ఈ రెండు ప్రమాణాలనూ అతిరూఢంగా అన్వయంపొంది ఈ రెండు లక్షణాలకూ ఒక ప్రౌఢమయిన ఉదాహరణంగా నిలిచిపోయిన నవ్యకవితా శిల్ప వైభవం గలది—గురజాడవారి 'పూర్ణమ్మ' కథ.

మనిషిలో మానవత్వం—కరుణ అన్నవి నిలిచి ఉన్నంత కాలం—మనిషి మనస్సులో అనుకంప, ఆదర భావాలు ఇగిరిపోనంతకాలం 'పూర్ణమ్మ' మానవ సమాజ మధ్యాన చిరంజీవి!

'పూర్ణమ్మ'లోని ప్రతి సరమూ ప్రతిపదమూ ప్రతి భావనాంశమూ—ఒకే ఒక్క రసంచుట్టూ—లక్ష్యం చుట్టూ—భ్రమిస్తూ—ఏకోన్ముఖమయిన ఒక లక్ష్యగమనాన్ని ద్యోతకం చేస్తాయి. అందుచేతనే—ఆ కథలోని ఏ ఒక్కపదంగాని, పంక్తిగాని అనవసరమనిపించదు సరిగదా—ఆ పదబంధంలోనుండి ఏ ఒక్క పదాన్ని తీసి చూచినా—అక్కడొక 'వెలితి' తోస్తుంది. ఇంత చక్కని పదనిర్మాణం చేసిన కవి శిల్పచాతురి అనుపమానం—ప్రతిభ అసమానం!

సాంప్రదాయికంగా కావ్యలక్షణాలుగా మనం చెప్పుకొనే అష్టాదశవర్ణనాది వివిధ ప్రయోగ ప్రక్రియలూ, మనకు స్థూలంగా తోచకపోయినా—'పూర్ణమ్మ' కథలోని ఒక్కొక్కపంక్తినే పరిశీలిస్తూపోతే—ఆ పదనిర్మాణంలో ఎంతో దృఢమైన భావావిష్కరణం, అమోఘమైన శిల్పవిన్నాణం గోచరించి, అందలి సర్వలక్షణసమన్వయము, సందేశాత్మకత, ఒక విలక్షణమైన చమత్కారయుతశిల్పం—శబ్ద వైచిత్రి, మనస్తత్వనిరూపణాకౌశలం ఎంతో ప్రశంసనీయాలుగా తోస్తాయి.

'పూర్ణమ్మ' యింతకాలం మనమధ్య జీవించి వుండటానికి, ఆ రచనలోని అమేయ శిల్పచాతురి, కావ్యనిర్మాణకౌశలాలకుమించిన అద్భుత కరుణ రస పోషణం కారణం. ఆద్యంతంపోషితమయిన ఆ కరుణరసమే ఇంతకాలం—ఇంకా ఇన్ని తరాలపాటు 'పూర్ణమ్మ'ను—మనమధ్య, మన సమాజంమధ్య ఒక సజీవ మూర్తిగా నిలుపుతూంది; నిలుపుతుంది. అసలు 'పూర్ణమ్మ' కథకు రంగం సిద్ధం చేయటంలోనే కవి తన అసదృశభావన పటిమను నిరూపించుకొన్నాడు. చదువరిని తన పూర్ణమ్మ ఉన్న దరికి తీసుకుపోతాడుతప్ప మనముందుకు ఆమెను తీసుకురాడు. ఇది యెంతో ప్రతిభావ్యుత్పత్తులుగల భావుకులకుమాత్రమే సాధ్యమయే విషయం. అదీగాక—మణి—పుత్తడి బొమ్మగదా—పూర్ణమ్మ!—ఆమె మన ముందు కెలా వస్తుంది?

మనలను ఆ ప్రదేశానికి తీసుకుపోయేందుకు కవి చేసిన ప్రయత్నం ఈ గేయంలో గోచరిస్తుంది.

'కొండలమధ్య కోనొకటున్నది
కోనల నడుమా కొలనొకటుంది
కొలని గట్టునా కోవెల లోపల
వెలసెను బంగరు దుర్గమ్మ'

ఈ పంక్తులు చదివే ఎవరైనా—తమంత

తాము ఆ దృశ్య మధ్యానికి వెళ్ళుతున్నలా అనుభూతి చెందటం అత్యంత సంభవం. అంతే తప్ప— తమముందుకు ఆ దృశ్యాన్ని తెచ్చుకోను యత్నించరు. ఇది ఆ పదబంధనంలోఉన్న ప్రతిభా విశేషం. ఈ గేయం చదివేటప్పుడు - పోతన వర్ణించిన 'అల వైకుంఠ పురంబులో నగరిలో...' గుర్తుకు రాని వారుండరేమో! ఇంకా అంతకన్న హృద్యమైన సన్నివేశ చిత్రణంతోపాటు—ఇక్కడ పద ఆవృత్తత కూడా గమనార్హం.

కొండలనడుమ కోన, కోనల నడుమ కొలను, కొలను గట్టున కోవెల—కోవెలలో వెలసినది బంగరు దుర్గ—ఇలా ఆదృశ్యం లోపలికి, లోలోపలికి చదువరిని తీసుకుపోతూ, విషయంలో చదువరిని పూర్తిగా లీనంచేసే ఆయన రచనా విన్నాణం ప్రశంసార్హం—ఇదొక అపూర్వమైన రచనా ప్రయత్నం. ఇంతకన్న ముందరి సంబోధాత్మక గేయాలలోని విలక్షణతను గూడా గుర్తించటం అవసరం.

'మేలిమి బంగరు మెలతల్లారా
కలువల కన్నుల కన్నెల్లారా
తల్లులగన్న పిల్లల్లారా
విన్నారమ్మా యీ కథను'

అంటూ కవి కథ చెప్పట మారంభిస్తాడు. 'విన్నారమ్మా యీ కథను' అని ఎంతో సహజంగా, చాతుర్యంగా ప్రశ్నవేసి—చదువరులలో— ఆ కథేమిటో వినాలనే ఒక కుతూహలాన్ని రేకెత్తిస్తాడు. ఇది మనస్తత్వశాస్త్రాంశం. ఎదటివారి కుతూహలాన్ని మనం చెప్పే విషయంపై రేకెత్తించటానికి ఉన్న వివిధ మార్గాలలో ప్రముఖమైనది యీ మార్గం. 'అంతకుముందే వారు విని ఉండాలన్నట్లు—'ఇంకా వినవే లేదా' అన్నట్లు ధ్వనించే యీ సంబోధనంలోని ప్రజ్ఞ—చమత్కారం ఒక యెత్తు—గేయంలోని మూడవపాద మొక్కటీ ఒక్క యెత్తు.

మొదటి రెండు పాదాలూ అతి సామాన్యంగా సాగినవే. అందులో పెద్దగా చెప్పుకోదగిన ప్రత్యేకత లేదు. కాని, మూడవపాదంలో ఒక విలక్షణత గోచరిస్తుంది. 'తల్లులగన్న పిల్లల్లారా' అంటాడు. ఇది విడ్డూరం గొలిపే మాట! పిల్లలకన్న తల్లులుండవచ్చుగాని, తల్లులగన్న పిల్లలేమిటి? సూక్ష్మంగా ఆలోచిస్తే—ఆయన ఉద్దేశ్యం ఒక టనిపిస్తుంది. తాను పిలువ నుద్దేశించింది పిల్లల్నేకాని, ఆ పిల్లలు సామాన్యమైన పిల్లలుకారు – వారు—'మాతృత్వం'— ఆర్ద్ర మనస్కత అన్నవి జన్మతః కలిగిఉన్న పిల్లలు, అంతేకాదు—

తాను చెప్పబోతున్న కథా సందర్భంగా తటస్థపడబోతున్న తల్లులవంటి తల్లులను అప్పటికే కన్న(చూచిన) పిల్లలు—అంటే - తాను చెప్పబోతున్న కరుణ రసాత్మక అంశాన్ని వినే అర్హత, విని అనుకంపనూ, ఆదరాభిమానాలనూ వెలార్చగల ఆత్మాభిమాన పూర్వక సహృదయం—ఆ 'పిల్లల'తో తప్ప అన్యులలో ఉండనని కవి ఆ పిల్లలమ తల్లులగన్న పిల్లలను పిలుస్తున్నాడు. ఇదెంత ముందుచూపుగల సంబోధనో చూడండి. ఈ తీరున కవి తానుచేసే యీ రచనంలోని ప్రతి. పంక్తిలోనూ అందుకు పూర్వాపరాలను సమన్వయించిన ఒక చక్కని పద ప్రయోగచాతురిని ప్రదర్శించటం చూస్తే — ఈ రచనం లోకోత్తర మనిపించక మానదు.

ఆ తరువాతి గేయంలో మూడు వయస్సుల స్త్రీలను సంబోధిస్తాడు క్రమంగా

'ఆటల పాటల పేటికలారా
కమ్మని పాటల కొమ్మల్లారా
అమ్మలగన్న అమ్మల్లారా
విన్నారమ్మా—మీ రీకథను.'

అని. మొదటిసారి 'విన్నారా' అని మాత్రమే అడిగిన కవి—ఈ సారి 'విన్నారమ్మా విూ రీకథను! అని రెట్టిస్తాడు. ఆ రెట్టించటంలో ఇంతవరకూ ఇంకా ఉత్సుకత జనించక ఉన్నవారిలో సైతం ఆ ఉత్సుకతను రేకెత్తించటం కనిపిస్తుంది.

ఇక కథాచిత్రణంలోకి ప్రవేశిస్తే—పూర్ణమ్మ పుట్టినట్లు మనకు ముందే చెప్పడు కవి. దుర్గమ్మ వెలసినమాటతో పూర్ణమ్మ జననాన్ని సంకేతించి—

వెంటనే 'పూజారింటను పుట్టెను చిన్నది — పుత్తడి బొమ్మ పూర్ణమ్మ' అనేస్తాడు. ఆమె గృహవర్ణనంగాని, మరో జన్మవర్ణనంగాని ఏమీ చేయకుండా—చాలా క్లుప్తంగా పూర్ణమ్మ జననం చెబుతూనే—తాను చేయనట్లు అనిపించే ఆ వర్ణనలను పై గేయంలో 'కోవెల—అందు వెలసినదుర్గ'ల సంకేతంతో—ఇక్కడ—'పూజారింట — పూర్ణమ్మ పుట్టటంగా చెప్పి—వదిలేస్తాడు. మనకు గూడా ఆయన ఆ వర్ణనలు చె దేమా అన్నప్రశ్నను రానీయడు—కారణం—కథపై అప్పటికే చదువరి మనస్సులో కవి సాధించిన ఉత్సుకత అంతటిది!

ఇక్కడొకమాట: పూర్ణమ్మ జన్మించినట్లు చెప్పేటప్పుడే—ఆమెను 'పుత్తడి బొమ్మ'గా ఉపమించాడు. అంతే—అదే ఉపమ—ఆ ఒకే ఒక్క పోలిక—ఆమె జన్మయావత్తూనా—పేరు వెంట—కాదు—ముందు—ఉంటుంది. మరోపోలికేదీ కనిపించదు ఇందుకు ఒకే ఒక్కకారణం తోస్తుంది — బహుశః కవికి పూర్ణమ్మను—'పుత్తడి బొమ్మ'నుగా తప్ప—మరోలా ఊహించటం, ఉపమించటం ఇష్టంకాని విషయమేమో! అందుకు ప్రబలనిదర్శనం చదువరి ఆత్మ మనకు గూడా ఈ ' పూర్ణమ్మను 'పుత్తడి బొమ్మ' నుగా తప్ప మరోలా ఊహించుకోటానికి, ఉపమించుకోటానికి మనసొప్పదు — ఆలోచించండి. ఆమె అంతటి ముగ్ధస్వరూపిణి, అమాయిక, బేల, స్థిరచిత్త—ఇంకేనేవో ఆ తర్వాత ఆమెలో చూచే, మనకు పొడకట్టే అనేక లక్షణాలను అన్నిటికీ సరిపోలేవి—ఒకేఒక్కమాట: 'పుత్తడిబొమ్మ'. ఇదెంతో—సునిశితపరిశీలనంమీద చేసిన ఉపమ. అలంకారంకోసం వేసిన అలంకారం కాదు. ఆ పాత్ర యావత్తూనూ పొదివిపట్టే మన ముందుంచగల ఒకే ఒక్కమాట: 'పుత్తడిబొమ్మ'. అంతటి బలీయమైన ఉపమానకల్పనాచాతురికి—కవిప్రజ్ఞనూ, ఉపజ్ఞనూ ఆమోదించని, హర్షించని రసహృదయం ఉండదు. రమణీయమైన ఆయన ఉపమాచాతురికి జోహారు లర్పించని ఆలంకారిక హృదయం ఉండదు. ఈ 'ఉపమ'ను ఆయన—కథలో ఎక్కడ పూర్ణమ్మ అనవలసివచ్చినా—ముందేవాడి—ఆ మాటను ఇంకా ఇంకా మన హృదయంలో సుస్థిరంగా హత్తుకొనేలా చేస్తాడు కవి. ఇది ఒక హృదయంగమ మయిన పదప్రయోగ వైచిత్రి. వాస్తవానికి — స్థూలదృష్టిలో 'పునరుక్తి'గా—అదో దోషంగా తోచే ఆ పోలికను—చదువరికి ఏమాత్రం విసుగుతోచని విధంగావాడి—అందునా ఆ పదాన్ని—తదుపమితపాత్రకు ప్రతిసారీ దోహదకారిగా వాడటం ఎంతో మెళకువగల రచయితచేసే ప్రయోగం.

పూర్ణమ్మ పుట్టింది. ఆ తర్వాత—ఆమె బాల్యమనీ, మరోటనీ—వివిధవర్ణనాదులుచేసి చదువరిని విసిగించదలచుకోలేదు ఆయన. అందుకే అతి సూక్ష్మంగా ఆమె దినచర్యను రమ్యంగాచెప్పి—ఊరుకుంటాడు. ఆ చెప్పటంలో గూడా ఓ ప్రత్యేక వైలక్షణ్యాన్ని సాధిస్తాడు.

'ఉన్నతమ్ముల కనుగై దుర్గకు
పూజకు పువ్వులు కోసేది'

ఆయనకు కథ మీదే దృష్టి. చెప్పదలచుకొన్న విషయంమీద ఆయనకున్న ఆ ఏకాగ్రత అమోఘం! అందుకే అనవసర వర్ణనలూ, అప్రస్తుత వివరణలూ, అసంగత సన్నివేశప్రకల్పనలతో చదువరిని విసిగించి, కాలయాపన చేయదలచుకోలేదు. తన్మూలంగా కథాగమనంలో ఆయన ఒక అపూర్వ వేగాన్ని సాధించి, కథాకథనపద్ధతికి ఒక క్రొత్త వరవడిని దిద్దినవా డయ్యాడు.

తాను వ్రాసిన ప్రతిపదమూ, పంక్తీ మూలకథకు వొనగూర్చి పెట్టవలసిన సున్నితత్వ, లాలిత్యాదులు సంతరిస్తున్నాయా లేదా అని ఆయన పర్యాలోచించుకొంటూ తీసుకొన్న జాగ్రత్తలు చూస్తే ఆశ్చర్యం గొలువుతుంది. ఋతువులూ, వాటి వర్ణనలూ, అలా చేస్తూ సుదీర్ఘరచనమేచేస్తే—ఆయనా అందరి కవుల వరుసనే నిలబడేవాడుతప్ప—తనదీ అని ఓ ప్రత్యేక ప్రతిపత్తిని సాధించగలిగేవాడుకాదు.

'ఏయేవేళల పూసే పువ్వుల
ఆయావేళల అందించి
బంగరు దుర్గను భక్తిని కొలిచెను
పుత్తడిబొమ్మా—పూర్ణమ్మ.'

‘ఏయేవేళల పండే పండ్లను
ఆయాఋతువుల అందించి
బంగరు దుర్గను భక్తిని కొలిచెను
పుత్తడిబొమ్మా—పూర్ణమ్మ.’

సామాన్యంగా — సాధారణకావ్యకర్తలు కొన్ని వందల పద్యాలు వ్రాసేందుకూ అసంఖ్యాకములైన గాలపేర్లూ, పండ్లపేర్లూ ఏ కరువుపెడుతూ, ఉద్యానవనవర్ణనల నెపంతో తమకున్న పాండితీ వైదగ్ధ్యాన్ని చాటి చెప్పుకొందుకు వినియోగించుకునే అతివిశాలమైన అవకాశం కలది యీ ఘట్టం. అలా వినియోగించుకోని కవులను గూడా మనం చూడం. అయినా ఇక్కడమాత్రం కవి రెండే రెండు గేయాలతో సరిపెట్టాడు. అందునా గూడా, వాడిన పదజాలాన్నే మళ్ళీ మళ్ళీ వాడుతాడు. ‘పువ్వుల’ బదులు ‘పండ్లు’ అని రెండవగేయంలో వాడటం చూస్తామేతప్ప—మిగతా పదబంధమంతా ఒక్కటే. ఇక్కడ అతిసూక్ష్మ దృష్టికి అందే ఒక సంకేతం బహుగొప్పది. ఆమె పువ్వులనైనా పండ్లనైనా దుర్గకు అర్పించటమన్న క్రియలో అభేదాన్ని సూచించేందుకు—గేయ రచనంలో అభేదం పాటించటం ద్వారా సంకేతిస్తాడు. ఒకే రకమయిన, ఏ మాత్రపు వ్యత్యాసమూలేని సమర్పణాబుద్ధితో ఆమె పువ్వులనూ, పండ్లనూ దుర్గకు అర్పించేది. ఆ వ్యత్యాసరహితమయిన అర్పణాబుద్ధిని వ్యంజకం చేయటమే కవి కూర్చిన ఒకే మోస్తరు పదబంధనంలోని ధ్వని!—ఆంతర్యం. ఇక అక్కడా—ఇక్కడా గూడా పదే పదే ‘బంగరు దుర్గ’కు—‘పుత్తడి బొమ్మ’ అర్పించి కొలిచినట్లు చెప్పటంలో గూడా—‘దుర్గా—పూర్ణమ్మ’ల మధ్య అభేదాన్ని సూచిస్తున్నాడు.

ఇక్కడ మరోమాట: పూర్ణమ్మయొక్క రూపాన్ని ‘గురజాడ’వారు రూపొందించుకొన్న తీరులోనే ఒక అద్భుత ఊహాపటిమ, అనన్యమేధా సంపత్తి గోచరిస్తుంది. ఆయన పూర్ణమ్మ ‘ఆత్మ’లో ‘దుర్గ’నూ భౌతికఆకృతిలో ప్రకృతినీ దర్శించాడనటం యుక్తం. కాకుంటే పూర్ణమ్మ జన్మించినదని చెప్పేందుకుముందు

‘కొలని గట్టున కోవెల లోపల
వెలసెను బంగరు దుర్గమ్మ’

అన్నమాటలతో పూర్ణమ్మ పుట్టుకను సంకేతించి ఉండరు. అలాగే ఆమె శరీర సౌందర్యాన్ని వర్ణించేందుకు—అంతకు ముందరి పువ్వులు, పండ్లు దుర్గకు అర్పించేది అన్నగేయాలు కాగానే—ఆ పువ్వులూ, పండ్లతోనే ఆమెకు పోలికకట్టి అంతకు మించిన సౌందర్యరాశిగా చెప్పివుండడు

‘పళ్ళను మీరిన తీపుల నడలును
పువ్వులమీరిన పోడుములున్
అంగము అందున అమరెను దుర్గకు
సౌరులుమించెను నానాటన్’ అని

‘ప్రకృతి—స్త్రీ’లను పరస్పర సంకేతాలుగా భావించటం మన కవిసంప్రదాయాలలో ప్రముఖంగానే గోచరిస్తుంది. కాని ఈ కవి ఇంకొక అడుగు ముందుకువేసి—

భౌతికోపాధి ఆత్మను ఆశ్రయించి ఉన్నట్లుగా—పువ్వులు, పండ్లు — దుర్గను అర్చించటంలోనూ, తాను (భౌతికంగా) అనునిత్యం దుర్గ సందర్శనం చేస్తూ — ఆమె కనుసన్నలలో మెలగటంలోనూ చెబుతాడు.

పూర్ణమ్మ భౌతిక శరీరాన్ని వర్ణించేఘట్టం—ఆ ఖండిక మొత్తంమీద—ఇదొక్క సందర్భమే. ఆ ఘట్టంలోగూడా ఎంత నిర్మలంగా—ఉదాత్తంగా ఆమె అందచందాలలోని సౌకుమార్యాన్ని - లావణ్యాన్ని వివరించాడో చూడండి. పూవులూ, పండ్లూ—ప్రకృతిలోని సౌకుమార్య, మాధుర్యాలకు ప్రతీకలు. అంతకన్న యితరేతరసంభారసందోహం ప్రకృతిలో అసంఖ్యాకంగా ఉన్నా — ఆ యితరసంభారమంతా ఆయన దృష్టికి రాలేదు కారణం—ఆయనకు ‘పూర్ణమ్మ’ను రూపించుకొన్నప్పుడు—పూవులూ, పండ్లను మించిన మరో ఏ ప్రకృతిజనితవస్తుసముదాయమూ స్ఫురించక పోవటమే. అయితే ఇక్కడ అన్నిటికన్నా మరో ఆశ్చర్యకరమయిన భావం నిగూఢంగా ఉంది. పూవుయొక్క సహజపరిణామ దశలు—పిందె, కాయ, పండు ఇలా ఉంటాయి. కాని గురజాడ—పూవూ, వెంటనే పండూ — ఈ రెంటినీ తీసుకొని ఆమె జీవనక్రమాన్ని వాటితో ఉపమించటంలోని ఆంతర్యం మరింత పరిశీలనీయం. ఆమె

జీవితం అందరి జీవితాలలాగా వాస్తవ సహజ పరిణామక్రమానికి నోచుకోలేదు. పూవు సరాసరి పండుకాదు—అయినా అది చాలా అసహజ పరిణామమే. అలాగే ఆమె జీవితమూ బాల్యంనుండి ఒక్కసారి వార్ధక్యంలోకి దుముకుతోంది. ఈ అసహజ పరిణామాన్ని సంకేతించటమే ఆయన — పండ్లు, పువ్వులలో ఆమె సొరులను ఉపమించి చెప్పటంలో గల ఆంతర్యం.

పూర్ణమ్మను పదేపదే 'పుత్తడి బొమ్మ'గా చెబుతూనే—సర్వలక్షణసమన్వితనుగా ఆమెను మన ముందు నిలుపుతూనే—ఆ విషయాన్ని మనలో పదేపదే హెచ్చరిస్తూనే— ఇంత చాలదన్నట్లు—

'కాసుకులోనై తల్లిదండ్రీ
నెనరూ న్యాయం విడనాడి
పుత్తడి బొమ్మను పూర్ణమ్మను ఒక
ముదుసలి మొగుడుకు ముడివేస్రీ' అంటాడు.

ఇక్కడ గూడా ఆయన మళ్లీ 'పుత్తడి బొమ్మ' అని వాడటం కేవలం యాదృచ్ఛికంగాదు. పైన 'కాసు' కోసమై అని అంటూ తల్లిదండ్రీ — 'పుత్తడి'ని (బొమ్మను) చేజార్చు కొంటున్నారని చెప్పటంలో అద్భుతమైన వ్యంగ్యం స్ఫురింప చేస్తున్నాడు కవి. 'కాసు'కోసం 'పుత్తడి'ని విడిచిపెట్టటం వెఱ్ఱి. ఆ వెఱ్ఱితనాన్ని తల్లిదండ్రులలోవ్యంజకంచేయడానికి—'కాసు'కులోనై - పుత్తడి బొమ్మను — ముదుసలి మొగుడుకు ముడివేస్రీ—అనటంలో కవి యత్నించి కృతకృతుడయ్యాడు.

ఈ పదరచనం ఎంత అద్భుతమైన వ్యంగాన్ని స్ఫురిస్తోందో—అంత ఉదాత్తమైన ఈసడింపును ద్యోతకం చేస్తోంది. ఈ సన్నివేశంలో తల్లిదండ్రు లిద్దరినీ సమానబాధ్యులుగా —వారి అవివేకచర్యకు— చెబుతాడు కవి. ఇది ప్రత్యేకించి గుర్తుంచుకోటం— తర్వాతి కథాంతరంలోని ఒక ఘట్టంకోసం అవసరం.

ఆ తర్వాత 'ఆమని' ప్రవేశాన్ని చెబుతాడు కవి.

'ఆమవిరాగా దుర్గ కొలనిలో
కలకల నవ్వెను తామరలు
ఆమని రాగా దుర్గ వనములో
కిలకిల పలికెను కీరములు.'

ఇలా ప్రకృతంతా ఆమని ఆగమనంతో పులకించి, పరవశించిఉన్న సందర్భంలో—అదే మోస్తరు— అంటే—ఆమని ఆగమనం లాంటి పెనిమిటి ప్రత్యక్షం మాత్రం—పూర్ణమ్మను వ్యధాకులచిత్తనుగా, బాధామేఘాచ్ఛాదితవదననుగా మార్చింది. తరవాత రాబోతున్న పెనిమిటి ఆగమనాన్ని—ఈ పద్యంలో ఆమని ఆగమనంతో సంకేతిస్తూనే—పూర్తివిలక్షణమయిన ఆమె మార్పులను—ప్రకృతిని మరింత శోభాయమానంగా వర్ణించి—పరోక్షంగా సాధిస్తాడు. అంతటి రమ్యమయిన ప్రకృతిమధ్యంలో ఆమె ఆ రామణీయకత ననుభవించేందుకు నోచుకోని విషయాన్ని— ఆమె అభాగ్యతను మనకు స్ఫురింపచేసి—పరోక్షంగా ఆమెయెడ మనలో అనుకంపను రేకెత్తిస్తాడు.

'ముద్దు నగవులూ, మురిపంబు మఱి
పెనిమిటి గాంచిన నిమిషమున
బాసెను కన్నియ ముఖకమలంబున
కన్నుల గమ్మెను కన్నీరు.'

ప్రకృతి సహజమయిన తామరలు కలకల నవ్వుతూ— ఆనందరసభరితంగావుంటే - ఆమె ముఖకమలంమాత్రం ముద్దునగవులూ, మురిపములను బాసి—కన్నుల కన్నీరు గమ్మివున్నదట. అక్కడ ఆ కమలాలస్థితీ, ఇక్కడ ఈ కమలాలస్థితీ పరిశీలిస్తే—ఘూర్ణిల్లని హృదయం వుండదు—ఆ విపరీత స్థితికి. హృదయాక్రోశకారకమయిన తీరున ఆమె స్థితిని వర్ణించి ఇక్కడ—తొలిసారిగా మనలోని దుఃఖాన్ని పెల్లుబికిస్తాడు కవి. ఇంతవరకూ సానుకంపతో ఉద్విగ్నమయివున్న మన మనస్సులు—హృదయాలూ—ఒక్కసారిగా పూర్ణమ్మస్థితిని చూచి బ్రద్దలవుతాయి—బాల్యం; నిస్సహాయ; సంయమాదులు ఇంకా అలవడని పసిమనస్సు - ఆజీవవపర్యంతం బాధ పడవలసిన స్థితికి గురయివుంది—అలాటి సందర్భంలో —

'ఆటల పాటల తోటి కన్నియలు
మొగుడు తాతయని గేలించ

ఆటలపాటల కలియక పూర్ణమ
దుర్గమ చేరి దుఃఖించె–'

ఇది మన కళ్ళెదుట—మన మనోచక్షుసమక్షాన పొడకట్టే సహజాతిసహజమైన దృశ్యం. జీవితంలో ఆనందానికి నోచుకోక—అభాగ్యజీవియై—అతిదారుణమైన వేదన ననుభవిస్తున్న ఆమె—ఆ బాధలన్నీ మరచి—ఒకింతసేపు—తోటివారితో ఆడుకొందామని తలచి—వారి దఱిచేరితే — ఎక్కడ ఆనందం అనుభవిద్దామని వచ్చిందో అక్కడే—తన గుండెలను వ్రయ్యలు చేస్తున్న విషయం—పునఃపునః ప్రస్తావితం కావటం—అది ఊరికే ప్రస్తావింపబడటం గాక—ఎగతాళిగా—'మొగుడు తాత' అని హాస్యం పట్టించబడటంతో—ఆమె హృదయం ఏమవ్వాలో నిజంగా ఊహాకందని సంగతి సాధారణ పరిస్థితుల్లోనే—ఏ ఆడపిల్లనైనా—ఆ పిల్లకు పెళ్ళి కాకపోయినా—'నీ మొగుడు ముసలివాడు-తాత' అంటే ఆమెకెంతో రోషం అనిపిస్తుంది. అటువంటిది — తన మొగుడు తాత అన్నది కళ్ళెదుట కనిపిస్తున్న కటిక సత్యం – దారుణమైన నిజం. ఆ నిజాన్ని కొద్దికాలంపాటన్నా మరుద్దామని వారి దఱిచేరితే—వారు ఆ నిజంతోనే—ఎగతాళి బాకులతో తన గుండెలను గ్రుచ్చుతుంటే ఆమెపడ్డ మనోవేదన ఊహాతీతం! — ఈ ఘట్టంలో కంటతడిపెట్టని హృదయంగలవారుండరు.

పై గేయంలో ఆఖరిపంక్తి. దుర్గనుచేరి దుఃఖించె—అన్నది చదివినప్పుడు—మరింత విషాదంతో ఘూర్ణిల్లుతుంది మన హృదయం. అవును మరి. ఆమె మరింకెవ్వరితో తనగోడు చెప్పుకొంటుంది? కావాలని, కాసులకోసం తనని ఆవేదనాగ్ని గుండంలోకి పడద్రోసిన తన తల్లిదండ్రులకెటూ ఆ విషయం పట్టదు అన్నదమ్ములా అంతకుమునుపే పట్టించుకోరు—అది లోకసహజం. కనీసం తోటివారైనా తనను కనికరించరా అనుకొంటే—వారు సైతం గేలి చేస్తున్నారు. ఇక తనకు దిక్కెవ్వరు? దుర్గ!—ఇక్కడే ఇందాక నేనన్న 'దుర్గ'ను పూర్ణమ్మ 'ఆత్మ'గా ఆయన భావించాడనటంలోని ఔచిత్యం గోచరిస్తుంది.

ఇక్కడింకొక మాట! ఈ సన్నివేశాన్ని ఊహించినప్పుడు—మనకు వెంటనే స్ఫురణకు వచ్చే మరోపాత్ర—రవీంద్ర కవింద్రుని 'సుభా'! ఆమె సైతం దాదాపు పూర్ణమ్మవంటి వేదననే అనుభవించింది. దాదాపు ఇదేమోస్తరు దీనస్థితిలో నిస్సహాయస్థితిలో ఉంటుంది. ఆమెగూడా—తనగోడు వినేవారు కరవైనప్పుడు—నిర్జన ప్రదేశానికి వెళ్ళి పుడమి తల్లి విశాలమైన వడిలో బోర్లాపడుకొని—హృదయం బ్రద్దలయ్యేలా రోదిస్తుంది. ఆ సన్నివేశాన్ని తలచుకొన్నప్పుడు మూలగని హృదయం ఆక్రోశించని మనస్సు వుండవు అయితే 'సుభా'కు కొంతకాలం తన మూగసొద వినాలని వెంటపడే ఒక తోడులాంటి వాడున్నాడు, పూర్ణమ్మకు అదిగూడా కరవే! అంతే తేడా.

'కొన్నాళ్ళకు పతి కొనిపోవచ్చెను
పుత్తడి బొమ్మను పూర్ణమను
చీరలు సొమ్ములు చాలగ తెచ్చెను
పుత్తడి బొమ్మకు పూర్ణమకు.'

ఒకే నాల్గు బంతుల గేయంలో 'పుత్తడి బొమ్మను పూర్ణమ'ను అనీ: పుత్తడి బొమ్మకు పూర్ణమకు అనీ వాడేశాడు. ఏమిటీ ఈ విపరీత పునరుక్తి?—అని సందేహించటం సహజం. పునరుక్తిని మన మానసాలలో ఆమె రూప—లావణ్య—సౌకుమార్య—ముగ్ధత్వాలను మళ్ళీ మళ్ళీ గుర్తుచేసేందుకు సాధనంగా వినియోగించుకొన్న ప్రతిభాశాలి ఆ కవి. కాగా ఈ గేయంలో ఆయన మళ్ళీ మళ్ళీ అలా పునరుక్తి చేయటంలోని ప్రత్యేక లక్ష్యం మరొకటి: అసలే పుత్తడిబొమ్మ ఆమెను కాస్తా తీసికెళ్ళి పోవటానికి వచ్చాడు. అంటే—సిరిని అపహరించుకుని పోతున్నాడన్న ధ్వని మొదటి అర్థభాగంలోనూ; అలాగే—ఆమె అసలే 'పుత్తడి బొమ్మ' అయితే—ఆమెకు చీరలూ, సొమ్ములూ తెచ్చాడనటంలో మరో అద్భుతమైన వ్యంగ్యం వుంది. సూర్యుని దివిటీపట్టి చూడ యత్నించినట్లు—'పుత్తడి' బొమ్మకు సొమ్ములు పెట్టటాన్ని అపహాస్యం చేస్తున్నాడు. ఆ సొమ్మును ఆమె కర్పించటం నిరర్థకమన్నది ధ్వనింప చేయటం కవి

ఉద్దేశ్యం. ఆ నిరర్థకత ద్వివిధం—ఒకటి పుత్తడి పోత పోసిన ఆ బొమ్మకు వేరే పుత్తడి సొమ్ములేల నన్నది; మరోటి—ఆమె కెన్ని సొమ్ములూ, చీరలూ సింగారించినా—'ఆమె 'దక్కనిది' అని చెప్పటం—

అలాగే—ఇదే మోస్తరు నిరర్థకతను స్ఫురింప చేస్తూ సాగిస్తాడు తర్వాత రచనం కూడా కవి.

'పసుపు రాసిరి బంగరుమేనికి' అని.

అసలే బంగరు మేనుకదా- ఇంకా పసుపు రాయట మెందుకు?

ఇంత విచారంలోనూ, విషాదమధ్యంలోనూ ఆమెనూ, అమెతోపాటు మనలనూ అత్యంత విషణ్ణంగా, బరువుగా నవ్విస్తాడు కవి—అగత్యంగా!—

పెద్దల కప్పుడు మ్రొక్కెను పూర్ణమ
తల్లీ దండ్రీ దీవించ్రీ
దీవన వింటూ పక్కున నవ్వెను—
పుత్తడి బొమ్మా పూర్ణమ్మా.....'

ఆమె—వారి దీవనవింటూ పక్కున నవ్వింది. అవును మరి—నవ్వకేం చేస్తుంది? ఏడవగలంత వరకూ. ఏడుపు వచ్చినంతవరకూ ఏడ్చింది. ఇక ఏడ్చేందుకు ఆమెలో ఓపికలేక, ఏడ్చి ప్రయోజనం లేక, తర్వాత ఏం జరుగబోతోందో తాను నిర్ణయించుకొనే ఉన్న కారణాన—ఆమె నవ్వింది. ఆమె కాదు—ఆ తల్లిదండ్రుల దీవనను ఆ సమయంలో వింటే మనమూ నవ్వుతాము. వారి దీవనలేమై యుంటాయో మనకు ఊహ్యమే. అవి ఎంత అసంగతాలోకూడా మనకు తెలుసు. తెచ్చికట్టిందేమో—'ముదుసలి'వి—అయినా రివాజు ప్రకారం—'దీర్ఘ సుమంగళీ భవ' అని దీవించి ఉంటారువారు. అది నిజమయ్యే దీవనో కాదో ఆమెకూ, ఆమె తల్లిదండ్రులకూ—మనకీ గూడా తెలుసు. అయితేనేం—వారు లాంఛనానికి దీవించినందుకు—వారికి తనయెడగల బాధ్యతలేని బాంధవ్యానికి నవ్వు వచ్చింది—నవ్వింది. ఆ నవ్వులో వైరాగ్యం ఉంది. ఆ నవ్వులో విరక్తితోకూడిన విషాదం ఉంది. ఆ నవ్వు తన వారి స్వార్థమనస్కతను గూర్చి కావచ్చు — జరగబోయే విపరిణామాన్ని ఊహించలేనివారి అమాయకతనుచూచి కావచ్చు. వారి నిష్ప్రయోజనకరబంధుప్రీతివిూది జాలి కావచ్చు. ఇలా ఆ నవ్వు కెన్నైనా అర్థాలూ, అన్వయాలూ ఉండవచ్చు. అలా నవ్వించా డామెచేత—ఇదమిద్ధమన్న అర్థంలేకుండా—అన్ని అర్థాలూ ఇమిడేట్లు నవ్వించాడు కవి.

పైన ఒకచోట—

వదినెలు పూర్ణకు పరిపరివిధముల
నేర్పులుచేసే కైచేస్రీ'—అనీ—
ఇక్కడ—

తల్లిదండ్రీ దీవించ్రీ' అనీ ఒక విలక్షణమైన కృతకపదప్రయోగం చేస్తాడు కవి. మొత్తం ఖండికనంతనూ ఎంతో చక్కని పదనిర్మాణంతో—లయబద్ధమైన నడకతో సాగించిన కవి—ఈ రెండు సందర్భాలల్లోనూ — పదాలకోసం వెతుక్కున్నాడనీ—అవి దొరకక—కృతకం చేశాడనీ చెప్పుకోవటం—ఆయన ప్రతిభను కించపరచటం. కవి ఈ రెండు సందర్భాలలో మాత్రమే అలా కృతకపద ప్రయోగం చేయటం చూస్తాం నిదానించి ఆలోచిస్తే — ఆ ప్రయోగం కూడా ఒక 'ధ్వని' ఆంతర్వ్యంగాగలదే నన్నది పొడకడుతుంది.

ఈ కృతకపదప్రయోగంతో—అక్కడ వదినెలలోనూ, ఇక్కడ తల్లిదండ్రులలోనూ—ఆమెయెడగల—అసహజమయిన— కేవల కృత్రిమమూ, కృతకమూ నయిన ఆదరాభిమానాలను వ్యంజకం చేయటానికే ఈ పదప్రయోగవైలక్షణ్యాన్ని అక్కడ ప్రదర్శించాడు కవి. నిజమైన — నిర్మలమైన ప్రేమ, వాత్సల్యం, ఆదరణ, అభిమానం అనేవే ఆమెయెడ వారికి ఉంటే—ఆమె జీవితగమనమే మరోలా ఉండేది. కాని అలా జరగలేదు ఆమె జీవితం వక్రమార్గాన పర్యవసించటానికి హేతుభూతమైనవారి కృతక వాత్సల్యాభిమానాదులను, కుచ్ఛితమనస్కతనూ వ్యంజకం చేసేందుకు అంతే అసహ్యంగా, కృతకంగాను తోచే పదాలు వాడాడు—క్రియాత్మకంగా—కవి. వారి

క్రియలూ అంతే కృతకాలు అని చెప్పటమే ఇక్కడ కవి తాత్పర్యం

ఇంతకూ 'ఫక్కున నవ్వింది' పూర్ణమ్మ. ఎందుకంత ఫక్కున ఆమె నవ్విందో మనకు తెలిసిందే.

నవ్విన తర్వాత కేవల సంప్రదాయ భిన్నమైన తీరున, ఆమె జీవితంయొక్క అపసవ్య గమనానికి తార్కాణమా అన్నట్లు సాగుతుంది ఘటనా చిత్రణం!—లోకంలో సహజంగా—ఒక బిడ్డ పుట్టిల్లు విడచి, అత్తింటికి వెళ్లేటప్పుడు—ఆమెకు తల్లిదండ్రులు 'హితబోధ' చేయటం చూస్తాంగాని—ఆమె—తనవారికి 'హితబోధ'లు చేయటం చూడం. అది సహజత్వానికి భిన్నం! అయితే—ఇక్కడ పూర్ణమ్మే 'హితబోధ'న కుపక్రమించింది. ఆమె 'అంపకపు వాక్యాలు'—అసలు జీవితంనుండే అంపకం పలుక్కుంటున్నవి!— ఈ సంగతి ఆఖరివాక్యందాకా మనకు స్ఫురింపకుండా చేస్తాడు కవి. ఆమె ఈ సందర్భంగా హితబోధగా పలికిన ప్రతిమాటా — తన అంతాన్ని చూచాయగా సూచిస్తున్నదే. అది పరిశీలించి విన్నవారికి స్ఫురిస్తుంది. లేనివారికి లేదు. వాళ్లవాళ్లు—ఆ పరిశీలనం చేయలేదు కనుకనే ఆమె 'అంతా'న్ని ఊహించకపోవటం జరిగింది.

'అన్నల్లారా తమ్ముల్లారా
అమ్మను అయ్యను కానండీ
బంగరు దుర్గను భక్తిని కొలవం
డమ్మలకమ్మా దుర్గమ్మ'...

అని తొలుదొల రెండవ గేయంలో కవి అన్న 'అమ్మలగన్న అమ్మల్లారా' అన్న సంబోధన—ఇక్కడ దుర్గను 'అమ్మల కమ్మా దుర్గమ్మ' అనటంతో సమన్వయం.

బంగరుదుర్గను కొలవమనటంలో—తన ఆత్మను మరువవద్దని హెచ్చరించటం — అమ్మనీ, అయ్యనీ కనమని ముందే చెప్పటంలో— మనకు—పరోక్షంగానే అయినా—కవి ఆమె పలుకులద్వారా ఆ అన్నదమ్ముల మనస్తత్వాలను రేఖామాత్రంగా ద్యోతకం చేస్తున్నాడు. అంతేకాక—తన నింతగుండాన త్రోసినా—తన కన్నవారి యెడ తనకుగల అవ్యాజప్రేమానురాగాలను ఆమె ప్రకటింపటం—ఇక్కడ కవి ఉద్దేశం.

సరిగ్గా తనకు 'దుర్గ'పై ఏలాంటి అచంచల భక్తి ప్రపత్తు లున్నాయో — అదేమోస్తరు భక్తి ప్రపత్తులను 'దుర్గ'పై వారు గూడా ఉంచాలని ఆమె వాంఛ. అందుకే కవి — ఆమెపూజా, అర్పణా సందర్భంగా ఏ యే పదజాలాన్ని వాడాడో, మళ్లీ అదేమోస్తరు పదజాలంతో ఆ సమర్పణాభావాన్ని వారిలో అంకురింపచేస్తాడు. ఆమెచేత అనిపిస్తాడు

'ఏయే వేళల పూసేపువ్వుల
ఆయాఋతువుల పళ్లన్నీ
భక్తినిగోసి శక్తికి యివ్వం
డమ్మలకమ్మా—దుర్గమ్మ' అని.

ఆమెచేత కడసారి వాక్యాలుగా పలికించిన మాటలు—చిరకాలం ఆమె సన్నిహితుల మనస్సుల లోనేగాక—చదివిన, ఆమెను అర్థం చేసుకున్న అందరిలోనూ మార్మోగు తుంటాయి.

'నలుగురు కూర్చొని నవ్వేవేళల
నాపే రొకతరి తలవండి
మీమీ కన్నబిడ్డల నొకతెకు
ప్రేమను నాపేరివ్వండి' అంటుంది.

ఈ కోరిక సహజంగా, జీవితాన్ని అంతం చేసుకోవాలని నిర్ణయించుకొన్న వారిలోతప్ప అన్యులలో జనించదు. వారు తనను 'నవ్వే' వేళలలోనే తలుచుకోవాలనటంలో ఎంత నిగూఢార్థం ఉందో చూడండి. తన జీవితకాలంలో తానెన్నడూ—గ్రాహికం తెలిసిన తర్వాత—నవ్వి ఎఱుగదు. నవ్వను నోచుకోలేదు. అలాంటిది—ఆమె వారందరూ అయినా నవ్వుతూ ఉండాలని కోరుకొంటోంది. ఇది ఎంతో లోకోత్తరమయిన కోర్కె. ఆమె హృదయస్నిగ్ధతకు తార్కాణం. కాగా—'మీ మీ బిడ్డలకు నా పేరుంచమని' అభ్యర్థించటంలో—లోతుగా ఎంతో చురుకైన హెచ్చరిక చేస్తోంది ఆమె. వారితో తన ప్రగాఢ బాంధవ్యాన్ని గుర్తించడం మాత్రమేకాక, తనలాంటి దుఃఖ భాజనమైన చరిత్రలు, ఇకపైనైనా పునరావృతాలు కాకుండా ఉండటానికి—వారికి తన పేరు పెడితే—తానెటూ కొద్ది సేపట్లో జీవితాన్ని ముగించుకో

నున్నది గనుక — తన నుదాహరణంగా తీసుకొనియైనా తమ బిడ్డల భవిష్యత్తును వారు నాశనం చేయకుండా ఉంటారని ఆమె తాపత్రయం. ఇదెంత లోక కల్యాణ కారకమయిన వాంఛితమో చూడండి.

అంతా నవ్వి, అతి నిబ్బరంగా ఈ పలుకులు పలికిందేగాని, స్త్రీ సహజమయిన బేలతనం ఆమెను ఇంకా విడనాడలేదు అందుకే—

'బలబల కన్నుల కన్నీ రొలికెను
పుత్తడి బొమ్మకు పూర్ణమకు' అన్నాడు కవి.

'కన్నులు తుడుచుక కలకల నవ్వెను
పుత్తడి బొమ్మ పూర్ణమ్మ' అంటాడు మళ్ళీ.

ఈ సారి నవ్వటంలో ఏలాంటి భావం లేదు. కేవల స్నిగ్ధత్వం వుంది. అంతే! అందుకే 'కిలకిల' అమాయికంగా అతిసహజంగా నవ్వింది. ఒక పసి బాలిక నవ్విన నవ్వే అది. అందులో ఎలాంటి విచార చ్ఛాయలూ, విషాద ధ్వనులూ లేవు. కారణం? అన్నిటినీ అధిగమించిన ఒక ఆత్మ స్థైర్యాన్ని పొందిన స్థాయికి చేరుకుంది, ఆ పసి మనస్సు అందువల్లనే నిర్మలంగా—భావశూన్యంగా— నవ్వింది—'కలకల' ఇదెంత సహజ పరిణామమో చూడండి. ఆ తర్వాత మళ్ళీ మనకు పూర్ణమ్మలోని భావవైవిధ్యాన్ని ఇక చూపడు కవి. అసలు ఆ నవ్వుతోనే-దాదాపు పూర్ణమ్మ ఓ దివ్యత్వ భావాన్ని మనలో కల్పించి—అదృశ్యం అవటం ఆరంభించింది. అందుకే ఇక కవి ఆమె వదనంగాని— అందలి ఛాయలుగాని—అసలు ఆ మూర్తిలోని ఏ వివర మైన పోకడను, పొడనుగాని—మనకు చెప్పడు. కారణం — మూర్తి — ఆత్మైక్యాన్ని పొందబోతూ దూరమయి పోవటమే.

ఆ తర్వాత—అంతా వగచారు—కాని 'ఆయ్యోకడె' మాత్రం ఆనందించాడు. ఎందుకు? 'కాసుకు లోనై— అల్లుని తలచుకుని'. ఇక్కడ ఇందాక గుర్తుంచుకో మన్నమాట !—'కాసుకు లోనై తల్లీదండ్రీ'—ముదుసలి మొగుడికి ముడివేస్రీ' అని ఆమెను ఈ గుండంలోనే తోసినందుకు. తల్లిదండ్రుల ఉమ్మడి బాధ్యతను చెప్పిన కవి—ఇప్పుడుమాత్రం ఆనందించినవాడు ఒక్కతండ్రే నంటాడు. అంటే—స్త్రీ సహజమయిన ఆశాధికృతలో ఆనాడు ముదుసలివాడికి—పిల్ల భాగ్య భోగ్యాలను తలచి—ధారపోసినా—ఆ తల్లి—ఈనాడు— 'ముసలివాడికిచ్చి చేశాంగదా—ఏం సుఖం అనుభవి స్తుందా' అని ఆలోచించి, విచారించింది. అందుకే ఆమె ఆనందించుతున్నట్లు చెప్పడు. ఇక్కడ ఆమె హృదయంలోని అనుకంపమాట అలావుంచి, తండ్రి లోని కాఠిన్యాన్ని వెలువరించటం ప్రధానంగా పెట్టు కున్నాడు. ఆమె ఎప్పటిలాగే—దుర్గను కొలవటానికి పోయింది.

'ఎప్పటియట్టుల సాయంత్రమ్మున
యేరిన పువ్వులు సరిగూర్చి
సంతోషమ్మున దుర్గను కొలవను
వొంటిగబోయెను పూర్ణమ్మ.'

ఇంత సామాన్యంగా చెబుతూనే— ఒకమాట మళ్ళీ విలక్షణంగా వేశాడు. 'సంతోషమ్మున దుర్గను కొలవను వొంటిగపోయెను పూర్ణమ్మ'. అసలా పన్ని వేశం 'సంతోషం' రాతగ్గదేనా? ఆమెకు మరి ఆ సంతోష మెందుకు? ఒకందుకే! ఆమె యీ బాధల నుంచి శాశ్వతవిముక్తి పొందబోతోంది. భూమికి జారిన వెలుగు కిరణం—అనంతకాంతిమయిని జేరు తోంది. మరణాన్ని సంతోషంగా స్వీకరించే సాహస, ధైర్యాలకన్న ఆమెలో—తన దుర్గను తాను జేరు తున్నాను, శాశ్వతంగానన్న ఊహ—అపరిమితానంది. ఈ మధ్య చాలాకాలంగా—'ముదుసలి మొగుడిని' కట్టుకున్ననాడిగా—ఆమె దుర్గను సంతోషంగా చూడ వెళ్ళిన సందర్భంలేదు—మళ్ళీ యివ్వాళ్ళే. ఆమె 'ఆత్మను' దుర్గగా భావించాడు కవి అన్నది ఈ సందర్భంలో గూడా సమర్థనీయమే. పూర్ణమ్మ దుర్గ కడకు సంతోషంగా పోయింది. ఒంటరిగా పోయింది. ఒంటరిగా పోవలసిన అవసరం వుండ బట్టి—ఒంటరిగానే పోయింది. ఇప్పుడు సాయంసమయ వర్ణనం చేశాడు కవి:

'ఆవులు పెయ్యలు మందల జేరెను
పిట్టలు చెట్లను గుమిగూడెన్
మింటను చుక్కలు మెరయుచు పొడమెను
పూర్ణమ యింటికి రాదాయె!—

సాయంసమయవర్ణనంలో ఎంత సౌకుమార్యం ఉందో అంతటి సంకేతంగూడా వుంది. అది కథా సన్నివేశానికి ఎంత దోహదకారియో గూడా గనునార్హం.

విజానికి సాధారణ దృష్టిలో—సామాన్య భావనా

విధానంలో అయితే—ఆమె చనిపోబోతోంది గనుక—సాయంసమయవర్ణనాన్ని— అందు కనుకూలంగా చేయటం రివాజు—చీకట్లు లోకాన ఆవరిస్తున్నట్లు ఆమె జీవితాన్ని మృత్యువు ఆవరిస్తోందనో—మరో లాగానో – కాని అలాగే భావించి ఉంటే గురజాడవారి ప్రత్యేకత లేదు. ఆయన 'మహాకవి'త్వమూ లేదు. అదే ఆయన వర్ణనావైశిష్ట్యం.

'ఆవులు పెయ్యలు మందల చేరెను
పిట్టలు చెట్లను గుమిగూడెన్
మంటను చుక్కలు మెరయుచు పొడమెను
పూర్ణమ యింటికి రాదాయె'

ఎవరి నెలవులకు వారు చేరుకొంటున్న సమయంలో—పూర్ణమ ఇంకా ఇంటికి రాలేదంటూనే—ఆమె గూడా—తన అసలైన 'నెలవు'కు చేరుకుంటున్న భావాన్ని ధ్వనింప చేస్తాడు కవి. ఇదెంత ఉత్తమమైన భావనో గమనించాలి.

అప్పుడు

'చీకటి నిండెను కొండల కోనల
మేత్రకు మేకములు మెసలజనెన్
దుర్గమ మెడలో హారము లమరెను
పూర్ణమ యింటికి రాదాయె' అంటాడు.

ఇది మళ్ళీ విచిత్రమైన చిత్రణే. కొండలా కోనలా చీకటి నిండుతున్నప్పుడు— మేకములు—మేతల కోసం మెసలట మేమిటి? అది అసమయం కదా? అయితే స్థూలంగా యిలా తోచే అనౌచిత్యంలో—సూక్ష్మంగా ఒక విషయాన్ని ధ్వనింప చేస్తున్నాడు కవి. చీకట్లు లోకాన చిమ్మగా—మేకాలు తిరుగాడ నారంభించాయనటంతో— అజ్ఞానాంధకారం మనస్సుల నావరిస్తుండగా — పశుప్రవృత్తులు మేల్కొని—విజృంభించ సాగాయని చెప్పటం కవి ఆంతర్యం.

'దుర్గకు మెడలో హారము లమరెను. ఇదీ విలక్షణమైన చిత్రణే. రాత్రులందు దేవతావిగ్రహాలకు అలంకారమేమిటి? అంటే — ఆమె మెడలో హారము అమరటంలో—పూర్ణమ్మ గమ్యాన్ని కవి స్ఫురితం చేసున్నాడు.

మళ్ళీ 'పూర్ణమ యింటకి రాదాయె' అంటాడు. అని ఇక్కడ చదువరిలో—పూర్ణమ్మ యేమైనదన్న ఉత్కంఠను రేపుతాడు. అంతేగాక—ఆమె ఉనికి గూర్చిన పూర్తి వివరాల్ని మనం తెలుసుకోవాలనే అవ్యాజజిజ్ఞాసను రేకెత్తిస్తాడు

కడకు పూర్ణమ్మ ఘాతికాకృతి ప్రకృతిలోనూ, ఆత్మ దుర్గలోనూ ఐక్యమయినట్లు చెప్తాడు, పూర్ణమ్మ 'చనిపోయింది' అని సూటిగా చెప్పడు కవి. అలా చెప్పకపోవటమే ఆ మహాకవి లక్షణం. ఆ మాటకు—అసలు 'చావు'ని ఏ మహాకవీ 'వాచ్యం' చేయడన్నది అభిజ్ఞుల విశ్వాసం.

'కన్నుల కాంతులు కలువల చేరెను
మేలిమి చేరెను మేని పసల్—
హంసల చేరెను నడకల బెడగులు
దుర్గను చేరెను పూర్ణమ్మ.'

ఆయుర్వేద భూషణ
పండిత నోరి రామశాస్త్రులవారి

*** క్షీరవర్ధని ***

చనుబాలను వృద్ధి చేయు రసాయనము. దీనిని వాడుటవలన చనుబాలు స్వచ్ఛమై సమృద్ధిగా పసిపాపకు సరిపోవునట్లుచేసి, లేలి పిల్లల యారోగ్యమును కాపాడును.
వెల 100ml రు. 3/– : 200ml రు. 5/–

*** జీవనవటి ***

ధాతు పుష్టికి, నరముల పటుత్వమునకు ప్రసిద్ధి గాంచినది. శుక్లనష్టము, నపుంసకత్వము లచే పీడింపబడు వృద్ధులకు చైతము శక్తి నిచ్చి, ఓజస్సును వృద్ధి చేయును.
వెల 30 మాత్రలు రు. 6/–

మాచే దీర్ఘవ్యాధులకు పోస్టుద్వారాకూడ సలహా యిచ్చి, ప్రత్యేకచికిత్స చేయబడును. క్యాటలాగు, సలహా ఉచితము.

డాక్టరు నోరి వెంకటేశ్వరశాస్త్రి,
A.V.A.C., A.L.I.M.
చీఫ్ ఫిజిషియను. ఆయుర్వేద నిలయం,
పోస్టుబాక్సు 32, విజయవాడ–1. ఆంధ్రప్రదేశ్.

అక్కడక్కడనుండి ఆయా ప్రకృతి సహజ సుందర లక్షణాలన్నీవచ్చి ఒక రూపంగా మేళన మయి— పూర్ణమ్మ రూపం దాల్చి—ఆ రూపంలో— దుర్గ అంశ ఆత్మగా నిలిచి— ఇంతకాలం ఒక కథగా నడిచి, ఇప్పుడు మళ్లీ ఆత్మ దుర్గలో లీనమయి, ఏ ప్రకృతి సహజసుందరలక్షణం ఆ ప్రత్యేక ప్రకృతి వస్తువులో లీనం కావటంగా చెప్పిన కవి భావనా విధానం— అనుపమానం.

సూటిగా—పూర్ణమ్మ 'ఇలా ఉంటుంది'—అని మనకు ఆదినుండీ చెప్పని కవి—ఇక్కడ మాత్రం స్థూలంగా ఆమె సౌందర్య, సౌకుమార్యాలను వర్ణి స్తాడు. అలా వర్ణించిన ఆయన వర్ణనలు —ఇంత వరకూ, ఆయనగా చెప్పకపోయినా 'పూర్ణమ్మ' అంటే మనం రూపొందించుకొన్న ఆకృతికి ముమ్మూర్తులా సరిపోయే లక్షణాలు కావటం ఒక అద్భుతం. ఇది మనం ఏ యితర కావ్యాలలోనూ చూడని ఒక అసమాన ప్రతిభావిశేషం. చదువరిచేతనే పాత్ర రూపకల్పనం— (భావాత్మకంగా) చేయించి—అదే మోస్తరు—సరిగ్గా అదే రూపాన్ని ఆసాంతంలో వారి ముందుంచి— వారిలోని భావనాశక్తిని యీ విధంగా ప్రేరేపించిన కవి ప్రతిభ గొప్పది.

మహాకవులకు మాత్రమే సాధ్యమనిపించే— ఇలాంటి ఎన్నో విలక్షణ సాహితీ ప్రక్రియలతో— 'పూర్ణమ్మ'ను రూపొందించి—చిరకాలం మనలో సజీవంగా నిలిపిన—గురజాడ – నిజంగా మహాకవి. ఆయనా, ఆయన పూర్ణమ్మా సంపూర్ణయశః కాయులు !



# చీకటి

శ్రీమతి ఆ. వసుంధర

మేడమీద బాల్కనీలోనికి ఆరుమైళ్ళ అవతలగా వున్న సముద్రం నిరంతరాయంగా చల్లని గాలిని పోస్తోంది. అక్కడక్కడా మిణుకుమనే తారల కాంతివలన పలుచబడ్డ చీకటిని ఆకాశమనీ, చిక్కగా గడ్డకట్టినట్లున్న చీకటిని నేలనీ అనుకోవాలి తప్పించి మరేమీ కనపడదు ఆ బాల్కనీలో కూర్చుంటే. అంతకంటే గదిలో బార్ లైట్ మెత్తని వెలుగులో ఫాన్ వేసుకుని కూర్చోవటమే యిష్టం లలితకు. ఇప్పుడు నారాయణి కోరికమీదనే బాల్కనీలోనికి రావలసివచ్చింది. అందులోనూ లైటు తీసేసి చీకట్లో కూర్చోవటం తనకు ఎంతో యిష్టం అన్నది నారాయణి. రోజంతా తీరికలేకుండా పనిలో సతమతమైపోయిన మనసుకు చీకట్లో ఒంటరిగా కాస్సేపైనా కూర్చుంటేగాని బరువు తగ్గి స్వేచ్ఛ పొందినట్లుండదట! ఎన్నో ఏళ్లకు తరువాత కన్పించిన స్నేహితురాలిదగ్గర మొహమోటానికి వూరుకున్నదిగాని నిజానికి చీకటంటే ఏమాత్రం యిష్టం లేదు లలితకు.

వృద్ధరాజమాతలాగా యీ మేడలో రాజ్యం చేస్తున్న అత్తగారిని చూచిపోవడమనే మొక్కుబడి చెల్లించుకోవడానికి అప్పుడప్పుడు యీ వూరు వస్తుంది లలిత. ఈ 'రాక'లో విసుగ్గల్గించే విషయాలు అనేకం వున్నాయి. అందులో ముఖ్యమైనది వచ్చినప్పుడంతా 'నెలనెలా బైటచేరుతున్నావా? అని ముసలామె అడగటం. పిల్లలు కావాలని ఏడవటం లేదు లలిత. వాళ్ళు లేకుంటేనే సుఖం అనుకుంటోంది. అందుకే విసుగు. రెండో విషయం యీ మేడ. విశాలమైన గదులతో, ఎత్తుగోడలతో, పెద్ద బాల్కనీలతో యీ మేడను సగం ఆస్తి ఖర్చుచేసి యీ శ్రీపురంలో కట్టించాడు మామగారు. అది ఆయన చేసిన పెద్దబుద్ధితక్కువపని అనుకుంటుంది లలిత. ఇదే పదిమైళ్లవతలవున్న నెల్లూరులో కట్టించివుంటే ఎంత వుపయోగంగా వుండేది! ఎంత దర్జాగా వుండేది! పోన్లెమ్మనుకుందామంటే ఆ కట్టించటం వూరికీ చివరగా పూర్వాభిముఖంగా కట్టారు. సాయంత్రాలు బాల్కనీలో కూర్చుంటే లైట్లూ రోడ్లూ మనుష్యులూ కనబడితే బాగుంటుంది. కాని యిక్కడ చీకటి తప్పించి మరేమీ కనబడదు!

పదిరోజుల క్రితం నెల్లూరులో వుండగా తలసగం నెరిసిపోయిన లావుపాటి గుమాస్తాలాంటి మనిషి వచ్చి తాను నారాయణి భర్తననీ, తాసిల్దారుగా శ్రీపురానికి ప్రక్కనున్న వూరికి బదిలీ అయివచ్చామనీ, నెల్లూరు వస్తుంటే తనను తప్పకుండా చూసిరమ్మని నారాయణి మరిమరీ చెప్పిందనీ అన్నప్పుడు లలితకు సంతోషంతోపాటుగా నారాయణిమీద చాలా జాలికూడా కలిగింది. నారాయణికీ తన ఎదురుగా కన్పిస్తున్న మిజరబుల్ స్పెసిమెన్‌కి ఎక్కడి సంబంధం! అనుకున్నది. ఎలాగూ తాను యింకో పది రోజుల్లో శ్రీపురం వస్తున్నాననీ అప్పుడు నారాయణిని కలుసుకుంటాననీ అతనితో చెప్పింది. చెప్పినట్లుగానే యిక్కడకు వచ్చిన మరునాడు సాయంత్రం నారాయణిని తీసుకురమ్మని కారు పంపింది.

కొంచెం స్థూలంగా ఏమాత్రం నాజూకు లేకుండా కన్పిస్తూ పెద్దగా మోటుగా మాట్లాడే నారాయణిని చూడగానే అంతకు ముందున్న వుత్సాహమంతా చప్పబడిపోయింది లలితలో. తామిద్దరూ కాలేజీలో బి. ఏ. చదివే రోజుల్లో నారాయణి బంగారు తీగలాంటి అందగత్తె; తనకంటే తెలివైనది; తియ్యని కలలాంటి భవిష్యత్తు గలది. యిప్పుడు?

ఈ మార్పు నారాయణిలో వచ్చిందా? లేక తనలోనే వచ్చిందా?

'ఆ దూరాన సముద్రం వుండాలి కదూ?' అన్నది నారాయణి పెద్దగా; మోటుగా, నిశ్శబ్దాన్ని చీలుస్తూ.

'ఊఁ' అన్నది లలిత. ఆ మోటుదనాన్ని భరించలేని చిన్న విసుగును దాచిపెడుతూ.

'మనం కాలేజీలో చదువుతున్నప్పుడు నీకు సముద్రమంటే చాల యిష్టం వుండేది' అన్నది నారాయణి ఒక గొప్పసత్యాన్ని ఆవిష్కరిస్తున్నట్లు.

లలిత మనసులో కొద్దిగా అశాంతి రేగింది. ఎదుటి వాళ్ల మనసుల లోతుల్లోకిపోయి కెలకటం నారాయణి మోటుదనానికి మరో చిహ్నంగా తోచి విసుక్కుంది. అవును...అప్పుడు తనకు సముద్రమంటే ఎంతో యిష్టంగా వుండేది. ఎప్పుడూ హోరుమంటూ శబ్దంచేస్తూ, అనంతమైన శక్తిని లోన యిముడ్చుకోలేనట్లు ఉరకలూ పరుగులూ పెడుతుండే సముద్రంతో ఏదో తాదాత్మ్యం పొందేది మనసు. ప్రాణం వున్నదా లేదా అన్నట్లుగా నిర్జీవంగా చైతన్యరహితంగావుండే తనను చైతన్య స్వరూపమైన సముద్రం అమితంగా ఆకర్షించింది. కాని, పెళ్లయ్యాక, యీ పది సంవత్సరాల్లో ఎప్పుడో తెలియకుండానే ఆ సముద్రంతో సంబంధం పోయింది. 'అంతకంటే ఎక్కువ చైతన్యం నాలోనే ఏర్పడటంవలన కాబోలు!' అని నవ్వుకున్నది లలిత.

'యిప్పుడు యిలాంటి ప్రొద్దుపోని వూహలకి వీలుండదు, నారాయణీ! ఎప్పుడూ క్లబ్బు, స్నేహితులు, పార్టీలు, పిక్నిక్కులు, సినిమాలు...తోచకుండా వుండటమంటూ వుండదు నాకు' అన్నది.

'అవును మరి...నీవు చాల లక్కీ' అన్నది నారాయణి మెచ్చుకోలు ధ్వనిస్తున్న స్వరంతో. వచ్చినప్పటినుండీ యింటినీ, వస్తువుల్నీ, తన సౌభాగ్యాన్నంతటినీ యింతింతలేసి కళ్లతో నారాయణి పరిశీలిస్తున్న విషయం లలిత గమనించింది. 'పాపం! తాసిల్దారు భార్య!' అనుకున్నది. తానూ టైర్ కంపెని రిప్రజెంటేటివ్ భార్య కాకమునుపు యిట్లాగే అనుకున్నది—మంచి సోఫాసెట్టూ, రిఫ్రిజిరేటరూ, కారూవుంటే ఆనందం అరిచేతిలో వుంటుందని! ఏడువందల జీతంనుండీ జాగ్రత్తగా కూడబెట్టిన డబ్బుతో అవన్నీ కొన్నారు. సుఖజీవనం కావాలంటే కావలసినవి యింకా ఎన్నో వున్నాయని తెలిసింది యిప్పుడు.

'అమ్మా, యీ పరుపు మంచివాసనే' అని గదిలోంచీ కేక పెట్టింది నారాయణి మూడేళ్ల కూతురు జలజ. లలిత లోపలికి చూసింది. బూరుగదూదిలో మంచిగంధప్పొడి చల్లించి కుట్టించిన పరుపువిూది తెల్లని దుప్పటిని ప్రక్కకు తోసేసి మురికిబూట్లతో తొక్కి నాశనంచేస్తున్న జలజను చూడగానే కోపం వచ్చింది లలితకు. 'మానర్ లెస్ ఛైల్డ్' అనుకుంది విసుగ్గా. 'అమ్మా, పరుపంతా తొక్కి నాశనంచెయ్యకు, రా' అన్నది నారాయణి. ఆ పిల్లను యివతలికి రప్పిదామనే గట్టిప్రయత్నం చెయ్యకుండానే.

'అమ్మా, యీ పరుపు బాగుంది. మంచి వాసన' అన్నది జలజ యింకా ఎక్కువగా పొర్లుతూ. 'పోనీలే, చిన్నపిల్ల' అన్నది లలిత విసుగును కనపడనివ్వకుండా. అన్నదే చాలని నారాయణి పరుపును పిల్లకు వదిలేసి నిశ్చింతగా కూర్చుండిపోయింది. 'ఏం పెంపకం! ఏం పిల్లలు! క్రమశిక్షణాలేదు, పాడూలేదు. యింకా నయం, మిగతా ముగ్గుర్నీ యింటిదగ్గరే వదిలేసివచ్చింది' అనుకున్నది లలిత.

ఎదురుగ్గా అంతా చీకటి ఆ చిక్కనిచీకటీ పలుచనిచీకటీ కలుస్తున్నదూరంలో ఎక్కడో వుండాలి సముద్రం. పగటిపూట వెలుగు నింపుకొని మిడిసిపడే ఆకాశం చూపుమేర దూరమంతా ఆక్రమించుకొంటుంది. అప్పుడు పైర్లు పచ్చదనంతో నిండిన నేల కొంచెంగా పేలవంగా కన్పిస్తుంది. ఆకాశమూ నేలా దేనికది వేరుగా వుంటుంది. అవి కలిసేచోట సముద్రం వుండదు. చీకట్లోనే వుంది సముద్రానికి అస్తిత్వం.

'మా నాన్న పోయారు, తెలుసా?' అన్నది లలిత ఆకస్మాత్తుగా.

'ఆ, అల్లానా! I am very sorry, లల్లీ!' అన్నది నారాయణి జాలిగా. లలితకు తండ్రితోవుండే సంబంధం ఎంత గాఢమైనదో నారాయణికి తెలుసు.

ఇంత దూరానికి, ఆరుమైళ్ల దూరానికి, సముద్రపు హోరు వినబడుతుందా? ఇప్పుడు యీ నిశ్శబ్దంలో అతిమెల్లగా మెదడును స్పృశిస్తున్న ఆ భయంకరమైన హోరు కేవలం తన వూహేనా? ఇదివరలో ఎప్పుడూ వినలేదు యీ శబ్దాన్ని. ఎన్నో సార్లు యీ యింటికి వచ్చినా యిలా చీకట్లో కూర్చోవటంగాని సముద్రాన్ని గమనించటంగాని జరుగలేదు.

ఎప్పుడో తాను చిన్నపిల్లగా వున్నప్పుడు, నాన్న అనబడే మేరుపర్వతంమీద ఆడుకునే సెల యేరుగా వున్నప్పుడు, తల్లి చాటునుంచి తొంగి చూస్తున్న పిల్లిపిల్ల కళ్లల్లోని ఘనీభవించిన జీవ కాంతితో ప్రపంచాన్ని చూసినప్పుడు ఎక్కడ చూసినా సముద్రమే కన్పించింది. బాపట్లదగ్గర తమ వూరికి దగ్గరగానే వుండేది సముద్రం. అప్పట్లో ఒక్కసారి కూడా సముద్రాన్ని చూడలేదు నిజానికి. కాని వూరి నిండావుండే యిసుకనేలా, వూరిబయటి నాగజెముడు పొదల్తో నిండిన యిసుక దిబ్బలూ, ఆ దిబ్బల్లో పరుగెత్తుతూ స్నేహితులతో ఆడుకున్న ఆటలూ; చెప్పు పెట్టకుండా ఆ యిసుక దిబ్బల్లో అక్కడక్కడా వెలిసిన దొరువులూ, ఆ దొరువులచుట్టూ పరిమళాలు వెదజల్లుతూవుండే మొగలిపొదలూ; ఆ పరిమళాల్లో నివసించే విషపు పాములూ, ఆ పాముల గురించిన భయంకరమైన వూహలూ; వూరి బయటి నాగారుబొమ్మ గుడికి వెళ్లటానికి యిసుకలో సన్నగా మెలికలుడుతిరుగుతూ పారే ఏటిమీది సన్నని తాటిదుంగను దాటుతున్నప్పుడు, దుంగ ఒరుగుతుం దేమో—ఏట్లో పడిపోతానేమో అన్న ఆదుర్దా...అన్నీ కలిసి సముద్రమనే గాఢమైన అనుభవం నిలిచింది మనసులో. అప్పుడు సముద్రమంటే పాములాంటి ఏరూ, మొగలిపొదల్లోని విషపుపాములూ కలిగించిన చిన్న చిన్న ఆదుర్దాతో కూడిన విశాలమైన అనంత మైన ఆనందమయమైన యిసుక. ఎక్కడ చూసినా యిసుక!...శ్రీపురానికి సముద్రం దగ్గరే అయినా, ఇక్కడ యిసుక లేదు; డబ్బు పండించే మట్టినేల వున్నది.

'మీ నాన్నగారు పోయి ఎన్నేళ్లయింది?' అన్నది నారాయణి.

గుర్తులేదు. గుర్తు లేనన్ని ఏళ్లయిపోయింది. సముద్రంలాగే నాన్నగారూ స్మృతిపథంలో లేకుండా జారిపోయారు ఎప్పుడో, ఎల్లాగో! అమ్మ యివ్వ వలసిన ప్రేమనూ తాను యివ్వవలసిన రక్షణనూ రెండింటినీ తానే యిచ్చిన నాన్న!

సముద్రం చీకట్లోంచి మంచులాంటి గాలిని పోస్తోంది మీదికి.

'లోపలికి వెళ్దాం... మంచు కురుస్తోంది' అన్నది లలిత.

'ఇంకా కొంచెం సే పుందాం...యిక్కడ ఎంత బాగుంది!...నిన్ను చూస్తుంటే నాకు చాల అసూయగా వున్నది, లల్లీ...చక్కగా కొరున్నది నీకు. ఎన్నోసార్లు బీచ్‌కి వెళ్లివుంటావు కదూ?' అన్నది నారాయణి.

ఒక్కసారే భర్త నాగేష్‌తో వెళ్లింది లలిత. 'ఏ ముంటుందక్కడా? మ్రైడాస్ బీచ్ అను కున్నావా? మనుష్యులే వుండరు. బోర్' అన్నాడు. కాని లలిత బలవంతంమీద వెళ్లారు. ఇసుకలో నడుస్తుంటే లలితకు చిన్ననాటి జ్ఞాపకాలు వెలికి వచ్చాయి. 'మా వూరికి సముద్రం చాల దగ్గర. మా వూరినిండా యిసుకే వుంటుంది' అన్నది. నాగేష్ చిత్రంగా చూశాడు. 'ఎందుకూ యిసుక? చిన్నప్పుడు చూసిన యిసుకను చూడాలని యిప్పుడు నన్ను యిక్కడకు యీడ్చుకొచ్చా వన్నమాట! సెంటిమెంటల్ యిడియట్' అన్నాడు. భర్త విసుగుతో లలితకూ ఆ పిక్నిక్ బోర్ అన్పించింది. తరువాత సముద్రాన్ని మరచిపోయింది. నిజంగానే నాగేష్ చెప్పినట్లు యిసుకలో ఏమున్నది?

ఈ చీకట్లో అన్నీ పనికిమాలిన జ్ఞాపకాలే వస్తున్నాయ్. నిష్ప్రయోజకమైన వూహలు. ఇప్పుడు కావాలంటే ఎన్నిసార్లైనా బీచ్‌కి వెళ్లగలదు. కాని

యిక్కడి బీచ్‌లో ఏమీ లేదు. వట్టి బోర్ అని తెలిశాకా ఎందుకు వెళ్ళటం?

'ఇహ లోపలికి పోదాం' అంటూ లేచి లైటు వేసింది లలిత. ఇద్దరూ లోనికి వెళ్ళారు.

నారాయణి గదిలోని వస్తువులన్నింటినీ పరిశీలనగా చూస్తోంది. 'ఈ సోఫా సెట్టు చాలా బాగుంది' అన్నది. 'మేము క్రొత్త గ్యాడ్జెట్ సెట్ కొనుక్కున్నాము ఈ పాత టేక్‌వుడ్ సెట్ యిక్కడ వేసేశాం' అన్నది లలిత కొంచెం గర్వంగా.

పరుపుమీద పడుకున్న జలజ కుడికాలు బారుగా చాపుకొని చూచుకుంటూ 'అమ్మా, నా కాలు చూడు...ఎంత పెద్దగా వున్నదో' అన్నది. 'అవున్లే' అన్నది నారాయణి క్రిందనున్న తివాచీని చూస్తూ పరధ్యానంగా. 'చూడమ్మా, నా చెయ్యికూడా ఎంత పెద్దగా వున్నదో' అన్నది జలజ చేతిని బాగా ముందుకుచాపి. 'అబ్బ, దీనితో ఒకటే గొడవ!' అని విసుక్కుంది నారాయణి. 'దీనికీ వాళ్ళన్నకూ నాలుగేళ్ళు ఎడం వున్నది. ఇద్దరికీ నిముషం సరిపడదు. వాడంత పెద్దకావాలని దీని ఆశ' అన్నది లలితతో.

లలిత నవ్వి మళ్ళీ ఆలోచనలో పడిపోయింది... నారాయణి తనకున్న వస్తువుల్ని చూసి గొప్పగా వున్నాయనుకుంటోంది. కాని నారాయణికేం తెలుసు, తనకు లేనివీ కావలసినవీ ఎన్ని వున్నాయో! రెడ్డిగారి భార్యకులాగా యింట్లో ఎప్పుడూ పదిమంది పని మనుషులుండాలి. క్రింద వొకటీ పైన ఒకటీ రిఫ్రిజిరేటర్లు, ఏర్‌కండిషనరూ, ఏడాదికో క్రొత్తమోడల్ కారూ వుండాలి. ఎప్పుడో ఒక నాటికి అన్నీ సంపాదించి తీరాలి. అప్పుడుగాని కలగదు తృప్తి.

'నేను పెద్దయినాక యిన్నిన్ని పెన్సిళ్ళు కొనుక్కుంటాను...అన్నకంటే ఎక్కువ' అన్నది జలజ.

'అప్పుడు అన్న పెన్నులు కొంటాడు. అవి కావాలని ఏడుస్తూ వుంటావు అంతే' అన్నది నారాయణి. జలజ అమాయకతకూ, పసితనానికీ యిద్దరూ నవ్వుకున్నారు. జలజకూడా నవ్వింది.

'నేను పెద్దయినాక గదినిండా బెలూన్లు కొనుక్కుంటాను' అంటూ పరుపు వాసనపీల్చి వూహాగానంలో పడిపోయింది జలజ.

'ఇది వాళ్ళ నాన్నకు చాలా ఫేవరేట్, తెలుసా? ఆయనలాగే ఎప్పుడూ వూహాలోకంలో విహరిస్తూ వుంటుంది...ఆయనంటారుకదా, పిల్లలే భగవత్స్వరూపాలు; యీ ప్రపంచంనుంచీ మనిషిని రక్షించే శక్తి పిల్లలకే వున్నదీ అని...నీక్కూడా ఒక బిడ్డ వుంటే బాగుంటుంది...' అన్నది నారాయణి లలితను పరీక్షగా చూస్తూ. మాటలంటున్న నారాయణిలో యింతవరకూ కన్పించిన అసంతృప్తి స్థానంలో ఏదో నిండుదనం కన్పించింది.

లలితకు నారాయణిమాట నచ్చలేదు. ఈ విధంగా తన ఆధిక్యం నిరూపించుకోవా లనుకుంటున్నది కాబోలు అనుకున్నది. తమాషాగా మూతి ముక్కూ విరిచింది. 'ఆ మాటనకు [illegible], ఏదో సుఖంగా వున్నాను యింతవరకూ...ఎక్కడ చూచినా పందుల్లాగా కని పడేస్తున్నారు పిల్లల్ని. పిల్లలంటే వుత్త బరువు బాధ్యతలేగాని క్షణం విశ్రాంతి వుంటుందా ఆ తరువాత?...ఆ భగవంతుడి సంగతి నాకు తెలియదుగాని నాకు మాత్రం యిదే బాగుంది' అన్నది మురికైపోయిన తెల్ల బెడ్‌షీటును చూస్తూ.

ఆ లావుపాటి గుమాస్తాలాంటి ఆయనకు మురికి బెడ్‌షీట్లు కంటే యితరం ఏం తెలుస్తుంది? ప్రపంచంలో ఎన్నెన్ని భోగాలున్నాయో ఎలా వూహించగలడు, పాపం! గంధపు సువాసనలీనే పరుపుమీద పడుకోవటం ఎంత సుఖంగా వుంటుందో ఎలా తెలుసుకోగలడు! లలిత నవ్వుకుంది.

జలజ లేచి వచ్చి నారాయణి మెడ కావలించుకొని వేళ్ళాడుతూ 'అమ్మా, నాకు నిద్దరొస్తుందే, యింటికి పోదాం' అన్నది.

'ఇంతసేపూ యీ పరుపు మంచి వాసన అన్నావుగా. యిక్కడే పడుకో' అన్నది లలిత నవ్వుతూ.

'వూహూ...యిక్కడ పడుకోను...నాకు నిద్దరొస్తుంది...నాకు నాన్న అన్న అందరూ కావాలి...' అంటూ తల్లిని ముందుకు లాగింది. కూతుర్ని పొదివిపట్టుకొని ముద్దు పెట్టుకుంది నారాయణి.

'పోదామమ్మా...మరి ఆంటీకి టాటా చెప్పు' అంటూ లేచి నిల్చున్నది.

ఇంతలోనే పాలేరు సుబ్బడు వచ్చాడు. 'అమ్మా, ఏందో టెల్లిగ్రాం వచ్చిందంట. పోష్టు జవాను వచ్చాడు' అన్నాడు. లలిత సంతకంచేసి తీసుకున్నది. 'నాగేష్ ఇన్‌వాల్వ్‌డ్ సీరియస్ కార్ ఏక్సిడెంట్. అడ్మిటెడ్ జనరల్ హాస్పిటల్—శేఖర్' అని చదువుకున్నది. కాగితాన్ని అట్లే చూస్తూ వుండిపోయింది.

లలిత మొహం చూస్తున్న నారాయణి అనుమానంవచ్చి లలిత చేతిలోని టెలిగ్రాం తానే తీసుకొని చదివింది. 'అయ్యయ్యో, ఎంతపని జరిగింది!... ఏమీ ప్రమాదం వుండదులే, భయపడకు' అంటూ ఓదార్పుమాట చెప్పింది. లలిత మాటా పలుకూ లేకుండా కూర్చుండిపోయింది. 'వెంటనే నెల్లూరు వెళ్ళాలికదా...అత్తగారికి చెప్పాలి...డ్రైవరుకు కబురు పెట్టనా?...' అంటూనే సుబ్బడిని పిలిచి విషయం చెప్పింది నారాయణి. సంగతి విన్న లలిత అత్తగారు ఏడుస్తూ పైకివచ్చింది. 'అసలు టెలిగ్రాంలో ఏమని వుంది?...' అని కనుక్కున్నది. 'మొండిశిలలాగా బతుకుతున్నదానికి యీ వయసులో యీ కష్టంకూడా పెట్టావా భగవంతుడా!' అంటూ సన్నగా ఏడుస్తూ తల పట్టుకు కూర్చుండిపోయింది. 'డ్రైవరు అన్నం తింటున్నాడు. కారు వెంటనే రెడీ చేస్తాడు' అని వార్త పట్టుకొచ్చాడు సుబ్బడు. ముసలమ్మ ఏడుస్తూనే యిల్లు తాళం వెయ్యడానికి క్రిందికి వెళ్ళింది.

లలిత బాధకాని ఆదుర్దాకాని అంటని ఒక అసామాన్యస్థితిలో వుండిపోయింది. మనసు చిక్కగా గడ్డకట్టిన చీకటిలా అగోచరమైపోయింది. యాంత్రికంగా పెట్టె సర్దింది. పర్సులో డబ్బు చూచుకున్నది. కిటికీదగ్గరకువెళ్ళి బయట చీకట్లోకి చూస్తూ నిలుచుంది. అకారణంగా తండ్రి గుర్తుకు వచ్చాడు...అప్పుడు ఆయనకు జబ్బుగా వున్నదని మేనత్త వుత్తరం వ్రాయించింది. వుత్తరం చూసిన లలితకు దుఃఖం వచ్చింది. బరువు తీరేట్లుగా ఏడ్చుకున్నది. ఆయనకు తానొక్కతే కూతురు. చిన్నతనంలోనే తల్లిని పోగొట్టుకున్న తనను కడుపులో దాచుకుని పెంచాడు. ఆయనకు కావలసినవాళ్ళు యిహా ఎవ్వరూ లేరు...ఎవ్వరూ లేరు...ఆ జబ్బు త్వరగా తీరేదికాదు. నెలల తరబడి మంచంలో వుంచేది... 'ఏం చేసేది......ఏం చేసేది?' అనుకుంది అయోమయంగా. ఏమీ చెయ్యలేని నిస్సహాయతలో ఆలోచనలేని అయోమయంలో ఎంతోసేపు ఏడ్చింది. వాన వెలిసిన తర్వాతి ఆకాశంలాగా మనసు తేటబడి చురుకుదనాన్ని పొందింది...'తాను నాగేష్ భార్య. ఈ యిల్లూ, యీ జీవితం నాగేష్‌ది. దీనిలో జబ్బుగా వుండే లలిత తండ్రికి స్థానం వుండదు' అనుకున్నది. లలితకు ఆ క్షణంలో మనసు కఠినాతికఠినమైన పాషాణంగా మారిపోయింది. నాగేష్ వచ్చాడు. ఉత్తరం చూసి 'ముసలాయన పెన్షన్‌డబ్బు వుందిగా, ఇంకేం, ముసలమ్మదగ్గర చేరింది. చెయ్యనీ, అదీ మంచిదేలే' అన్నాడు. లలిత మాట్లాడకుండా వూరుకుంది..................

నారాయణివచ్చి లలిత భుజంమీద చెయ్యి వేసింది. 'భయపడకు' అన్నది.

'నాకు ఎవ్వరూ...ఎవ్వరూ...లేరు...' అన్నది లలిత. గొంతు కొద్దిగా ఒణికింది.

'ఇప్పుడేమైందనీ...బాగానే వుంటారులే...... ధైర్యంగా వుండాలి' అన్నది నారాయణి.

లలిత చీకట్లోకి చూస్తూ వుండిపోయింది... తరువాత పదిహేను రోజులకు ఒక వుదయాన టెలిగ్రాం వచ్చింది. 'నాన్నకు చాలా సీరియస్‌గా వున్నది' అని. అంతా అయిపోయి వుండొచ్చని లలితకు తోచింది. కాని ఏడుపు రాలేదు... మొద్దుబారిపోయిన మెదడు సుఖదుఃఖాల కలీతమైన ఒక అనిర్వచనీయమైన స్థితిలో వుండిపోయింది. ఆలోచనలు తనతో సంబంధం లేనట్లుగా ఎక్కడినుంచోవచ్చి ఎక్కడికో పోతున్నాయి గడ్డకట్టిన చీకటిలాంటి మెదడును కదిలించకుండా. అక్కడ ఏడవటం వగైరా గందరగోళం వుంటుంది కాబోలు అనుకున్నది. ఇల్లూ అదీ అమ్మాలి కాబోలు, పదివేలవరకూ డబ్బు వస్తుంది అనుకున్నది. ఇద్దరూ కారులో బయల్దేరారు. కనీసం ఆరు గంటల ప్రయాణం వుంది. మధ్యలో కారాపి మంచి హోటల్లోకి వెళ్ళారు. 'అక్కడ పరిస్థితులు ఎట్లా వుంటాయో. కడుపు

నింపుకొని వెళ్తే మంచిది' అన్నాడు నాగేష్. రెండు స్వీట్లూ 'వేడి వేడి పకోడీలూ, ఐస్‌క్రీం తీసుకున్నారు. పకోడీలు వేడిగా కరకరలాడుతూ చాలా రుచిగా వున్నాయి. మాంగో ఐస్‌క్రీం అంటె లలితకు ఎంతో యిష్టం. ఎందుకో ఆ నాటి రుచీ, అనుభవం అట్లాగే మనసులో హత్తుకుపోయాయి. వూరికెళ్ళేసరికి తండ్రి వుదయమే చనిపోయారనీ, ఆయన శవం తనకోసరమే వుదయంనుండి ఎదురు చూస్తున్నదనీ తెలిసింది....

లలిత వెనక్కు తిరిగింది. లైటు వెల్తురు కరుగ్గా తగిలి కళ్ళు కుంచించుకు పోయాయి. గభాల్న నారాయణి చేతులు పట్టుకుంది. 'నీవూ నాతో నెల్లూరికి ఒస్తావా, నారాయణీ...నాకు ధైర్యంగా వుంటుంది...' అన్నది. 'ఓ, తప్పకుండా... తప్పకుండా...' అన్నది నారాయణి బిత్తరపోయి చూస్తూ.

ఎడారిలాంటి మనసులోనికి సముద్రపుగాలి వీచినట్లు ఒంటరితనంలో తోడుదొరికినట్లు అన్పించింది లలితకు. 'థాంక్స్, నారాయణీ, మెనీ థాంక్స్...నీవు నా కెంత సహాయం చేస్తున్నావో నీకు తెలీదు' అన్నది. కొంచెంసేపు వూరికేవుండి పోయాక అకస్మాత్తుగా 'నీవు ఎప్పుడైనా వేడి వేడిగా కరకరలాడే పకోడీలుతిని మాంగో ఐస్‌క్రీమ్ తిన్నావా?...బాగుంటుంది' అన్నది.

నారాయణికేమీ అర్థం కాలేదు. 'లలితా! ప్లీజ్' పిచ్చి ఆలోచనలు చెయ్యవద్దు. ధైర్యంగా వుండాలి...కొంచెంసేపు మెదలకుండా పడుకో' అన్నది.

లలిత కళ్ళల్లో తడిమెరిసి, పెద్దముత్యాలుగా మారి చెంపలమీదికి జారింది. 'ఒద్దు...ఒద్దు... తొందరగా వెళ్ళాలి...ఆయన చాలాబాధపడుతూంటారు' అన్నది.

తనునుండి వేరుగా నిలిచివుండిన గడ్డకట్టిన చీకటిలాంటి మనసు కరిగిపోయి, తనతో సంబంధం లేనట్లుగా ఒచ్చిపోతున్న ఆలోచనల్ని లోనికి లాక్కుంది.



# సామాన్యుడు

శ్రీ భూషి కృష్ణదాసు

చాలీచాలని భోజనంలా వుంది జీవితం
వడిదుడుకుల బాటపై
పడుతూ లేస్తూ పయనిస్తున్నాడు మనిషి
అతనికి—ముసురుకున్న
మంచులావుంది భవిష్యత్తు
అన్నార్తుల ఆర్తనాదాన్ని
వినిపిస్తోంది వర్తమానం
శల్యాన్ని అంటిపెట్టుకొని వున్నా
ఆ మనిషిలోకూడా బ్రతకాలనే ఆశ!

బ్రతుకు గుమ్మంపైనుంచి
ఎప్పుడో బోరగిలపడ్డ
సామాన్య మానవు డాతడు
దేశానికి వెన్నెముకలాంటి వాడు
అయినా,
ఏ నాటికీ లోకం అతన్ని గుర్తించదు
ఈ నాటికీ అతని కన్నీరు ఆరదు.

పాపం! కవి ఒక్కడే
అతనికి ఈ లోకంలో
ఆత్మబంధువులాంటి వాడు
లోకంలోని స్వార్థద్వేషాల్తో
నిమిత్తం లేకుండా
ఎదురు తిరిగే లోకం
తనపై కత్తులు దూస్తున్నా

సామాన్యుని అశ్రుగీతంతో
శ్రుతి కలుపుతూ
సామాన్యుని కామనలను పండిస్తూ
ముందుకు పురోగమించగల
ప్రగతిశీలి, స్నేహశీలి.

అందుకే సామాన్యుడు
ఈ నాటికీ బ్రతుతున్నాడు
అంత చేదు బ్రతుకునీ
అమృతంలా దిగమింగుతూ
బ్రతుకు సాగిస్తున్నాడు.



# ప్రయోగ విశేషములు

శ్రీ రేవూరు అనంతపద్మనాభరావు

తెనుఁగుభాషకు నేఁటికిని సమగ్రమైన వ్యాకరణము వెలువరింపఁబడలేదు. బాలవ్యాకరణమును రచించిన చిన్నయసూరి తెలుఁగుభాష కంతటికిని లక్షణములను గూర్పలేదు. సూరి ప్రాచీనకావ్యభాషను మాత్రమే గ్రహించెనని భావించినను, బాలవ్యాకరణమున ప్రాచీన కావ్యభాష కంతటికిని లక్షణములు గానరావు. కొందరు 'ప్రయోగశరణం వ్యాకరణ' మ్మనియు, మఱికొంరరు, కాదు కాదు వ్యాకరణానుసారముగ ప్రయోగము లుండవలయుననియు వాదింతురు. ఈ వాదోపవాదములు గొప్ప చర్చకు దారి తీసినవి. 'శివకవుల భాషకు లక్షణములను వైయాకరణులు గూర్పకుండుట దోషమనియు, వారి పని ప్రయోగలక్ష్యములకు లక్షణములను గల్పించుటే గాని, వీడు ప్రామాణికుడైన కవియా? కాడా? యని వెదకుట గా'దనువారును గలరు. ఈ వాదోపవాదములను తఱచిచూడక, బాల, ప్రౌఢ వ్యాకరణకారులు తాము ప్రామాణికులుగా నెంచిన కవుల భాషకైన సమగ్రముగా లక్షణములనుగల్పించిరో పరిశీలింతము. సూరి ప్రమాదవశముననో, ఉద్దేశ్యపూర్వకముగనో, వదలివైచిన లక్ష్యములను గ్రహించి, వానికి సాధుత్వమును గల్పించుటకై బహుజనపల్లి సీతారామాచార్యులవారు ప్రౌఢవ్యాకరణమున వెలయించిరి. సూత్రీకరణ విషయమున నిరువురును నభిప్రాయ భేదములను పాటించిరి. సూరి ప్రయోగ వైరళ్యమున్నచో, కవిత్రయ ప్రయోగమేయైనను, సూత్రీకరణమును బరిహరించెను. ప్రౌఢవ్యాకరణకారుఁ డట్లుగాక, ఒక్క లక్ష్యము లభించినను, లక్షణమును గల్పించుటకు వెనుదీయఁడాయెను.

మొత్తముమీఁద, ప్రౌఢవ్యాకరణముతో తెనుఁగునకు లక్షణగ్రంథము సమగ్రముగ లభింపఁబడి యుండవలయును. కాని, వీ రిరువురును సాధింపని ప్రయోగములు ప్రాచీనకావ్యభాషలోఁ గానిపించును. ఇట్టి ప్రయోములను పలువురు పలుచోట్ల పేర్కొనియున్నారు. అట్టి ప్రయోగ విశేషములను గొన్నింటిని జూపుటయే నా వ్యాసంగము!

## సంజ్ఞా పరిచ్ఛేదము

కంసాలి :—చిన్నయసూరి మతమున సంస్కృత సమేతరములైన తెలుఁగు శబ్దములందు స్థిరములకుఁ బూర్వము బిందు వుండదు. (బాల. సంజ్ఞా. సూ. 16.)

ఇట వ్యవహారమున 'కమసాలి' యనునది 'కంసాలి'గా మారెనని దూసి వ్యాఖ్యాత యభిప్రాయపడెను. అట్లను కొందమన్నను, పద మధ్యమున అత్వలోపమునకు సూరి గతి గల్పింపలేదు! ఈ పదము కన్నడమున 'కంసాళిగ' అను పదమునుండి వచ్చిన దగుటచే సంస్కృత సమేతర మనుట స్పష్టము. కాన స్థిరమునకుఁ బూర్వమునను తెలుఁగున బిందువు గలదు.

## సంధి పరిచ్ఛేదము

1. వేలుపుటేరు:— బాల వ్యాకరణమున 'కర్మధారయంబులం దుత్తున కచ్చు పరంబగునపుడు టు గాగమంబగు' (సంధి. 28) 'కర్మధారయంబునం బేర్వాది శబ్దముల కచ్చు పరంబగునపుడు టుగాగమంబు విభాషనగు' (సంధి. 29) అను నీ రెండు సూత్రములే టు గాగమవిధిని గల్పించును.

కొందరు వ్యాఖ్యాతలు 'కర్మధారయంబులం'దను బహువచన ప్రయోగముచే కర్మధారయేతరములందును నీ టుగాగమ విధి జరుగునని వ్యాఖ్యానించిరి. కాని, సూత్రకారున కా భావమున్నట్లు వార్త్తికములందుగాని, లక్ష్యములందుగాని, స్పష్టమగుట లేదుగదా! శబ్దరత్నాకరమున భోజరాజీయ

తృతీయాశ్వాసములోని 'వేలుపుటేటిఫేనముల' నను ప్రయోగము చూపఁబడియున్నది.

ఉ. ...నందిని యఖ్ఖినాకుచుం
పచ్చి బండియున్నదది భామిని!
వేలుపుటావు జూచితే!
(పారి. 2 ఆ. 96.)

అను ప్రయోగమును తిమ్మన పారిజాతాప హరణమున ప్రయోగించెను. టుగాగమము సాధారణ ముగా ఉకారాంత పదములకు విధింపఁబడినదైనను 'దుక్కిటెద్దు; మిద్దెటిల్లు' ఇత్యాదులందుఁ బ్రవ ర్తిల్లుచున్నదని శబ్దరత్నాకరమున వివరింపఁబడి యున్నది. (పుట. 394.)

ఇట్టి రూపము లరుదని దూపి వ్యాఖ్యాత భావము! ప్రౌఢవ్యాకరణమున నీ విషయమున సూత్రీ కరణ గానరాదు!

## 2. రాజ్యము భారము

'కర్మధారయమున మువర్ణమునకు పుంపులగు' (సం. 32) ననియు, పుంప్వాదేశముపై నుగాగమము వచ్చుననియు సూరి తెలిపెను. ఇట్టి పుంప్వాదేశము రాని ప్రయోగములు నన్నయాది ప్రాచీనకవులభాషలోఁ గన్పించుచున్నవి. తిక్కన—

సాహసంబు తఱియె మేదినీశ! యిది బుద్ధి
బొఱంగి తమ్మగ్రహంబునన్.
భార. శల్య. 1 ఆ. 273 ప.

అనియు, 'రాజ్యము భారమెల్ల ధృతరాష్ట్రుని యందు వెలుంగుచుండ' అని ఉద్యోగపర్వ రాయబార మునను ప్రయోగించెను. నన్నయలో గూడ తపంబు గౌరవంబు, (అది) పుట్టంబు చెఱంగు (అది) తపముబలము గాన్పించును. (ఆ).

## తత్సమ పరిచ్ఛేదము

1. చతుర్థిని కోసము :—బాలప్రౌఢ వ్యాకర ణములు చతుర్థీవిభక్తి ప్రత్యయములుగా 'కొఱకు, కై, పొంటె' వర్ణకములను బేర్కొనినవి. చతుర్థీ విభక్త్యర్థమునవే 'కోసము' అను ప్రత్యయము ప్రయోగింపఁ బడియున్నది. శబ్దరత్నాకరమున నిది అవ్యయమని పేర్కొనబడియున్నను ఇది విభక్తి ప్రత్యయముగానే ప్రయోగములందు గలదు. అనిరుద్ధ చరిత్రలో 'వసుదేవకుమారకు ముక్తి కోసమై;' 'ఎవ్వరికోస విూ వగలకేమి యికన్' అను ప్రయోగ ములును; ఉత్తర రామాయణమున 'నీ కోసమేగదా నీరజాక్ష!' 'భూసుతకోసమేను' అను ప్రయోగ ములును గలవు వ్యవహారమున నిది ప్రబలము.

## 2. వలనకు వల్ల

పంచమీవిభక్తి వర్ణకమైన 'వలన' వర్ణక మునకు 'వల్ల' ప్రయోగములందు గాన్పించుచున్నది. అది రూపాంతరమని శబ్దరత్నాకరము (పుట. 699.). మరి, సూరి 'వల్ల'ను విభక్తి ప్రత్యయ ముగా గ్రహింపకుండుటకు ప్రయోగ వైరళ్యతను కారణముగాఁ జూపినను, ప్రౌఢ వ్యాకరణకారుఁడేల గ్రహింపలేదో తెలియరాకున్నది. సూరి ఈ 'వల్ల' అనురూపము ప్రయోగించెను! మిత్రలాభమున— 'లోభమువల్ల వివేకము పోగొట్టుకొని క్లేశపడెద రనియు;' 'ఈ మాటలవల్ల ఫలమేమి?' యనియు సూరి ప్రయోగించియే యున్నాఁడు. మఱి, అది ఏల స్వీకరింపలేదో తెలియరాదు. ఇఁక ప్రాచీన కావ్యభాషాప్రయోగములు చూడుఁడు.

'పుణ్యపాపముల శేషములవల్ల
బుట్టుచుందురు.' భాగ. 5 ఆ. 161.

చ. '........ఈ] చలిమలవల్ల నుల్లసిలు
చల్లదనంబును నూనకుండినన్.'
మను. 2 ఆ. 10.

'మబ్బుల నిలముంచు
నీలఘన పుంజమువల్ల బలాకమాలికల్.'
ఆము. 4 ఆ. 120.

ప్రయోగములు మహాకవులవే! బాలప్రౌఢలు ప్రామాణికులుగా నెంచినవారివే! సూత్రీకరణ మాత్రములేదు! '...తక్కుంగల విశేషంబులు నార్య వ్యవహారంబుల దెలియుట శ్రేయం'బని తెలిపియుంటి నని సూరి భావించెనేమో!

### 3. కంటెకు కన్న

పంచమీా విభక్త్యర్థమున 'కంటె' వర్ణకమునకు మాఱుగా 'కన్న' ప్రయోగము లందు గాన్పించుచున్నది. శబ్దరత్నాకరములో నిది అపదమగు వాకానాక ప్రత్యయమని పేర్కొనఁబడియున్నది. వసుచరిత్ర ద్వితీయాశ్వాసమున 'అహితవాక్యము మున్నువిన్న య విన్నినదముకన్న తిన్ననయి...'

(56 పద్యము)

శబ్దాలంకారమునకై 'కన్న' వాడియున్నాడు. కాని, తదితర ప్రయోగములును నిట్లే యున్నవి.

ఈ మూఁడు విభక్తి ప్రత్యయములు భాషా పరిణామమువలన నేర్పడినవి. వానిని సూత్రకారులు గుర్తించుట యవసరము.

### 4. గరుడఁడు

తత్సమములగు అకారాంత పదములకు సూరి ఉత్వ డుజ్ఞులను విధించెను. ఇవి పరస్పరము సంబంధము గలవి. ఒకటి వచ్చి, మఱొకటి రాకుండుటకు వీలులేదు. అనఁగా సంయోగశిష్టములు. కాని, ఉత్వమురాని 'గరుడఁడు' అను రూపమే నన్నయ భారతమున గాన్పించుచున్నది. ఆచ్ఛికములు 'మగఁడు' అని మాత్రమే యుండును.

ప్రయోగములు యతిస్థానమున గానరావుగాని, వావిళ్ళవారి ప్రతిలో అధోజ్ఞాపికలో 'గరుడఁడు' అనురూపమే ప్రాతప్రతులందు గలదను ముఖ్య సూచన మాత్రము గలదు. పరిష్కర్తలు పద్యములందు మాత్రము 'గరుడుఁడు' అని దిద్ది; వచనములందు మాత్రము 'గరుడఁడు' అనియే ఉంచినారు. నన్నయ పదప్రయోగకోశ పరిష్కర్తలును 'గరుడఁడు' అను రూపమునే గ్రహించిరి.

కం॥ గరుడండు గగనపతి నురు
తరజవమున నరుగుదెంచి తల్లికి మ్రొక్కెన్.
భారత. ఆది. 2. ఆ. 41.

వ॥ ...గరుడని వినతనుం బనులు గొనుచున్నంత
వొక్కనాఁడు గరుడండు తల్లి కిట్లనియె.'
భార. ఆది. 2 ఆ. 48.

### 5. గరుడి

'గరుడి' యనురూపమును గరుఁడ డనుటకుగా గాన్పించుచున్నది. శబ్దరత్నాకరమున 'గరుడి' యను పదమున కుదాహరణముగా క్రింది తిక్కన ప్రయోగము గలదు.

'...గరుడి యత్తుఱి హరి చక్రకంబునఁ
బెడమతి వైచెను. నిర్వ. 3 ఆ. 6.

### 6. హనుమ

మతుబంతమగు హనుమత్—శబ్దమునకు—ఆన—ఆదేశముగా వచ్చుననియు, అది వైకల్పికమనియు, సూరి సూత్రీకరించెను. (తత్స. 74). అట్లనుటచే, హనుమానుఁడు, హనుమంతుఁడు అను రెండు రూపములు మాత్రమే సాధింపఁబడినవి. అందుకు భిన్నముగా 'హనుమ' అనురూపమును గలదు. శబ్దరత్నాకరము వైకృతవిశేష్యముగా గ్రహించినది. 'నామైకదేశే నామగ్రహణే' యని అభిప్రాయపడిరి. భారతమున 'హనుమ' అను ప్రయోగము గలదు. అది ఎట్లనది.

కం. ...............నా రూపం]
బనుపమముగ ననిన
హనుమ కనిలజుఁ డనియెన్.'
భార. అర. 3 ఆ.

### ఆచ్ఛిక పరిచ్ఛేదము

1. కూతురిని:—కూఁతు శబ్దమునకు ద్వితీయాదులందు 'రు' వర్ణము గలుగదనియు, ప్రథమైకవచనమునవే 'రు' వర్ణము వచ్చుననియు, సూరి పేర్కొనెను కూఁతురులు ; కూతురిని—ఇత్యాదులసాధువులని సూరి మతము. ప్రయోగములందు—

'కలన భార్య బిడ్డలు
తన కూఁతుండ్రు గావున.' ఉ. హరి.

'కమలదళాక్షి కూఁతురిని గాంచుట.' ,,

తే. గీ. రాచకూఁతుండ్రు సంగ్రాయ నిరత

హృదయులగువారి గాంచగోరుదురుగాదె!
(1863–1901 ముద్రణ)
భార. స్త్రీ. 2 ఆ. 165.

ఆంధ్రభాషానుశాసనకర్త యతిప్రాస స్థానములందవి లేకుండుటచే పరిష్కర్తలు సాధురూపములనే యుంచిరని తెలిపియున్నాఁడు.

## 2. మిండలు

డుమంతమయిన 'మిండ' శబ్దము 'మిండంఁడ్రు' లను బహువచనరూపమును బొందునని సూరి. (అచ్చి. 6.)

మిండంఁడ్రు—అనుటకు మారు 'మిండలు' అను రూపము గానవచ్చును

'నలకూబరాదుల ననుపు మిండలు'
—కాశీఖండము.

.మిండ లయ్యెడన్' కవికర్ణ

## 3. పేళు

అచ్చికపదముల బహువచన రూపములను సాధించుచు సూరి 'పేరు' బహువచనరూపమగు 'పేళ్లు' అసాధువని పేర్కొనెను. రేఫపై లకార మునకు అలఘు లకార ళకారములను సూరి సాధింపలేదు. కాని ప్రయోగములందు 'పేళ్లు' అనియే యున్నది. ఊరులు—ఊళులు (అచ్చి–13–) వలె పేరులు—పేళులు అనియే యుండవలెను. కాని, సూరి బాలవ్యాకరణపీఠికలో రెండవ వాక్యమున 'కొన్ని లక్షణ గ్రంథముల పేళ్లు' అని పేర్కొనెను.

## 4. తెలుపులు

ప్రౌఢవ్యాకరణకారుని మతమున దేశ్యవిశేషణ శబ్దములు, గుణవాచకములునగు తెలుపు, నలుపు శబ్దములు నిత్యైకవచనాంతములు. (శబ్ద. 33.) కాని, భారతమున 'తెలుపులు' అను బహువచన ప్రయోగమును తిక్కన వాడెను

తే. గీ. 'తెలుపులగు వాహనములు నా తేర...'
భార. విరా. 4 ఆ. 142.

## కారక పరిచ్ఛేదము

1. హిమకరుఁదొట్టి:— శబ్దరత్నాకరమున 'తొట్టు' అను శబ్దముకడ 'మొదలుకొను' అను నర్థముగలదు. క్త్వార్థముననే దీనికి ప్రయోగ మున్నదని—

కం. వనకేళీ కౌతుకమున
జనియెను శర్మిష్ఠదొట్టి సఖులెల్ల ముదం
బునఁ గొలిచి రాఁగ.'
భార. ఆది. 3 ఆ. 15 ఆ. 4.

ప్రయోగము జూపఁబడెను.

ఇట్లు ద్వితీయాంతపదమువిూఁదనే నన్నయ భారతమున 'తొట్టి' కాన్పించుచున్నది. ఇది విశేష కారకము.

"చ॥ హిమకరుఁ దొట్టి పూరు భరతేశ
కురుప్రభు పాండుభూపతుల్"
భార. ఆది. 1 ఆ. 14.

2. నిన్నటఁ గోలె.

గోలె అనుశబ్దము ద్రుతాంతావ్యయమని శ. ర; ఈ శబ్దము సప్తమ్యంత పదముతో నన్వయించును.

'దావి వత్సంబు నిన్నటఁ గోలె
మడుగక యఱచుచున్న యదియు'
భార. ఆది. 8 ఆ.

తే॥ గీ॥ 'ఇతఁడు పుట్టినఁ గోలెను నెనక మెసఁగ
దర్పమున వర్తిలు మద్గ హృదయుఁ డకట!
భార. విరా. 1 ఆ. 74.

ఇట్లు 'నాఁటఁగోలె'నను ప్రయోగము ప్రాచీన కావ్యభాష యందంతట గాన్పించును. వీనిని బరిశీలించిన సప్తమ్యంతములగు పదములవిూఁదనే—కాలవాచకములుగాని పదములపై—కోలెఁ గాన్పించును.

## క్రియా పరిచ్ఛేదము

1. ఐతే:—చేదర్థయోగమున ద్రుతాంతమయిన నవర్ణకము భావలక్షణమున నగునని సూరి— క్రియా. 41 వ పేర్కొనెను. ఐనన్—అనుటకు భిన్నముగా 'ఐతే' అని ప్రయోగములు.' దుర్యోధనుండైతేనేమి'— పాంచాలీపరిణయము. ప్రౌఢవ్యాకరణకారుఁ డీ విషయమును దెలుపలేదు.

## 2. దాఁటే

సూరి త్వవర్ణకార్థమునందలి 'ఎడి' 'ఎడు' వర్ణములను వానికి లోపమును బహుళముగా సాధించి నాఁడు. (క్రియా. 44.) కాని, ఎడి, ఎడులకు 'ఏ' అను దీర్ఘాంతరూపముతో ప్రయోగములు గలవు. దాఁటెడు అనుటకు దాఁటే; మ్రింగెడు అనుటకు మ్రింగే; అనెడి—అనుటకు-అనే — అను రూపములు ప్రయోగములందు గలవు.

'పెద్దలు తద్దనమ్మి నయిదాఁటేవానికిన్.'
పాండురంగ.

'మ్రింగేవానికిన్' అని రుక్మాంగదచరిత్ర యందును, 'అనే భావము' అని శశాంకవిజయమునను గలవు. 'వచ్చేవాఁడు, తెచ్చేవాడు'—ఇవి లక్షణవిరుద్ధము లగుటచే గ్రామ్యపదములని సూరి భావము.

## 3. కట్టుక

ఆత్మనేపదార్థమున 'కొను' ధాతువు అను ప్రయుక్తమగుననియు, 'కొను'నకు 'కో'యగుననియు సూరి. క్రియా. 52.

కూడుకొను — అనుటకు కూడుకో — అను రూపమే సూరి సాధించెనుగాని, కూడుక — అనియు ప్రయోగములు గలవు.

'అంటుక' 'మూఱుక' అని హరవిలాస, కాళహస్తిమాహాత్మ్యములందును, విజయవిలాస 3 ఆ. 154 వ—

'...గట్టిగా నహం
కారమువిూఱ
గంకణము గట్టుక యుండెడు
నివ్వ డర్జునుం
డౌర......'

ఇఁక సుమతీ శతకమున 'తప్పించుక తిరుగు వాఁడు ధన్యుఁడు సుమతీ!' 'మడిదున్నుక బ్రదుక వచ్చు మహిలో సుమతీ!' అను ప్రయోగములు గలవు. పూర్వలాక్షణికులగు అనంతామాత్యప్పకవ్యాదులచే నిట్టి ప్రయోగములు గావింపబడియు నున్నవి. కవిత్రయ కవులుమాత్ర మిట్టి ప్రయోగములను గావింప లేదు. శ. ర. లో 'చీకిలించు' శబ్దముకడ కాశీఖండప్రయోగమున 'సీ॥ చీకిలించుకయుండు జిగురురెప్పలలో'నను ప్రయోగము చూపఁబడియున్నది. 'చికిలించుకొనియుండు'నని పాఠాంతరములు జూపిరి గాని, ప్రయోగములు మెండుగా గలవు.

## 4. మఱాకుము

వ్యతిరేకప్రార్థనమున 'మఱవకుము' అను రూపమునే సూరి సాధించెను. కాని వకార లోపముతో 'మఱాకుము' అను రూపముతో ప్రయోగములు గలవు.

అడినమాట మఱాకుమన్న.
భా. ఉద్యో. 3 ఆ. 176.

అనుపమ సత్య విస్ఫురణ నాడినమాట మఱాకుమన్న.
భా. ఉద్యో 4 ఆ. 70.

ఆత్మ మఱాకుమింక. భాస్కర. యుద్ధ.

## 5. చేతున్

సూరి 'చువర్ణముతోడి దుగ్ధకారంబు తకారంబగు'నని 'చేతురు, కోతురు' ఇత్యాదు లసాధువు లనినాడు. తిక్కన చేతున్ అనియు, నింకను బలువురు నిట్టి ప్రయోగములను చేసిరి.

'కుడిచిన చోటికి కొఱతసేతు'
భార. సభా. 2. 188

అను ప్రయోగము 'కుడిచిన చోటికి గూర్పనెపుడు' అని మార్పఁబడెను. ఇట్లెన్నో!

మ....మంటపము సంక్షోభింపగాఁ
జేతు కట్టులుకన్.

భార. విరా. 2 ఆ. 281

ఉ. కన్నియ నెన్నడు ప్రోడఁ జేతువో

కవికర్ణ.

తే. ఇంత యువినీతిఁ జేతురే యెఱిఁగి యెఱిఁగి.

భోజరా. 3 ఆ. 51.

ఇట్లు యువర్ణముతోడి దుగ్వకారమునకు 'త'కారము వచ్చుటను సూరి యసాధువని భావించెను. కాని, ప్రయోగములు గలవు.

## 6. సంకుచించు

అహోబలుఁడు 'కుచ' ధాతువునకు గుణము లేదనినాఁడు. సూరి యది గుర్తించి 'కుచ' ధాతువునకు గుణంబు లేదని యొకండువక్కాణించె నది గ్రాహ్యంబుకాదు. (క్రియా. 68) అని పేర్కొనినాఁడు. సంకుసాల నృసింహకవి కవికర్ణరసాయనమున గుణములేనిరూపమును ప్రయోగించెను. అది మార్చుటకు వలనుపడదు. మార్చిన గణభంగము. లేకున్న గుణభంగము.

సీ. సుందరత్వమునకుఁ జోటిచ్చి తా సంకు
చించె ననఁగఁ గడుఁగృశించె వడుము.'

కవి. 1 ఆ. 76.

## కృదంత పరిచ్ఛేదము

మురిపెము:—సూరి మురియు ధాతువునకు 'మురిపము' అను కృదంతరూపమునే సాధించెను. (కృదంత. 9). పోతన భాగవతమున యతిస్థానమున మురిపెము అను ప్రయోగము గలదు.

ఉ. భీతిలియుండె సిగు మురిపెంబును
మోహము దేఱు చూపులన్.

భాగ. దశ. 171.

ఇట్టి ప్రయోగవిశేషములనుగూర్చి పలువురు పలుచోట్ల పేర్కొనియున్నారు. వీరికి కృతజ్ఞుఁడను. ఇందలి గుణదోషములు రసజ్ఞులు పరిశీలింపవేడెదను. సాహితీపిపాసులకు నా నమస్సులు.



# గ్రంథ విమర్శలు

## శంకర గ్రంథావళి

పంచమ సంపుటము

(శ్రీసౌందర్యలహరి; ఆంధ్రపద్యానువాద వివరణ విశేష సహితము; వివృతికర్త: శ్రీ శ్రీయానంద నాథుడు ఈశ్వర సత్యనారాయణ శర్మ ప్రకాశకులు: సాధన గ్రంథమండలి, తెనాలి; క్రౌను 1/8 పేజీలు 400 - అర్ధ కాలికోబైండు వెల రు 5/-)

శ్రీ దేవీ స్తవములలో బహుప్రసిద్ధమైనదీ మనోహరమైనదీ సౌందర్యలహరి. దీని అవతరణను గురించి లోకములో చిత్రవిచిత్రమైన కథలెన్నో ప్రచారములో ఉన్నవి. ఇందులోని మొదటి 41 శ్లోకములకు ఆనందలహరియని తక్కిన గ్రంథమునకు సౌందర్యలహరిఅని ప్రసిద్ధనామము లున్నవి. గ్రంథ మాతృకలలో 98 నుండి 103 వరకు శ్లోకములు కలవట. ఈ గ్రంథములో 103 శ్లోకములున్నవి.

ఈ గ్రంథానికి సంస్కృతములో 36 వ్యాఖ్యానము లున్నవనీ, అందులో సుధావిద్యోతినీవ్యాఖ్యాకారాదులు కొలదిమందితప్ప, మిగిలిన వ్యాఖ్యాతలందరు ఇది శంకరభగవత్పాదులే రచించినారని అంగీకరించిరని గ్రంథ పరిచయములో శ్రీ హరి సాంబశివశాస్త్రి ఎం. ఏ తెలిపినారు. శ్రీ విద్యానగరస్థ సరస్వతీ పీఠాధిపతులు శంకరాచార్య నామధేయు లొకరు ఈ స్తోత్రము రచించిరని కొందరు చెప్పుదురని కూడ వారే చెప్పి, అది నిరాధారమని విమర్శకుల యభిప్రాయమని W. Norman Brown ను ప్రమాణీకరించినారు. ఐనా మాబోంట్లు కొందరు, ఆ కొద్దిమంది వ్యాఖ్యాతలతోపాటు, ఈ స్తోత్రము ఆదిశంకరకృతము కాదనియే భావించుచున్నారు.

ఈ స్తోత్రమునకు ఆంధ్రపద్యానువాదములు ఎందరెందరో వ్రాసినారు. కాని ఈశ్వరవారి అనువాదముకంటెనేకాక, ఎన్నో ఇతర అనువాదముల కంటెకూడ, శ్రీ దుర్భా సుబ్రహ్మణ్యశర్మ పద్యానువాదము సర్వవిధముల ఎక్కువ మనోహరముగా ఉన్నది.

పూజ్యులైన శ్రీ ఈశ్వర సత్యనారాయణశర్మ గారు తమకు 80 ఏళ్ళు దాటిన వయస్సులో, అనేక తంత్రాలు వ్యాఖ్యానాలు పఠించి, బహుకాలము నిష్ఠతో శ్రీవిద్యోపాసనముచేసి; శతాధిక శిష్యులకు శ్రీ విద్యాదాన మొనరించి పరిపక్వమైన అనుభవముతో ఆంధ్రానువాదవిశేషవివరణములతో ఇది మూడవ మారు ప్రచురించినారు. ఈ ముద్రణములో వెనుకటి వానికంటె రెండు విశేషము లున్నవి. అవి రెండును అనుబంధములుగా చేర్చినారు. అవియే గ్రంథములో సగభాగ మాక్రమించినవి వారికి నేత్రావరోధము కలుగకముందు ఆనందలహరీభాగములోని మొదటి ఐదు శ్లోకములవరకు వ్రాసిన విశేష వ్యాఖ్య మొదటి అనుబంధము. రెండవ దానిలో ఈ స్తోత్రమునకు ఋష్యాదిన్యాసములిచ్చి ప్రతిశ్లోకమును మంత్రముగా అనుష్ఠించి ఏ ఏ సిద్ధులు పొందవచ్చునో, అందుకవసరమైన యంత్రములు పూజా విధానాదులు మైసూరు ప్రభువులు ప్రచురించిన దానినుండి ఉద్ధరించి చేర్చినారు. ఆ భాగములో నూరు శ్లోకములకు నూరు యంత్రము లున్నవి. ఈ విధముగా ఈ గ్రంథమును శ్రీ శ్రీయానంద నాథులు సౌందర్యలహరీసర్వస్వముగా వెలయించుటకు చేసిన కృషి ఎంతయు శ్లాఘ్యమై యున్నది.

శ్రీ చక్రరాజస్వరూపమును తద్విదులు ఈ విధముగా వర్ణిస్తున్నారు.

> 'బిందు త్రికోణ వసుకోణ దశారయుగ్మ
> మన్వస్ర నాగదళ సంయుత షోడశారమ్
> వృత్తత్రయాచ ధరణీసదనత్రయం చ
> శ్రీచక్రమేత దుదితం పరదేవతాయాః.'

ఈ శ్లోకమే ఆధారముగా చేసుకొని రెండు సంప్రదాయము లేర్పడ్డవి. రెండిటికి రెండు విష యాలలోనే భేదము. ఒకదానిలో భూపురములోపల ప్రత్యేకముగా వృత్తత్రయ ముండదు. దళములు కోణములు తేలియుండవు. రెండవదానిలో వృత్త త్రయము ప్రత్యేకముగా ఉండును. దళములు కోణ ములు తేలియుండును. అనుబంధములో 22 వ శ్లోకముక్రింద మొదటి పద్ధతిని, 31 వ శ్లోకము క్రిందను రెండవపద్ధతిన శ్రీ చక్రము ముద్రింప బడినది. శ్రీ విద్యారణ్యులు శ్రీ విద్యానగరప్రతిష్ఠా సమయములో ప్రతిష్ఠించిరను ప్రతీతిగల శ్రీ చక్రము మొదటి పద్ధతి ననుసరించుచున్నది. శ్రీ ఈశ్వర వారు ఇవిగాక గ్రంథాదిలోను గ్రంథాంతమందును ముద్రించిన శ్రీచక్రము రెండవ పద్ధతి ననుస రించినది కనుక వారి కది అభిమతమని అను మేయించవచ్చును.

ఈ రెండవ అనుబంధములో ఇచ్చిన యంత్ర ములు ఉపాసనావిశేషములు, బహువిధ కామనలుగల వారిని ఆకర్షించునవిగా ఉన్నవి. వాని గుణావగుణములను అనుభవ పూర్వకముగా పరీక్షింపక ప్రచు రింపుట యుక్తము కాదేమో అని మా బోంట్ల ఆశయము. అథమపక్షమున, ఇంద్రజాల ప్రదర్శన కౌశలము కలిగించునని చెప్పిన 80 వ శ్లోకము క్రింద నిచ్చిన యంత్రాదికమువంటివాని నైనను, వదలివేయుట అవసరమని గట్టిగా చెప్పగలము. ఆ యంత్రము ఎవరియొక్క ఏ స్థానములోఉంచి పూజా దికము చేయవలెనో, అందులో వ్రాసియున్న దానిని, ఈ సమీక్షలో ఉదాహరించుటకుకూడ సభ్యతకాదని మానవలసి వచ్చినది.

తంత్రములు కూడ వేద వేదాంతములవలెనే ప్రమాణములైనట్లు గ్రంథకర్తయు గ్రంథపరిచ యము వ్రాసిన వారును చెప్పినారు. కావి శివ ప్రోక్తములని చెప్పబడే 64 తంత్రాలును పశుపతి భువనమోహనార్థ మురచించి తుదకు చతుర్విధ పురుషార్థఘటనమైన శాక్తతంత్రమును శ్రీ దేవి నిర్బంధముచేత రచించినాడని సౌందర్యలహరిలోని 31 వ శ్లోకమే స్పష్టముగా చెప్పుచున్నది. శ్రీ ఈశ్వర వారి అనువాదములో 'వానిచేఁ గికురు వెట్టియు లోకములన్ శివుండు' అన్నారు. ఈ శ్లోకమువలననే ఆ 64 తంత్రాలును మోహశాస్త్రములని తేలు చున్నదిగదా !

ఈ స్తోత్రములో 'ఆనందలహరి' అనబడే భాగములో శాక్తేయమతానుగుణముగా అనేకమైన ఉపాసనలు చెప్పబడినవి. మధురమైన కవిత్వము చెప్ప గలిగేందుకు ఉపాసనము 15, 16, 17 శ్లోకములలో చెప్పబడినది. విషము జ్వరము హరించుటకు ధ్యానము 20 వ శ్లోకములో ఉన్నది. స్త్రీవశీకర ణమునకును త్రిలోకవశీకరణమునకును 18, 19 శ్లోకములలో విధానము సూచింపబడినది. శ్రీ దేవీ కటాక్షము ప్రసరించినవారి మహాభాగ్యము 13 వ శ్లోకములో ఈ విధముగా వర్ణింపబడినది :

'నరం వర్షీయాంసం నయన విరసం
నర్మసు జడమ్
తవాపాంగాలోకే పతిత
మనుధావంతి శతశః
గలద్వేణీబంధాః
కుచకలశవిస్రస్తసిచయా
హఠా త్త్రుట్యత్కాంచ్యో
విగళితదుకూలా యువతయః.'

దీనికి శ్రీ ఈశ్వరవారి అనువాదము :

జరఠుడయ్యెననున్, రతుల
జాలకయున్నను, రూపలోపమే
పరగిన, నీ కటాక్షమునఁ
బడ్డనరున్, గుములొచు వెంబడిం
పరె? జడముళ్లు జాఱఁ జను
బాండువల న్పయటల్ తొలంగఁగ
మ్మొరులు తెగంగ, బొడ్డుముడి
మాటికి వ్రీలఁగ వెట్టి చామలున్.

దానికే శ్రీ దుర్భా సుబ్రహ్మణ్యశర్మ అనువాదము.

*బడుగయినన్ జడుండయినఁ
బ్రాయముఁ జెల్లినవాఁడె యైన, నె
వ్వఁడు త్వదపాంగ దృష్టికివి

బ్రాతుఁడగున్; జవరాం(డు|వానికై,
వడిఁ గటిసూత్రముల్ ప్రిదులఁ
బిట్టలు చన్నవనుండి జాఱఁ గ్రొ
మ్ముడు లంరవీడ, వల్వ లుడి
వోవఁగ; వేల్పఆలెంతు రీశ్వరీ!

శ్రీ దుర్భావారుకూడ ఈ స్తోత్రము శంకర కృతమని తలచినవారే. వారు గ్రంథాదియందు వ్రాసిన సమీక్షలో 23, 35 శ్లోకములను ప్రస్తావించుచు వ్రాసిన వాక్యములు ఉదాహరించుచున్నాము.

'దేవి యుపాసకులు ఇరుతెరగులవారు కలరు; ఇందు మొదటివారు 'సమయులు'. రెండవ తెగవారు 'కౌళులు'. వారిలో రెండవ తెగవారిలో మరల పూర్వ కౌళులని ఉత్తర కౌళులని రెండు విభాగములు.''

ఆ తర్వాత 23, 35 శ్లోకముల అనువాదములు ఉదాహరించి వాని 'యభిప్రాయము ఉత్తర కౌళుల కత్యంతానుకూలము' అని వ్రాసి మరియు నిట్లన్నారు.

'సమయులు ఆంతర పూజా ప్రధానులు. కౌళులు బాహ్య పూజా పరతంత్రులు. సమయులది దక్షిణ మార్గము, కౌళులది వామాచారము. శ్రీ చక్ర మత నవయోని మధ్యగత యోనిని, భూర్జపత్ర హేమప్రపీఠాదులయందు లిఖించి పూర్వకౌళులు పూజింపగా, ఉత్తర కౌళులు తరుణీమణుల ప్రత్యక్ష యోనినే పూజించుచున్నారు. ఇది సర్వథా నిషిద్ధమనుట ప్రసిద్ధమే. వేదబాహ్యములగు చతుష్షష్టి తంత్రములు (31 వ శ్లోకములోనివి) వామాచారులగు కౌళులకు ప్రమాణము...వామాచారులకుఁ బరశురామకల్పసూత్ర ప్రకారము మధుమాంసాదికముతోఁ బూజ; సమయాచారులకు సంహితాపంచకానుసారముగా వేదోక్త క్రియా కలాపము. సనక సనందన సనత్కుమార శుక వశిష్ఠులు—ఈ సంహితలకుఁ గర్తలు.'

ఇంతవరకు ఆనందలహరి భాగమును కొంత ప్రదర్శించినాము. 42 మండి చివరివరకు ఈ కవి శృంగారరసము ఉట్టిపడునట్లు, శ్రీ దేవిని దివ్య వనితగా భావనచేసి, ఆమె సౌందర్యమును బహుభంగులలో తనివితీర వర్ణించినాడు. నిస్సందేహముగా ఈ కవి మధురాతిమధురమైన వాక్కు కలవాడు. రెండు శ్లోకములు మాత్రము వానికి ఇదివరి అను వాదములతో ఉదాహరిస్తున్నాము.

82. కరీంద్రాణాం శుండాన్
కనకకదలీకాండపటలీ
ముభాభ్యా మూరుభ్యా
ముభయమపి నిర్జిత్య భవతీ
సువృత్తాభ్యాం పత్యుః ప్రణతి
కఠినాభ్యాం గిరిసుతే
విజిగ్యే జానుభ్యాం
విబుధకరికుంభద్వయ మపి

ఈశ్వరవారి అనువాదము.

'వారణరాజహస్తములు
బైడియనంటులబోదెలన్న యూ
యూరువు గెల్చి నీదుతొడ
యూరువ, గుంద్రముతోచుఁ దీరుమై
సారెకు నింటియాతనికి
జాగిలుటన్ బిరుసైన ముడ్ములన్
సౌరగజేంద్రకుంభముల
సౌరును గెల్చినదాన వద్రిజా!'

శ్రీ దుర్భావారి అనువాదము.
'వటుకుంభీంద్రకరంబులన్


## ఉపయోగకరమైన సరికొత్త గ్రంథములు

వ్యవసాయము — ఫిషరి — కోళ్లు పెంపకం — ఆడవులు — తోట పని — ఇంజనీరింగ్ — వైద్యము — వివిధ సాంకేతిక విషయములపై గ్రంథములు గలవు. కేటలాగు ఉచితము.

ఇంగ్లీషులో వ్రాయండి :

**N. K. PAUL & SONS,**
**P. B. No. 12202, Calcutta—5.**

గనకరంభాకాండతండంబు నొ
క్కట నిర్జించు ద్వదూరుయుగ్మను
విధిజ్ఞా! నీదు జానుద్వయం
బట భర్తృప్రణతిన్ ద్విగమ్మును
సువృత్తాకారవంతంబునై
వికటాటం బొనరించు
జంభదనుజద్విట్కుంభికుంభద్వయిన్.'

78. 'స్థిరో గంగావర్త: స్తనముకుల
రోమావళి లతా
కలావాలంకుండం
కుసుమశరతేజోహుతభుజః
రతే ర్లీలాగారం కిమపి
తవనాభి ర్గిరిసుతే
బిలద్వారం సిద్ధే
ర్గిరిశ నయనానాం విజయతే.'

శ్రీ ఈశ్వరవాది అనువాదము :

'అగజా, వేలుపు టేటి విల్చు సుడియొ
యన్నొన నీ బొడ్డు, చ
న్మొగడల్ పుట్టిన యారు తోవ కుదురై
పూవింటి వేల్పగ్గి వే
ల్వంగ గుంటై, రతియాడుకో
దగిన మేల్పట్టౌచు నీసామి క
న్నిగకున్ సిద్ధి గుహాముఖం బగుచు
రాణించు న్నుతిన్ మీరుచున్.'

శ్రీ దుర్భాకారి అనువాదము :

'రతికిన్ గేళిగృహంబు
కుండ మసమాస్త్రప్రౌఢశౌర్యాగ్నికిన్
ఖతరంగిణ్యాచలభ్రమంబు
చనుమొగ్గల్ పాల్చు రోమావళీ
లత కావాలము నీదు పొక్కిలి
నెటుల్ వర్ణింప? త్రైయక్ష దృ
క్తతి కాంక్షించెడు సిద్ధి
కయ్యది గుహాద్వారంబు సర్వేశ్వరీ!'

పై శ్లోకము వివరణములో 'నాభికి ఎదురుగానుండు స్వాధిష్ఠాన చక్రమందును దేవి యుపాసింపబడునని...ఇందు స్ఫురించును' అని ఈశ్వర వారు వ్రాసిరని పాఠకులు గమనింపవలెను. స్వాధిష్ఠాన చక్రమునకు స్థానము గుహ్యాంగభాగమని జగద్విదితముగదా! ఈ సందర్భములో శ్రీ దుర్భావారు ఉత్తరకౌళులు ఏ ప్రదేశమును పూజింతురని చెప్పిరో పై నుదహరించిన వాక్యములు మనము గుర్తుంచుకొనవలెను.

ఈ స్తోత్రమునకు రెండవ అనుబంధములో ఇచ్చిన ఋష్యాదిన్యాసములో, 'అస్యశ్రీ సౌందర్యలహరీ స్తోత్రస్య గోవింద ఋషి:' అని ఇచ్చినాడు గనుక దీని కర్త ఆదిశంకరులుగాక గోవిందనాముడని తెలియగలదు. మంత్రద్రష్ట ఋషి.

పరిచయవాక్యములు వ్రాసిన శ్రీహరి వారు ఈ స్తోత్రము శ్రీ దేవీపరమైనది కనుక ఆది శంకరులు వ్రాయలేదని భ్రాంతి కొందరికి కలిగినదనిరి. అది ఎంతమాత్రమును కాదు. ఆదిశంకరులు పంచాయతనపూజ ప్రతిష్ఠించిరి. వారు ప్రతిష్ఠించిన నాలుగు పీఠములును భారతీ పీఠములు. ఇతర సంప్రదాయములలో యత్యాశ్రమము స్వీకరించునప్పుడు ప్రణవము మాత్రమే ఉపదేశింతురని తెలియుచున్నది. భారతీయతులు మాత్రము తమ సన్యాస శిష్యులకు శ్రీ మహాపాదుకామంత్ర పూర్వకముగా గణపతి బాల షోడశాక్షరి నారాయణాష్టాక్షరి పంచాక్షరి సౌరము ఉపదేశించిన పిమ్మటనే ప్రణవోపదేశము కావింతురనుట తద్విదులకు తెలిసినదే. వారు గృహస్థులను అనుగ్రహించుటకే ఈ మంత్రముల ఉపాసనము శ్రీచక్రార్చనము శివలింగసాల్గ్రామాదికముల అర్చనము గ్రహించుచున్నారు. అందువల్లనే వారు జగద్గురువులు. శ్రీ దేవ్యుపాసకులేకాక సమస్త మహామంత్రములను అనుష్ఠించు స్మార్తులందరు గురుధ్యాన శ్లోకములో శంకరులను మధ్యస్థానములో స్మరించి వందనము చేయుచున్నారు. కాబట్టి కారణ మదికాదు.

సౌందర్యలహరీ స్తోత్రమును సూక్ష్మదృష్టితో పఠించువారికి అందులో త్రికమతసిద్ధాంతములు కానవచ్చుచున్నవి. ఈ త్రికమతము 'శివసూత్రములు' అని ఎక్కడో రాతిపలకమీద దొరికినవని చెప్పిన సూత్రములు ఆధారముగా, కాశ్మీరములో వ్యాఖ్యానములతోడను స్తోత్రములతోడను వర్ధిల్లిన స్వతంత్ర మతము దానిని శ్రుతి స్మృతి ప్రమాణమును అంగీకరించు శిష్టులు అపరిగ్రహమైనదని విడిచి పుచ్చినారు ఆదిశంకర కృత గ్రంథమయినచో శిష్టాపరిగ్రహములైన విషయములు చొప్పించి యుండరని మా బోంట్ల విశ్వాసము. ఆదిశంకరులమీద తమకున్న గౌరవ భావముచే, ఎందరో విద్వాంసులుకూడ, ఏదో విధముగా నిది శంకరకృతమని సరిపుచ్చుటకు ప్రయత్నించుచున్నారు.

ఏమైనను, ఈ స్తోత్రము ఎవరు రచించినను, కవితా మాధుర్యము కలది. కొన్ని మంచి ఉపాసనలను గూడ ప్రపంచించుచున్నది. శ్రీ ఈశ్వరవారు తమ వివరణాదికములతో వైదికమయినట్టియు తాంత్రికమైనట్టియు అనేక రహస్యములను విశేషముగను ప్రకటనము చేసినారు. అందువలన ఈ స్తోత్రమందు అభిమానము గలవారందరును ఈ గ్రంథము పఠింపదగినది

సాధన గ్రంథమండలివారు గ్రంథము చూచుటకు ఆకర్షకముగా వెలయించినారు.

## మన హాస్యము

[రచయిత : శ్రీ మునిమాణిక్యం నరసింహారావు' ప్రచురణ : ఆంధ్ర సారస్వత పరిషత్తు, తిలక్‌రోడ్డు, హైదరాబాదు. వెల : రు. 6-75 డెమ్మి 1/8 333 పేజీలు. అర్ధ కాలికోబైండు.]

శ్రీ మునిమాణిక్యం నరసింహారావు ముఖ్యంగా హాస్యగ్రంథ రచయితగానే ఆంధ్రదేశానికి ఇంతవరకు పరిచితులైనారు. ఈ గ్రంథములో హాస్య స్వరూపాన్ని బహుకాలము మథనచేసి విశ్లేషించి వర్గీకరించి ప్రపంచించినందున వారిప్పుడు హాస్యసిద్ధాంత కర్తగా కూడా ప్రథమస్థానము గడించుకొన్నారు. ముందు ముందు వారి సిద్ధాంతాలను ఖండించిగాని విస్తరించిగాని పాక్షికంగా రూపాంతరములు కల్పించిగాని, పరిపూర్ణత చేకూర్చే తత్త్వవేత్తలు రావచ్చుగాని, వారంతా ఈ గ్రంథాధారముతోనే తమ సిద్ధాంతసౌధాలు నిర్మించుకోడానికి ఉపక్రమించవలసి ఉంటుంది శ్రీ మునిమాణిక్యము హాస్యరచనలో పండినఅనుభవాన్నీ, వివిధదేశాల హాస్యవిదులు రచనల పఠనాన్నీ జోడించి ఈ గ్రంథము రచించినారు. బహుకాలము ఉపాధ్యాయులుగాఉండి గడించిన బోధన పాటవముకూడా తోడుచేసి ఈ గ్రంథము ఆవిష్కరించారు. గ్రంథములో హాస్య భేదాలను ఎన్నెన్నిటినో పేర్కొని వెంటనే వాటిని వివరించి విపులముగా ఉదాహరిస్తూ వచ్చినారు. అందుకుతోడు వారికి సహజమైన చమత్కార భాషనే ఇందులోకూడా వాడినారు. అందువల్ల వారి గ్రంథాలన్నిటిలో ఇది సుదీర్ఘమైనదైనా, వారి హాస్య గ్రంథాలవలెనే దీనినికూడా పాఠకులు మొదటినుండి చివరదాకా ఉల్లాసంతో చదువగలరు. హాస్య స్వరూపాన్ని బహుకాలము మథించి పరిశ్రమచేసి మంచి గ్రంథము రచించిన శ్రీ మునిమాణిక్యంవారినీ, ప్రచురణకు సహాయము చేసిన ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమీ వారినీ, సారస్వత పరిషత్తు వారినీ, కృతి అంకితము పొందిన శ్రీ దేవులపల్లి రామానుజరావును, హృదయపూర్వకముగా అభినందిస్తున్నాము.

ఇందులో మొదటి ప్రకరణములో హాస్య స్వరూపాన్ని బహువిధాలుగా వివరించారు. ముందు విశ్వనాథకవిరాజు సాహిత్యదర్పణములోని శ్లోకము ఉదాహరించారు.

'వికృతాకారవాగ్వేషచేష్టాదే ర్నర్తకా ద్భవేత్
హాస్యో హాసఃస్థాయిభావః...'

ఇక్కడ 'నర్తకాత్' అనే పాఠము ఎక్కడిదో తెలియదు. 'కుహకాత్', 'కుతుకాత్' అనే పాఠాలే నిర్ణయసాగరవారి ప్రతిలో ఉన్నవి. అయినా ఆ పాఠభేదమంత ముఖ్యమైనది కాదేమో! ఆ తర్వాత

కొంతదూరము పోయి నవ్వు ఆరు రకాలు అంటూ లక్షణగ్రంథకర్త వ్రాశాడని చెప్పి సాహిత్యదర్పణములో చెప్పినవాటిలో మొదటి రెండు రకాలూ చివరివి రెండూ ప్రస్తావించినారు. కవిరాజు చెప్పిన లక్షణాన్ని ఈ రచయిత వివరిస్తూ ఆకారవేషచేష్టలు బాహ్యమైనవనీ, వాగ్వికృతి ఆంతరమైనదనీ వివేచించారు. కాని కవిరాజు వాడిన ఆదిశబ్దాన్ని ఎందువల్లనో వదలివేసినారు. అది విస్తరిస్తే ఈ రచయిత చేర్చిన భేదాలేకాక, ముందుముందు వారు చేర్చబోయేవికూడా కలపవచ్చునేమో !

ఏమైనా మొదటి ప్రకరణములో హాస్యము వికృతివల్లనే జనిస్తుందని స్వీకరించినారు. కాబట్టి సాహిత్యదర్పణము చెప్పిన లక్షణాన్నే గ్రహించినట్లయింది. ఆ వికృతినే కొంతదూరము పోయి 'వక్రత' అంటూ, 'కవిత్వ రచనకైనా హాస్యరచనకైనా దృష్టిలో వక్రత ఉండాలె' అన్నారు.

(1) శబ్దాశ్రయము (2) భావాశ్రయము (3) అర్థాశ్రయము (4) ఉక్తిమూలము అని హాస్యమును నాలుగు ప్రధానభాగాలుగాచేసి వీటిలో ఉత్తరోత్తరము ఉత్కృష్టమైనదని రచయిత నిర్ణయించినారు. ఈ నాలుగు విధాల హాస్యాలకు 2–5 ప్రకరణాలు ప్రత్యేకించి, ఆ నాల్గింటిలో అవాంతర భేదాలు పేర్కొని వివరించారు. చివరిదైన 6 వ ప్రకరణములో మన సాహిత్యములో కనబడే హాస్య భేదాలను స్పృశించినారు.

హాస్యములో ఇన్ని భేదాలు అవాంతర భేదాలు చెప్పవలసివచ్చినప్పుడు వాటికి నామకరణము చేయవలసివచ్చి పారిభాషికపదాలు ఎన్నో వాడినారు. అవి కొన్ని సృష్టించినవి, కొన్ని పూర్వమున్న వాటికే విశిష్టార్థము కల్పించినవి. అందువల్ల వాటి స్వరూపము అవగాహన చేసుకొనేందుకు వీలుగా, వివరణము ఇచ్చి తర్వాత ఉదాహరణలు ఇచ్చుకుంటూ పోయినారు ఈ విధంగా ఆ పారిభాషిక పదాలు కాలక్రమాన రూఢమై పోయేటందుకు ప్రాతిపదికవేసి, ముందుముందు హాస్యతత్త్వవివేచనచేసే వారికి చక్కని బాట వేసినారు. ఈ పారిభాషికపదగ్రహణములో గ్రంథకర్త ఎంతో శ్రమపడి గ్రంథావలోడనముచేసి, స్వతంత్రముగా దీర్ఘాలోచనము చేసినట్లు స్పష్టమవుతుంది.

ఈ పారిభాషికపదాలు కొన్ని కల్పితాలైనా ఎన్నో పూర్వనిఘంటువులలో వెదకితే కనబడేవే. ఒక్క ఉదాహరణవల్ల ఎంతగా నిఘంటుపరిశీలన చేసినారో తెలుస్తుంది.

అర్థాశ్రయ హాస్యమును వివరించే 4 వ ప్రకరణములో దానిని ముందు ఉక్తిమూలము, శక్తిమూలము అని రెండుగా విభజించి, రెండవదాని భేదాలలో ఒకటి 'ఆచ్ఛురితకము' అన్నారు. 'నిత్యజీవితములో భార్యాభర్తల సంభాషణలలో ఈ మోస్తరు హాస్యపు పలుకులు దొర్లుతుంటవి అవి గుచ్చుకొననివై...మృదుమధురమై...ఉంటవి...ఈ హాస్యపు ప్రక్రియనే 'ఉపాలంభము' అని కూడా అంటారు. నిందతోకూడిన ఉపాలంభమునకు 'పరిభాషణము'అని పేరు. గ్రుచ్చుకొనేటంతటి తీవ్రంగా ఉన్న ఎత్తిపొడుపును 'ఉల్లకుట్టు' అంటారు. ఎత్తిపొడుపుతోకూడిన నవ్వుకు 'ఆచ్ఛురితకము' అనిపేరు.'

రచయిత వ్రాసిన పై వాక్యాలలోని పారిభాషికపదాలకు శబ్దరత్నాకరములో ఈ విధంగా అర్థాలు ఉన్నవి.

'ఆచ్ఛురితకము–1. నఖక్షతవిశేషము. 2. పరిహాసపుమాటతో కూడిన నవ్వు'

'పరిభాషణము — నిందాసహితమైన ఉపాలంభనము.'

'ఉల్లకుట్టు–ఉత్ప్రాసము.'

'ఉత్ప్రాసము – మర్మము దూరి పారనాడెడు పరిహాసము.'

మరియొకచోట 'ఇట్టి ఘాటైన ఎత్తిపొడుపును 'నాళిక' అంటారు' అని వ్రాసినారు. నేను చూచిన సంస్కృతాంధ్ర కన్నడ హిందీ నిఘంటువులలో ఆ అర్థము కనబడలేదు. కాని 'నాళిక' అంటే 'ఏనుగు చెవికి రంధ్రముచేసే పరికరము'

అనే అర్థమొకటి ఉన్నది. 'నాళికము' అని మారుస్తే బాణము అనే అర్థము వస్తుంది. ఏదైనా నిఘంటువులో ఆ అర్థము ఉండవచ్చు. లేక పోయినా, ఆ శబ్దానికి లక్షణార్థముగా రచయిత ఇచ్చిన అర్థము గ్రహించవచ్చు. ఈ విధంగా పారిభాషిక పదాలు సంపాదించడానికి రచయిత ఎంత గాఢముగా గ్రంథ పరిశోధనము చేసినదీ, ఆలోచించినదీ, స్పష్టమవుతుంది.

'భావాశ్రయ హాస్యము' అనే మూడవ ప్రకరణములో రసాభాసము దగ్గరనుంచి స్తోత్రాభాసము దాకా పది ఆభాసములు నూతనార్థాలతో కల్పించి పారిభాషిక పదజాలము సృష్టించుకొన్నారు.

ఈ విధంగా పారిభాషికపదాలు సృష్టించుకోవడములోనేకాక, వాటికి ఉదాహరణలిచ్చి సమన్వయించడములోకూడా, గ్రంథకర్త చాలా పరిశ్రమ చేసినట్లు వ్యక్తమవుతుంది. ఎక్కడో ఒకటి రెండు చోట్ల 'దీనికి నాకు ఉదాహరణము దొరకలే'దని ఒప్పుకొని రచయిత సత్యనిష్ఠను ప్రకటించుట సమ్మోదావహము.

ఇంత పెద్దగ్రంథంలో ఏవో కొన్ని లోపాలు దొర్లక మానవు.

అందులో మొదటిది రసాలన్నిటిలో ఉత్తమోత్తమమైనది 'హాస్యమే' అన్నట్లు తరుచుగా సూచిస్తూ ఉండడము. మన వ్రతకథలలో ఏది చెప్పినా 'వ్రతానా ముత్తమం వ్రతమ్' అన్నట్లుగా హాస్యమే ఉత్తమమైనదన్నట్లు ప్రవచనము చేసినారు.

'ఒక్క హాస్యరచనలోనే నిర్మలమైన ఆనందమూ శాంతీ ఉన్నవి. అన్నిటికంటే దైవత్వము ఉన్నది. దేవతలు అంతా ఆనంద స్వరూపులు'—ఈ వాక్యాలలో ఎంత భావసాంకర్యము ఉన్నదో వివరించనక్కరలేదు.

'కవిత్వానికిఉన్న గౌరవం హాస్యరచనలకు లేకపోవడం శోచనీయము...రామాయణం వ్రాయడానికి ఎట్లాంటి ప్రతిభ కావాలో ఒక హాస్య గ్రంథం వ్రాయడానికి అల్లాంటి ప్రతిభే కావాలె!'—ఈ మాటలు వాల్మీకి రామాయణాన్ని ఉద్దేశించి అన్నవయితే సహృదయులు ఏమనుకోవలె!

'ఏ దేశంలోనైనా చూడండి కవులూ, నవలాకారులూ, కథకులూ కావలసినంతమంది ఉంటారు. కాని హాస్య రచనానైపుణ్యం కలవారు కొద్దిమంది.'—ఈ వాక్యాలు నిజమా?

ఇక రెండవ లోపము, మన పూర్వులు హాస్యానికి తగిన స్థానము ఇయ్యలేదని తరుచుగా గునవడము.

ఈ హాస్యభేదాలన్నీ చిన్న చిన్న వాక్యాలకూ సంఘటనలకే కాని హాస్య గ్రంథాలలో పెద్దవానికి అన్వయించకపోవడము మూడవది. ఎన్నో హాస్య గ్రంథాలను ఉదాహరించినా, వానిలో ఏదో ఒక అంశమే ఆ హాస్యవిభాగముక్రిందికి తీసుకొనివచ్చినారే కాని, సంపూర్ణ గ్రంథాలకు అన్వయించే ప్రయత్నం చేయలేదు. జగత్ప్రసిద్ధమై ఐరోపా చరిత్రలోనే యుగవిభజనకు ప్రముఖస్థానము సంపాదించుకొన్న 'డాన్ క్విగ్జోటు'ను గురించి ఏమన్నారో చూడండి !

'డాన్‌క్విగ్‌సాట్ అనే పుస్తకంలో ఈ భ్రాంతిమంతము ఆలంబనగా చక్కని ఉపాఖ్యానం వెలసింది... ఇటువంటి రచనలలో నవ్వించే పదార్థము పరిమితంగా ఉంటుంది'—ఈ మాటలు సెర్వాంటెసు రచించిన గ్రంథమును గూర్చి వ్రాసినవి. స్పెయిను దేశమువారు ఆయనను షేక్స్పియరు అంతటి రచయితగా భావిస్తారు.

మాటి మాటికీ పూర్వకాలపు రచయితల మీద విసురులు విసరడము నాల్గవది. ఒకచోట, 'రసజ్ఞత పెరగని రోజులలో ఈ వాగ్వ్యాపారాన్ని పండితులు ఆదరించలేదు' అన్నారు. అంటే హాస్యాన్ని ఆదరించలేదన్నమాట.

తత్త్వవివేచనచేసే ఈ గ్రంథంలో శాస్త్రకారునివలె నిర్వచించక తరుచుగా కవితావేశము ఉన్నవానివలె వ్రాయడము ఐదవది. 'శక్తిమూలము చంద్రకాంతి. ఉక్తిమూలము చీకటిలో మెరసిన మెరుపు...వాక్పయోనిధి మథించగా ఆవిర్భవించిన అమృతము శక్తిమూలహాస్యము...సహజమైన పుష్పా

నికి మార్దవమూ మనోజ్ఞతా ఉంటవి. శక్తిమూలము అటువంటిది ' ఇంత కవితావేశంతో వర్ణించిన శక్తిమూలహాస్యానికి ఇచ్చిన ఉదాహరణలు ఏమంత చంద్రకాంతివలె చల్లగా లేవు.

పరస్పర విరుద్ధమైన వాక్యాలు కొన్ని ఉండడము ఐదవ లోపము. మొదటి ప్రకరణములో నవ్వు ఆరు రకాలు అంటూ, 'లక్షణ గ్రంథకర్త వ్రాస్తూ, ఉత్తములు దంతములు వెలికి కానరాకుండ మృదువుగా నవ్వుతారనీ, స్మితమూ, హసితమూ అను ఈ రెండు రకాల నవ్వే విధమే ఉత్తముల లక్షణమూ అనీ అన్నాడు. పెద్దగా నవ్వడము (అపహసితము, అతిహసితము) అంటే శిరస్సును భుజమును కదులుస్తూ నవ్వడము అపహసితమనీ, కన్నులనుండి బాష్ప పూరము ప్రవహింపజేస్తూ నవ్విన నవ్వు అతిహసితమనీ ఈ రెండూ నీచత్వమును సూచిస్తవనీ అన్నాడు . ...ఎప్పటికీ కాదు. పెద్దగా బుజాలు ఎగరేస్తూ, ఆనంద బాష్పాలు రాలుస్తూ, హో హో అని నవ్వేవాడు కల్మషం లేనివాడు, నిర్మల మనస్కుడు, అమాయకుడు, రసమయమైన చిత్తవృత్తి గలవాడు. ఎంత పెద్దగా నవ్వితే అంత ఎక్కువగా ఆనందాన్ని పొందుతున్నాడన్నమాట నవ్వును అణచి పెట్టుకొని పెదవులు బిగించి కొద్దిగా నవ్వేవాడు దొంగ...మాయకుడు, కుటిలుడు. కడుపార నవ్వగలవాడే రసజ్ఞుడు' అని వ్రాసినారు.

ఇక నాలుగవ ప్రకరణములో అర్థాశ్రయ హాస్యాన్ని వర్ణిస్తూ ఏమన్నారో గమనించండి!

'మందస్మిత పరిమితము : ఈ రకము హాస్యము వలన మనకు కలిగే ఆనందముయొక్క స్వరూపాన్ని నిర్ణయించడము కూడా కష్టము. ఈ ఆనందం యొక్క బాహ్యరూపం హాసము. అర్థాశ్రయమువలన జనించే హాసము మధుర మంజుల మందస్మిత పరిమితము. ఎంతో లోతైన సముద్ర మధ్యమున ఉత్తుంగ తరంగాలు ఉండక చిరు అలలు మాత్రమే ఉంటవి. అట్లాగే ఈ అర్థాశ్రయ హాస్యమువలన కలిగే ఆనందము స్మిత పరిజనక సమర్థమై ఉంటుంది గాని అతిహాసితమునకు తావివ్వదు. ఆ చిరునవ్వు పెదవులను దాటిరాదు. దాని వేళ్లు హృదయం లోకి వ్యాపిస్తవి హృదయాన్ని తాకగలదే ఉత్తమ హాస్యము.

ఇక ప్రయోజనములేనిది ఉత్తమ హాస్యము అని రచయిత నిర్ణయించినదానితో ఏకీభవించవచ్చును గాని అధిక్షేపకావ్యాలు వ్యక్తిగతము కాకుండా మానవ స్వభావములోని దుర్గుణాలను దుష్టమైన ఆచారాలను సంస్థలను అధిక్షేపించి నవ్వడే ఉత్తమహాస్యము అవుతుందన్న భావముతో ఏకీభవింపలేము అధిక్షేపమంటూ ఒక ప్రక్రియ ఉత్తమహాస్యము కావచ్చునని అంగీకరిస్తే, అది వ్యక్తిగతమైనంతమాత్రాన దోష మెన్నరాదు. ఒక్కొక్క వ్యక్తి ఉన్నతస్థానములో - మంత్రిగానో, న్యాయాధికారి గానో, మహాకవి ప్రబుధుడుగానో— ఉన్నప్పుడు అట్టి వ్యక్తులను అధిక్షేపిస్తే సహృదయులకు సమ్మోదముగానే ఉంటుంది. పాశ్చాత్య దేశాలలో అరిస్టాఫేన్సు వద్దనుంచి, హొరేసు, జ్యూవెనలు, ఛాజరు, లాంగ్లెండు, డ్రైడేను, పోపు— ఇత్యాదు లెందరో ఉద్దండులు వ్యక్తులను అధిక్షేపము చేస్తూ కావ్యరచన చేసినవాళ్లే. ఇట్టి కావ్యాలలో కుట్టికవి మహిషశతకము సంస్కృతములో ప్రసిద్ధమైనది అది ఏందువల్లనో రచయిత దృష్టికి వచ్చినట్లు కనబడలేదు.

రసాలలో శృంగారము రసరాట్టు అని కొందరన్నారు. భవభూతికరుణ ఒక్కటే రసమని సూచన చేసినాడు. పలువురు శాంతము ఉత్తమరసమన్నారు. ఈ గ్రంథములో రసా లన్నిటిలో హాస్యానికి ఉత్తమ స్థాన మియ్యవలెనని ప్రయత్నము జరిగినది. దానికి పూర్వపక్షముగా కొన్నివాక్యాలు గ్రంథకర్తే వ్రాసినారు.

'హాస్యములో బరువు లేకపోవడముమూలాన అది శాశ్వతంగా ఉండడానికి కావలసిన జీవశక్తి అందులో లేదనీ, మెరుపులాగా అది క్షణికమనీ, తాత్కాలికంగా ఆనందాన్ని ఇస్తుందిగాని, శాశ్వతంగా అంటే మళ్లీమళ్లీ చదివినప్పుడల్లా ఆనందాన్ని ఇచ్చే

దార్ఢ్యం దానికి లేదని అంటారు. కవిత్వానికీ, హాస్యానికీ ఇది ఒక ముఖ్యమైనభేదంగా చెపుతారు. ఒక చక్కని పద్యం ఎన్నిసార్లు చదివినా ఆనందాన్ని ఇస్తుంది. మళ్ళీ మళ్ళీ చదవాలనే అనిపిస్తుంది. ఒక హాస్యపువలుకును మొదటిసారి విన్నప్పుడు ఆనందిస్తాడు.మళ్ళీ చదవడానికి బుద్ధి పుట్టదు.'

ఈ పూర్వపక్షానికి సమాధానముగా పద్యంలో మళ్ళీ మళ్ళీ చదివించే శక్తి సంగీతంలో ఊపు—లాలనలో ఉన్నదంటూ ఆరంభించి, ఏమేమో చెప్పివారు కాని తృప్తి కలిగించలేదు. పూర్వపక్షమే నిలిచిపోతుంది. హాస్యానికి ఉచితస్థానము ప్రతిపాదించి, దాని స్వరూపము కాలక్రమేణా ఎన్నెన్ని మార్పులు పొంది ఎంత సున్నితంగా పరిణమిస్తున్నదో వివరించి దానికి లేనిపోని స్థానము ఇయ్యకుండా ఊరుకుంటే ఉచితంగా ఉండేదని తోస్తుంది.

గ్రంథము మంచి కాగితాలమీద అందంగా అచ్చయినది. కాలపరిస్థితులనుబట్టి వెల ఎక్కువ కాదు. రచయిత 'ముందుమాటల'లో చమత్కారంగా 'రకరకాల తప్పులున్నవి. అందులో కొన్ని ముద్రణకు చెందినవి. కొన్ని స్వయంకృతములు. పాఠకునికి ఈ తప్పులు కనపడవనే నా ఆశ. ఒకవేళ కనపడ్డా, ఒప్పు అయిన పదము పాఠకుని మనస్సుకు తడుతుంది' అన్నారు. ఇక ఏమనగలము?

287 పేజీలో 'విపర్యయోక్తి' అనే క ఉన్నది: దాని క్రింద వివరణములో ఆ పదము ప్రయోగించిన నాలుగు స్థలాలలోనూ, యోక్తి' అని మధ్యదీర్ఘముతో ఉన్నది. ప్రకరణాదిని 'విపర్యయోక్తి' అని హ్రస్వమధ్యంగానే ఉన్నది. ఎంతో పరిభాషను స్వతంత్రముగా రచయిత కల్పించినారు గనుక, ఈ రెండింటిలో రచయితకు సమ్మతమేమిటి అనే సందేహము తప్పకుండా కలుగుతుంది.

గ్రంథమంతటా 'బీభత్సము' ము' గానే, ఆదిలో వర్గయుక్కుతోనే అచ్చయినది. అట్టివి పాఠకులు దిద్దుకోగలరు.

పై లోపాలు దిఙ్మాత్రంగా ప్రదర్శించినాము. ఇంత మంచి గ్రంథము రచయిత మన కిచ్చినారు కనుక ఇంకా బాగా ఉండేందుకు కృషిచేసి, ఇంతకంటే నిర్దుష్టంగా త్వరలో రెండవ కూర్పు అందించవలెననే ఆశయంతో అవి సూచించినాము.

ఆంధ్రపాఠకలోకము తప్పక పఠించి మననము చేయవలసిన ఉత్తమగ్రంథాలలో నిస్సందేహంగా 'మన హాస్యము' ఒకటి.

—నోరి నరసింహ శాస్త్రి.

## అన్నపూర్ణ

[అన్నపూర్ణ—నవలిక ; మంచిముత్యం—పెద్ద కథ ; రచన : శ్రీ బలివాడ కాంతారావు : ప్రచురణ: శోభా ప్రచురణలు — విజయనగరం—2; 92 పేజీలు; వెల. రూ. 2]

చిన్నకథకూ, నవలలకు మధ్య పెద్దకథ, నవలికలు సాహిత్యంలో తగినంత చోటు గడించుకొన్నాయి. నవలికలు వ్రాయటంలో యీ దశాబ్దంలో సిద్ధహస్తు అనిపించుకొన్నవారు శ్రీ కొడవటిగంటి కుటుంబరావుగారు. బృహద్గ్రంథాలు చదవటానికి, వ్రాయటానికీ తీరక కొఱవడుతున్న యీ యాంత్రిక యుగంలో జీవితంపట్ల తగినంత అవగాహన కలగటానికీ, కలిగించటానికీ నవలికలే బాగా ఉపయోగపడతాయి. నవలాశిల్పం వేఱు, నవలికశిల్పం వేఱు. శిల్పం విషయంలో నవలాశిల్పాన్ని నిర్వహించటంకంటె రచయితకు నవలికాశిల్పమే కష్టతరం. నవలికలో వర్ణనలకు అవకాశం తక్కువ. సంభాషణలు సజీవంగా లేకపోతే పేలవంగా తయారౌతుంది. ఇన్ని జాగ్రత్తలు తీసుకున్నా పాత్రచిత్రణలో శ్రద్ధ చూపించక, సమస్యపైననే దృష్టిని కేంద్రీకరిస్తే కృత్రిమంగానూ, వ్యాసరూపంతోనూ వికారంగా తయారౌతుంది.

శ్రీ బలివాడ కాంతారావుగారు వ్రాసిన 'అన్నపూర్ణ' నవలికలో సంభాషణలు పట్టుగా సాగినా, ముఖ్యపాత్ర యైన 'అన్నపూర్ణ' శరత్ ట్రేడ్ మార్కు వదినగారే. అన్నదమ్ములిద్దరూ సామాన్య

కుటుంబానికి చెందినవారు. అన్నగారు కోపిష్ఠి. తమ్ముడు ఆవేశపరుడు. ఇద్దరూ మంచివాళ్లే. అయినా ఒకరి నొకరపార్థం చేసుకొని కుటుంబంలో కలతలు తెచ్చిపెట్టుకొంటారు. కుటుంబంలో ఏ వొక్కరు స్వార్థత్యాగం చేసినా, ఆ కుటుంబమంతా ఎలా వొడుదుడుకులు లేకుండా నడుస్తుందో, ఒక వేళ ఒడుదుడుకు లొచ్చినా, మళ్ళీ ఒక్క గాటనే ఏ విధంగా నడుస్తుందో చక్కగా నిరూపించారు శ్రీ కాంతారావు. ఉద్యోగాలు దూర దూరంగా లభించటం వలన నేడు చాల మధ్యతరగతి కుటుంబాలు వేఱింటి కాపరాలను పెట్టవలసి వస్తున్నాయి ఉమ్మడి కుటుంబాలలో కనిపించని శాంతి, సౌఖ్యమూ, యీ వేరింటి కాపరాలవల్ల పొందుతున్నారనటం అతిశయోక్తి కాదేమో ! కాని శ్రీ కాంతారావుగారు ఎన్ని అపార్థాలు, ఎన్ని మనస్పర్థలు వచ్చినా కలిసి మెలిసి ఉండటమే మేలని యీ నవలికలో ఉమ్మడి కుటుంబ వ్యవస్థను సమర్థించారు. కథను చెప్పటం లోనూ, సంభాషణలను నడిపించటంలోను కాంతా రావుగారు చేయితిరిగినవారు. అందుచేతనే పాఠకు లీ రచన నుత్సుకతతో చదవగలరు. సంభాషణలు నాటకీయతను పుష్కలంగా కలిగిఉన్నందుననే యీ నవలిక నాటకరూపం దాల్చి శ్రవణయోగ్యమైన 'రేడియో రూపకం' గా మార్చటానికి వీలైనది.

మధ్యతరగతి బ్రాహ్మణ కుటుంబాలలోని అలవాట్లూ, మాటతీరు చక్కని నుడికారంతో ఒడుపుగా యీ నవలికలో కాంతారావుగారు ప్రవేశ పెట్టారు. ఒకరినొకర పార్థం చేసికోవటం సహజమే. కాని మనస్సు విప్పి చెప్పకోకపోతే, అవి ఘాతాలుగా మారి కుటుంబ సౌఖ్యాన్నెలా కబళించి వేస్తాయో చక్కగా చెప్పారు. యువకులు అభిప్రాయ భేదాలను వెల్లడించుకోవటానికీ, ఆ అభిప్రాయ భేదాలు సమసిపోవటానికి ఓర్పున్న ఒక స్త్రీయో, ఇద్దరినీ సమాధానపరచగలిగిన నొక పెద్దదిక్కో (యీ నవలికలో అన్నపూర్ణ తండ్రి) ఉండటం అవసరం.

శరత్ ముద్రనువీడి 'అన్నపూర్ణ' మరింత తెలుగుదనాన్ని సంతరించుకొనిఉంటే యీ నవలిక మరింత సుందరంగా ఉండేది. వాస్తవానికి విరుద్ధంగా, చాలదూరంగా ఉన్నప్పటికీ ఆదర్శాన్ని అందంగా చూపించి దాని వేపుగా చదువరిని లాక్కుపోవటం మంచిదే. మధ్యతరగతి కుటుంబాలు ఆదర్శంగా గైకొని మెచ్చదగిన యితివృత్తంతోకూడిన నవలిక 'అన్నపూర్ణ.'

శోభా ప్రచురణలవారు ప్రచురించిన యీ పుస్తకంలో అన్నపూర్ణ నవలికతోబాటు 'మంచి ముత్యం' అనే పెద్దకథకూడా ఉన్నది. తెలుగు సాహిత్యంలో 'పెద్దకథ'లు వ్రాసిన రచయితలు కొద్దిమందే. అందులో బలివాడ కాంతారావుగారు యెన్నదగినవారే. అయినప్పటికీ 'మంచిముత్యం' అనే యీ పెద్ద కథ మంచికథకాదు. పెద్దకథను రచించటంలో యిది వొక నూతన ప్రయోగం. సింహాచలస్వామి కళ్యాణోత్సవంలో వొక పిచ్చిది జనసమూహాన్ని చిందరవందరచేస్తూ వుంటుంది. యాత్రికులంతా ఆమెనుగూర్చి తలకొక విధంగా అంటూంటారు. ఆమె పేరు భారతి. అక్కడున్న యాత్రికులలో ఆమె చాలమందిని యెఱుగును. వాళ్ళెవరు ఆమెను వారింప జూసినా, ఆమె వాళ్ళ గతజీవితాన్ని తవ్వి, కుళ్ళును బయటపెట్టి వాళ్లను ఆక్షేపిస్తుంది. ఆమె నా అల్లరినుండి తప్పించటానికి ప్రయత్నించి వాళ్ళు విఫలులౌతారు. చివరకామె వొక విరాగిచెంత జ్ఞానోదయం పొందుతుంది. ఆ విరాగి ఆమెలోని మంచితనాన్ని గుర్తించి ఆమెను అనునయిస్తాడు. ఆమె చివరకా విరాగిచుట్టూ నృత్యంచేసి, అతడి వొడిలో వొరిగిపోయి ప్రాణం విడుస్తుంది. అప్పుడా విరాగి అంటాడు గదా 'ఈ మంచి ముత్యాన్ని మనిషి ధరించలేక పోయాడు. దేముడు ధరించాడు' అని. పిచ్చిదానిలా ప్రవర్తిస్తున్న ఆమెనుగూర్చి జాలిపడిన, తిట్టిన, వారింపజూచిన ఆ పెద్దమనుష్యులకంటె ఆమె మంచిది; ఆమె మంచిముత్యమని — రచయిత తాత్పర్యం. ఈ పెద్దకథను చదవటానికి కావలసిన ఉత్సుకత రచనలో లేదు ఈ రచనా ప్రయోగంలో రచయిత కృతకృత్యుడైనట్లు చెప్పలేము.

'శోభా ప్రచురణ' వారు సాహిత్యాన్ని ఉద్యమంగా భావించి, లాభం ఆశించకుండ సాహిత్య సేవకు

పూనుకొన్నటువంటివారు. వారు ప్రచురించిన రచనలు గూడ విశిష్టమైనవే. సాహిత్యోద్యమ సంస్థలు ప్రచురించే పుస్తకాలకు చౌకబారు గిరాకీ అక్కర్లేదు. వికారంగానున్న యీ పుస్తకం ముఖచిత్రం కంటె అసలు ముఖచిత్రం లేకపోవటమే మేలు పుస్తకం విలువను చెప్పటానికి ముఖచిత్రమెందుకూ చాలదు.

## హారతి

[రచన: శ్రీ కొమ్మూరి వేణుగోపాలరావు; ప్రచురణ: యం. శేషాచలం అండ్ కో; మచిలీపట్నం. మద్రాసు. సికింద్రాబాద్; 160 పేజీలు; వెల: రూ. 2]

శ్రీ యం. శేషాచలం అండ్ కో వారు ప్రచురిస్తున్న 'పాకెట్ బుక్స్' సీరీస్‌లో శ్రీ కొమ్మూరి వేణుగోపాలరావు రచించిన రెండవ నవల 'హారతి' మొదటి నవల 'హౌస్ సర్జన్'. తెలుగునాట శరత్‌బాబు ప్రభావం అత్యధికంగా పడిన రచయిత శ్రీ కొమ్మూరి వేణుగోపాలరావు ఈ ప్రభావం ఎంత ఎక్కువంటే తన వ్యక్తిత్వం పూర్తిగా మరచిపోయి తెలుగు ప్రజలనూ, దేశాన్నీ మరచిపోయి పూర్తిగా బెంగాలీవాతావరణాన్ని. శరత్‌పాత్రల 'డెవిఫ్మె' లనూ పోతపోస్తారు. హారతి నవలలోని కథ ఆంధ్ర వాతావరణంలో నడవటానికి వీలులేనట్టిది. అంటే బెంగాలీలో సాధ్యమనికాదు. అసలు జీవితాన్నిగూర్చిన పర్యాలోకనగానీ, కష్టసుఖాలనుగానీ, మానవు లందరికీ సహజమైన ఆకలీ, కామం అనేవిగాని రచయిత పట్టించుకొన్నట్లు కనిపించదు. ఇటీవల రచయిత్రుల నవలలలో దారుణంగా కనిపిస్తున్న అసహజ వాతావరణం యీ నవలలో పుష్కలంగా ఉన్నది. బంగళా, కారు, నౌకర్లూచాకర్లూఉన్న, అతిమంచిమనుష్యులున్న కుటుంబంలో ఊహామానసజీవులూ, వాళ్లూహించు కొన్న కష్టాలూ, అపోహలమేఘాలూ, అవి చెదరిపోయేటందు కప్పటికప్పుడు మానసిక పరివర్తనలూ తలచుకొంటే ఒళ్లు గగుర్పొడుస్తున్నది. అపరాధ పరిశోధక రచనకంటె ఎక్కువగా హాని సాహిత్యానికి యీ 'హైక్లాస్ రైటర్ల' రచనలమూలంగా కలుగుతున్నది. 'Aristocratic Absurdities' తప్ప రచయితకు వ్రాయటానికి యితివృత్తమే కరవైనట్లు వ్రాస్తూంటే ఆరనివేత కలుగుతున్నది. 'అప్రతిభు లయ్యారు' అనే మాటను తరుచుగా యీ రచయిత వ్రాయటం చూస్తుంటే భావాలను వెల్లడించటానికి మరే పదజాలమూ దొరకదా యేమిటని విసుగు కలుగుతున్నది. ఇతివృత్తమూ, నిర్వహణా, శైలీ, పాత్రచిత్రణా ఒకటేమిటి? అన్నీ చెడి, మంచినంలో ముద్దలైనవీ, అలుక్కుపోయినవి అయిన బొమ్మలతో చెడిపోయిన Photograph లాగ యీ నవల తయారైంది.

శ్రీ వేణుగోపాలరావు 'పెంకుటిల్లు' నవల వ్రాసినప్పటినుండి పాఠకులకు చిరపరిచితులు. కథారచయితగా, నవలారచయితగా ఆయన చేయితిరిగినవారే. 'వ్యక్తిత్వంలేని మనిషి'లో మృత్యుంజయరావు అల్పత్వం, అంతరంలో జరిగే యుద్ధమూ, చదివినప్పుడు ఆయన రచన వైశిష్ట్యం గోచరిస్తుంది. అట్లాగే ఒక వృత్తికి సంబంధించిన అనుభవాలను గుదిగుచ్చికూడ చక్కని నవల వ్రాయగలిగిన వేణుగోపాలరావుగారు 'హారతి'వంటి పేలవమైన, పాఠకులను మందబుద్ధులనుచేసే ప్రమాదకరమైన నవల వ్రాయటం ఘోరం.

ఒక రచయిత ఎల్లప్పుడూ ఒకే విధంగా వ్రాయడు. ఆ విధంగా వ్రాయాలనటం న్యాయం కాదు. కాని 'హారతి'వంటి నవల చదివాక వేణుగోపాలరావుగారి రచనల ఖ్యాతిగూడ జ్ఞప్తికిరాదు. ఇటీవల కొందరు రచయిత్రులు సృష్టిస్తున్న అభూత కల్పనలూ, మిధ్యాప్రపంచమూ, ప్రపంచపు కష్టాలలో నుండి పారిపోయే పలాయనతత్త్వమూ 'హారతి' నవలలో గోచరిస్తాయి.

ఏదైనా ఒక విడ్డూరమైన విషయాన్నిగూర్చి ఆలోచించి 'ఇలా జరిగింది' అని కథనల్లటం చిత్రమైనది కావొచ్చునేమోగాని ఉత్తమమైనది కాలేదు.

'హారతి' నవలలో, రైలు ప్రమాదంలో ఒకే కుటుంబంలోని అత్తా కోడళ్ళిద్దరూ మరణిస్తారు. వారి భర్తల ఏకాంత జీవిత పర్యవసానమిా నవలలో చిత్రించారు రచయిత. ప్రమాదం జరగటమూ, ఇద్దరూ వొకేసారి మరణించటమూ సంభవించవచ్చు ఇదేమిా అసహజం కాదు. మధ్యవయస్సున్నైనాచేరుకోని ఆదిశేషయ్య యువకుడైనకొడుకు శ్రీధర్, అతని కొడుకు చిట్టిబాబు, ఆదిశేషయ్యగారి సోదరి విధవరాలు సీతమ్మ ఇదీ వాళ్ళ కుటుంబం. రైలు ప్రమాదంలో ఆదిశేషయ్యగారి భార్య సుశీల, కోడలు హరిలీల మరణించగా వాళ్ళు ఆ 'షాక్'నుండి తేరుకోలేక పోతారు. ఫలితంగా ఆదిశేషయ్యగారు పేకాటకు, శ్రీధర్ త్రాగుడుకూ అలవాటుపడి దుఃఖాన్ని దిగమ్రింగుకో జూస్తారు. అది వాళ్ళకు సాధ్యంకాదు. ఇక నవలలో నేటి తెలుగు సినిమాలు చాల వాటిల్లో లాగే అసహజత కమ్ముకుంటుంది. శ్రీధర్ తాగిన మత్తులోకూడ ఒళ్ళమ్ముకో జూచిన నర్తకిని విసరి కొట్టి 'నర్తకీ!...మీ పేరు నాకు తెలియదు. అందుకని యిలా పిలుస్తున్నాను. రెండుకాదు, పది గ్లాసులు త్రాగించినా నాచేత అలాంటి పని చేయించలేరు మీరు. ఈ రాత్రి చాల విసుగు కలిగించి వుంటాను. సెలవు' అని అచ్చం దేవదాసులా (వుయ్ పిటీ శరత్!) వెళ్ళిపోతాడు. త్రాగుడు మానకపోయినా అంతే! శీలాన్ని కాపాడుకున్నాడన్నమాట. ఆదిశేషయ్యగారూ 'డిటో'. పేకాటమానకపోయినా శీలం జారవిడుచుకోలేదు.

వారి జీవితాలలోకి 'హారతి' అసహజంగానే ప్రవేశిస్తుంది చిట్టిబాబును షికారుకు తీసుకెళ్ళగా వాడికి మాలిమై హారతి, ఆదిశేషయ్యకు పరిచయమై వాళ్ళింటికి వచ్చేస్తుంది. ఆమెకు ఆప్తులెవ్వరూ ఎందుచేతలేరో తెలీదుగాని, climax లో ఆవిడే చెప్పేస్తుంది—తన భర్త అదే రైలు ప్రమాదంలో మరణించాడని. ఇది ముందుగా రచయితే చెపితేవచ్చే నష్టమేమీ లేదు, nasty suspence పోవటం తప్పింది. 'హారతి'పట్ల తండ్రీ కొడుకులిద్దరికీ విడ్డూరమైన భావాలు కలుగుతాయి. శ్రీధర్ హారతిని తల్లిగానూ, ఆదిశేషయ్య కోడలుగానూ భావిస్తారు. వాళ్ళిలా భావించుకుంటున్నట్లు పాఠకులు పోల్చుకోలేరు.

వాళ్ళిలా భావిస్తున్నట్లు తెలియటానికి రచయిత కొన్ని సన్నివేశాలను కల్పించకపోలేదు. ఎటొచ్చీ అవి సహజమైనవికావు. ఒక వయస్సొచ్చిన స్త్రీ వాళ్ళింట్లో ఉంటే యీ మన సమాజం నిర్లిప్తంగా ఊరుకోదు. వేటాడి వేధించకమానదు. ఆ బాధ లేవీ వారికున్నట్లు రచయిత వెల్లడించరు. ఎంత ఉన్నవాళ్ళకయినా యీ బాధ తప్పదుగదా! విడ్డూరమైన పాత్రచిత్రణకు నిదర్శనం కావలసి వస్తే 'వియోగులైన తండ్రీ కొడుకులకు అమ్మతోపమానమైన ఆరతి' హారతిని తీసుకోవచ్చు ఈ కథ మధ్యలోనే భుజంగరావనే జిత్తులమారి, తన కూతురు మీనాక్షిని శ్రీధర్ కివ్వాలనుకొని, తిరస్కృతుడై తరువాత తన యీడువాడైన ఆదిశేషయ్యకే ఆమె నివ్వటానికి ప్రయత్నిస్తాడు. అందుకాయన కూతురు మీనాక్షి యిష్టంతోనే ప్రయత్నిస్తుంది గూడ.

చిట్టిబాబుకు మాలిమై ఆ యింట ప్రవేశించిన హారతి, ఆ యింటిని తీర్చిదిద్ది, ఆదిశేషయ్యగారికి షేవింగ్‌బ్లేడుతోసహా అమర్చి ఆ యింటి యాజమాన్యం వహిస్తుంది. పెత్తనం చేతికి తీసుకుంటుంది. తండ్రీ కొడుకు లిరువురిచేతా విడ్డూరంగా ఆరాధింపబడుతుంది. 'నువు పెళ్ళాడమంటే; కాదు నువ్వే పెళ్ళాడ'మనుకుంటూ త్యాగాలు చెయ్యబూనుకున్న తండ్రీ కొడుకు లిద్దరినీ పసిపిల్లలుగా యెంచి, వాళ్ళను ప్రేమగా మందలించి, తన భర్త తన కిచ్చిన సందేశం 'ధైర్యంగా జీవించు' అనే దానికోసమే తాను జీవిస్తున్నట్టు తెలిపి, ఇంక తాను వెళ్ళిపోవటం మంచిదని యెంచి వెళ్ళిపోవటానికి సిద్ధమౌతుంది. కాని చిట్టిబాబు 'అక్కా' అని పిలిచి, తల గుమ్మానికేసి కొట్టుకొని ఏడుస్తుంటే చూడలేక కరుణించి ఆ యింట నిలిచిపోతుంది. ఇంత అసహజమైన నవలను చదివాక పాఠకులు పెదవి విరవటమే జరుగుతుంది. వేణుగోపాలరావుగారి

కలంనుండి యిట్టి అపసవ్యమైన నవలలు రాకుండా ఉండాలని ఆశిస్తాము.

## మృత్యుంజయులు

[నవల; రచన : శ్రీ బొల్లిముంత శివరామ కృష్ణ; ప్రచురణ విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్; విజయవాడ–2; 172 పేజీలు; వెల : రూ. 3.]

తెలంగాణా జన జీవితాన్నిగూర్చివచ్చిన వాఙ్మయంలో ప్రజాహృదయాల్ని కదిలించేవీ, ఆ ప్రజల కష్టాలపట్ల కలిగి కన్నీళ్లు పెట్టించేవీ, రచనలువచ్చి పీడకలవంటి వారి దాస్యజీవితం తలచుకొంటేనే భయం పుట్టించేవిధంగా సాహిత్యంలో నిలిచిపోయాయి. కవితామార్గంలో తెలంగాణా ప్రజలగూర్చి ఆరుద్ర, కుందుర్తి, దాశరథి, సోమసుందర్ వంటివారు చిరస్మరణీయమైన కావ్యాలను వ్రాయగా, వచన రచనలో వట్టికోట ఆళ్వారుస్వామి; మహీధర రామమోహనరావుగారలు ప్రసిద్ధులు. శ్రీ బొల్లిముంత శివరామకృష్ణ 'మృత్యుంజయులు' నవలలో తెలంగాణా జీవితాన్ని గూర్చి, వారి కడగండ్లను కళ్లకు కట్టించే విధంగా వ్రాయటానికి ప్రయత్నించారు. వీరీ నవలను 1947 లో మొదటిసారిగా అచ్చువేశారు. అంటే ఆళ్వారుస్వామి, రామమోహనరావుగారలు నవలలు వ్రాయకముందే శివరామకృష్ణగారీ నవలను వ్రాశారనుకొంటాను. శ్రీ తుమ్మల వెంకటరామయ్య 'సమకాలీన తెలంగాణా సమర చరిత్రను ప్రతిబింబించే కావ్యాలు, నాటకాలు, నాటికలు, కథలు ఆనాడెన్నో వచ్చాయి. కాని నవలారూపంలో వచ్చిన మొదటి రచన ఇదే అనుకొంటాను' అని తెలియజేస్తున్నారు. 'రచయిత తెలంగాణా వాసికాడు. పాత్రోచితమైన ఆ ప్రాంతీయభాషను, నుడికారాన్ని, యాసను తక్కిన సొబగులను ఆకళించుకొననిదే రాయ ప్రయత్నించితే అది కృత్రిమం ఔతుంది. అందుచేతనే అలాంటి దుస్సాహసానికి రచయిత ఒడిగట్టలేదు' అని తుమ్మల వారీ నవలలోని భాషను సమర్థించినా, తెలంగాణా ప్రజల జీవితాన్నిగూర్చి వ్రాస్తున్నందున, ఆ ప్రాంతీయ నుడికారాన్ని వాడితేనే రక్తికట్టేది. ఈ నవలను చదువుతున్నప్పుడు, అక్కడ ప్రజల కష్టాలు యీనాటి పాఠకులకు నమ్మశక్యంగాకుండ ఉన్నప్పటికీ, నిజాం పరిపాలనలో ప్రజల కడగండ్లింతకంటె ఘోరంగానే ఉండేవి. దోపిడీలు, మానభంగాలు, కొరడాదెబ్బలు, వెట్టిచాకిరీ, అక్రమమైన అధిక పన్నులు, రైతుల ఎముకల మూల్గుల్లో నవాబు విలాసాలు; యివన్నీ ఆనాటి పరిపాలనలో వాస్తవాలే. కవులూ, రచయితలూ వీటిని అతిశయోక్తులు చెయ్యలేదు. ఇంకా చెప్పవలసివస్తే ఉన్నదున్నట్టుగా వ్రాయటంలో కొంత వెనుకాడేరేమో!

మల్లారెడ్డి బీదరైతు. అతడు దేశముఖు వెంకటరామ నారాయణరెడ్డిగారి భూముల్లో కొద్దిపాటి నేలను సాగుచేసుకొంటూ, మొదటి సంబంధానికి పుట్టిన కొడుకు నర్సిరెడ్డితోను, రెండవ సంబంధానికి చేసుకొన్న భార్య రాములమ్మతోను, కూతురు రాజమ్మతోనూ, శిస్తుకట్టగా మిగిలిన చాలీచాలని ధాన్యంతోనూ జీవనం సాగిస్తూంటాడు. ఆ విధంగాకూడ బ్రతకనివ్వదలచుకోని దేశముఖు, అతడి బంట్లు పటేల్, పట్వారీలూ, అప్పన్నలాంటి నౌకర్లూ మల్లారెడ్డిని చిత్రహింసలకు గురిచేస్తారు. అప్పన్నకూడ కడుబీదవాడే. అయినా తోటి బీదరైతులను ఏడిపించుక తినటంలో పేరుమోసిన మొనగాడు. దేశముఖుగారి సంపదలో గడ్డిపరకను గూడ బీరుపోకుండ కాపాడే కాపలా కుక్క. దేశముఖుగారి సకల వ్యసనాలకూ అప్పన్న తోడ్పాటు ఉంటుంది. ఇటువంటి పేదరైతుల అజ్ఞానాన్ని, దుర్మార్గాన్ని చక్కగా ప్రదర్శించి చూపారు రచయిత.

రోగమొచ్చినా, రొష్టొచ్చినా దేశముఖుగారి పొలాల్లో పనిచేయవలసిందే. కాదంటే అప్పన్నచేత తన్నులు తప్పవు రాములమ్మకు అస్వస్థతగాఉండి పనికిపోలేకపోతే, ముట్టయి మూలకూర్చున్న రాజమ్మను పొలంపనికి లాక్కుపోయి, ఆమె ఆ పరిస్థితిలో పనికి వెళ్ళటానికి సమ్మతించకపోతే ఆమెను దేశముఖుగారి దివాణానికి తీసుకెళ్ళి, కొట్టి అమా

నుషంగా రౌడీలచేత చెరిపించిన ఘనుడు అప్పన్న. ఈ మూరుర్నికూడ దేశముఖు తన స్వార్థానికి వినియోగించుకోక విడిచిపెట్టడు. తనకు పనిలేనప్పుడు కుక్కను కొట్టినట్టుకొట్టి బయటకు పంపగలడు గూడ! అయినా అప్పన్నవంటి బీదవాళ్ళు బీదవాళ్ళను కాల్చుకుతినటం మానరు. దేశముఖు దుర్మార్గాలు, అతడి అనుయాయుల కిరాతక చర్యలూ మితిమీరతాయి. మల్లారెడ్డి శిస్తుకట్టలేక గడువివ్వమని ప్రాధేయపడితే వినకపోగా అతడినికొట్టి బాధిస్తారు. అతడి కొడుకు నర్సిరెడ్డి యీ దురాగతాలను సహింపలేక తిరుగుబాటు చెయ్యాలని ఆవేశం ప్రకటిస్తాడు. కాని కాలం కొంతకాలందాకా కలిసిరాదు. ఆంధ్ర మహాసభ వెలసిన తరువాత పల్లెల్లో జమీందార్ల దౌర్జన్యాలకు గురియౌతున్న, అణచిపెట్టబడిన ప్రజలంతా కిరాతకాల్ని యెదిరించటానికి సంకల్పబలాన్ని పుంజుకొంటారు. ఈ 'సంగ' పోళ్ళ ప్రచారానికి బడాబడా పెత్తందార్లందరూ భయకంపితులౌతారు. సంగాన్ని రూపుమాపటానికి విశ్వప్రయత్నాలు చేస్తారు. కాని సంగం బాలచంద్రునిలాగ దినదిన ప్రవర్థమానవౌతుంగి. నర్సిరెడ్డి నాయకుల్లో వొకడౌతాడు. తిండికిమాడుతూ హైదరాబాదు వీధుల్లో బికారిగా తిరిగిన నర్సిరెడ్డి ఎలాగో నిలదొక్కుకొని, రిక్షాలాగి, తర్వాత ఫాక్టరీలో కార్మికుడై సమ్మెలకు నాయకత్వం వహించి తుపాకి గుండ్లకు తెగించి పోరాడతాడు. నర్సిరెడ్డి పల్లెలో లేని సమయంలో అతని తమ్ముడు ఎల్లారెడ్డి ఊళ్ళో వీరుడై పటేల్, పట్వారీల కెదురు తిరిగి దేశముఖు అధికారాన్ని ప్రశ్నిస్తాడు. మల్లారెడ్డి కుటుంబాన్ని అధికారులు చిత్రహింసలకు గురిచేస్తారు. పటేల్ రాములమ్మను జుట్టుపట్టుకొని బయటకీడ్చి అవమానిస్తాడు మహమ్మదీయ గూండాలను ఉసికొల్పి పటేల్, పట్వారీలు, దేశముఖులు తమకుగూడ ముప్పుతెచ్చుకొంటారు. నర్సిరెడ్డి తిరిగి గ్రామానికి వచ్చేసరికి ప్రజాఉద్యమం వెల్లువగామారి, పోలీసులనూ, అధికార్లనూ,.యెదిరించి గ్రామంనుండి వారందరినీ పారద్రోలారు. మహావీరుడిలాగా నర్సిరెడ్డి ప్రజాఉద్యమంలోనే గుండు:దెబ్బకు గురియై నురిగిపోతాడు. తన తల్లి వొడిలోనే తృప్తిగా కన్నుమూస్తాడు. పల్లెటూళ్ళలో చెల్లని రావుసాహెబ్ వెంకటరామనారాయణరెడ్డిగారు హైద్రాబాదుకు మకాం ఎత్తివేశారు. జాగీర్దార్లు, దేశముఖులు అంతా నగరంలో విలాసాలలో మునిగిపోయి, పాలకవర్గానికి కొమ్ముకాశారు. ప్రజాఉద్యమాలు, ఆంధ్రమహాసభ శ్రమించి సాధించిన, స్వాతంత్ర్యం యీనగాచి నక్కలపాలు చేసినట్లయింది. యీ నవల మళ్ళీ యీ సమయంలో ముద్రించి ప్రచురించటం వలన తెలంగాణా తామే స్వాతంత్ర్యంకోసం పరితపించారో జ్ఞప్తికి తెచ్చినట్లవుతుంది.

ఈ నవలలో భాష విషయంలో ప్రాంతీయపు నుడికారం లోపించినట్లే, పాత్రచిత్రణలోనూ శ్రద్ధ లోపించింది ఉద్యమానికీ, సాంఘిక ప్రయోజనానికీ యిచ్చిన ప్రాముఖ్యం సన్నివేశ కల్పనకీ, సంభాషణలలోని బిగువుకూ యిచ్చినట్లు కానరాదు. సమాజాన్ని ఏవిధంగానూ ప్రతిబింబించని రచనలు విరివిగా వస్తున్న యీ రోజులలో, రెండు దశాబ్దాల క్రితమే జాతి భవిష్యత్తును ప్రగాఢంగా నమ్మి, అందుకోసం మనసా, వాచా, రచనలద్వారా పాటుపడిన రచయిత శ్రమ యీ రచనలో వ్యర్థం కాలేదు.

తెలంగాణా ప్రజల కడగండ్లను భావించుకొని యీ నవల చదివినపిమ్మట ఏ వొక్కరేనా ఆ ప్రజల పట్ల సానుభూతితో వొక్క కన్నీటిబిందువు రాల్చితే రచయిత ధన్యుడే. మరొక అయిదేళ్ళపాటు తెలంగాణా ప్రాంతాన్ని వెనుకబడిన ప్రాంతంగానే పరిగణించాలని ప్రభుత్వం యిటీవలనే ఒక ఆదేశమిచ్చింది. తెలంగాణా ప్రజలు తామెంత వీరోచితంగా పోరాడేరో, యిటువంటి నవలలు చదివి జ్ఞప్తికి తెచ్చుకొని, ముఖ్యంగా యువతరంవారు తమకోసం తమ పెద్దలేవిదంగా పోరాడి మృత్యుంజయులై నిలిచారో తలపోసి, ఆంధ్రదేశ మంతటితోను తమ బంధాన్ని బలీయం చేసికొని, ప్రగతిపథంలో నడవటానికి యీ నవల తోడ్పడుతుంది. ఇటువంటి ప్రయ

శ్రీ పోరంకి దక్షిణామూర్తిగారు రచించిన 'నీడలూ — జాడలూ' అనే నవలలోనూ చేశారు. 'మృత్యుంజయులు' నవల అందమైన ముఖచిత్రంతోగూడ చదువరుల నిట్టే ఆకర్షిస్తుంది.

—రామమోహనరాయ్.

## శ్రీనాథ మహాకవి

(గ్రంథకర్త : విమర్శకాగ్రేసర, శ్రీ బండారు తమ్మయ్యగారు. ప్రతులకు: గ్రంథకర్త, సాలిపేట, కాకినాడ, తూర్పుగోదావరిజిల్లా. మూల్యము : అయిదు రూపాయలు. క్రౌను. పుటలు 241.)

పరమశ్శైవ వాఙ్మయ ధురంధరులయిన శివశ్రీ బండారు తమ్మయ్యగారు తాము 1938 వ సంవత్సరమున యెనుబది పుటల వ్యాసముగా వ్రాసిన విషయమును ముప్పది సంవత్సరముల తరువాత మరియు విస్తరించి మార్పు చేర్పులతో సంతరించి ప్రకరణాత్మకముగా విభజించి శ్రీనాథ మహాకవియను పేర ఈ గ్రంథమును ప్రకటించిరి. ఇందు శ్రీనాథుని దేశకాలములు, కృతులు, వైదుష్యము మొదలుగాగల పదునైదు ప్రకరణము లున్నవి. శ్రీ తమ్మయ్యగారు తామెవరెవరితో ఏ ఏ విషయముతో ఏకీభవించుచున్నదియు, మరి ఏ ఏ విషయములలో ఏకీభవింపనిదియు స్పష్టముగను, సహేతుకముగను ఆయా విషయములు వచ్చినప్పుడు ప్రకటించుచు ఈ గ్రంథమును వ్రాసిరి. ఈ గ్రంథము చదివిన వారికి శ్రీనాథునిగూర్చి శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు, శ్రీ చాగంటి శేషయ్యగారు మొదలయిన పూర్వులు ఏమేమి అభిప్రాయములను వెల్లడించిరో గూడ తెలియగలదు. ఆ విధముగా గూడ నిది చాల విలువయైన గ్రంథము.

శ్రీనాథుని జన్మస్థలము పశ్చిమ గోదావరి జిల్లా నరసాపురము తాలూకాలో సముద్రతీరమున నున్న కాళిపట్టణము. శ్రీనాథుని జన్మకాలము క్రీ. శ. 1365—70 ప్రాంతము. శ్రీనాథుని కృతినాయకులందరును శివభక్తాగ్రేసరులు. మరుత్తరాట్చరిత్ర, శాలివాహన సప్తశతి, పండితారాధ్య చరిత్రము, శృంగార నైషధము, హరవిలాసము, భీమేశ్వర పురాణము, కాశీఖండము, శివరాత్రిమాహాత్మ్యము—ఇది శ్రీనాథుడాయా గ్రంథములను రచించిన వరుస. శ్రీనాథుడు ఇరువది ముప్పది యేండ్ల నడిమివయస్సులో బహుశః పల్నాటివీరచరిత్రమును సంగ్రహముగా రచించియుండును. కాటమరాజుకథ కూడ శ్రీనాథకృతము కావచ్చును. నన్నియకు నారాయణభట్టువలె క్రీడాభిరామరచనమున వల్లభామాత్యునకు శ్రీనాథుడు తోడ్పడి సాయమొనర్చియుండును. శ్రీనాథునకు కనకాభిషేకము చేసినది ఇమ్మడి ప్రౌఢదేవరాయలే. శ్రీనాథుడు శివకవి. శివభక్తి ప్రబోధకములగు గ్రంథములు రచించుటయందు శ్రీనాథున కాసక్తి. శ్రీనాథుని వీరశ్శైవత ఆయన గ్రంథములయందు గోచరించును. శ్రీనాథుని వనబడు చాటువులలో కొన్ని ఆయనవి కావు. శ్రీనాథుని శీలమును చెడగొట్టినది శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు. శ్రీనాథుని గీర్వాణ భాషా పాండిత్య మపారము. ఆంధ్రీకరణ ఫక్కిలో చాల వరకు భారత కవుల మార్గమునే శ్రీనాథు డనుకరించెను. కవిత్వమున సరసత్వమే ఆతని ప్రధాన లక్ష్యము. వక్రత వ్యంగ్యము ధ్వని యనునవి ఇంచుమించుగ పర్యాయపదములు. శ్రీనాథుని హృదయము నలరించు కవితాస్వరూపమాపదములతో చెప్పవలసినదిగా నుండును - ఇవి ఈ గ్రంథమున శ్రీనాథుని గూర్చి శ్రీ బండారు తమ్మయ్యగారు విస్పష్టముగా నిరూపించిన ముఖ్యమైన విషయములు ఇందుకు కావలసిన ఉపపత్తులచేతను, అన్యమతముల నిరసనములచేతను, ఉదాహరణ పద్యములచేతను మొత్తము గ్రంథము మాంసలము చేయబడి నిండుగా నున్నది. శ్రీనాథునిగూర్చి ఇప్పటికి వచ్చిన సర్వసమగ్ర గ్రంథమిదియే కావచ్చు ననిపించుచున్నది. శ్రీ తమ్మయ్యగారు మిక్కిలి కృషిచేసి ఈ గ్రంథమును వెలయించిరి. అందరును అన్ని విషయములలోను శ్రీ తమ్మయ్యగారితో ఏకీభవింపకపోవచ్చును. వచ్చును కాదు. ఏకీభవింపరు. భిన్నాభిప్రాయముల సరళ సుందరమైన ఎదుగుదలయే వాఙ్మయము లక్షణము. శ్రీ తమ్మయ్యగారి కృషిని అందరును ప్రశంసింపదగును ముఖ్యముగా విశ్వవిద్యాలయము తెలుగు పరీక్షలకు పోవు విద్యార్థుల కీ గ్రంథ మవశ్య పఠనీయము.

## వాఙ్మయ వ్యాసమంజరి

(రచయిత: డాక్టరు నేలటూరి వేంకట రమణయ్యగారు; ప్రచురణ: ఆంధ్ర సారస్వత పరిషత్తు, తిలక్‌రోడ్డు, హైదరాబాదు–1 మూల్యము: ఎనిమిది రూపాయలు. డెమ్మీ. పుటలు 363)

సుప్రసిద్ధచారిత్రక పరిశోధకులయిన శ్రీవేంకట రమణయ్యగారు అప్పుడప్పుడు వ్రాసి ప్రచురించిన వ్యాసములు కొన్నింటిని సంపుటీకరించి పరిషత్తువారు ప్రచురించిరి ఇందు మొదటి భాగమున పదమూడు, రెండవ భాగమున ఎనిమిది–మొత్తము ఇరువదియొక్క వ్యాసములున్నవి.

శ్రీ నిడుదవోలు వెంకటరావు పంతులుగారును శ్రీ హయవదనరావుగారును శ్రీపతి పండితుని కాలమును గూర్చి వ్రాసిన వ్రాతలెట్లు అప్రమాణములో నిరూపించుచు శ్రీ వేంకటరమణయ్యగారు శ్రీపతి పండితునికాలమును క్రీ. శ. 1120–1130 ప్రాంతమని నిర్ణయించిరి. గౌరన నివసించిన కాలము కూడ పదునాల్గవ శతాబ్దము ఉత్తరార్థమని శ్రీ వేంకటరమణయ్యగారుపపత్తిని చూపిరి. శ్రీనాథునకు కనకాభిషేకముచేసిన ప్రౌఢదేవరాయలెవరు?ఎప్పటివాడు? అన్న విషయమును శాసనాధారమున పరిశీలించి, అతడు మొదటి ప్రౌఢదేవరాయలనియు, ఆయన క్రీస్తుశకము 1406 లో సింహాసన మెక్కెననియు ఇందొక వ్యాసమున నిర్ధారణము చేయబడినది. జక్కన కవియు పదునాల్గవశతాబ్దము ఉత్తరార్థము వాడనియు, విక్రమార్క రచనాకాలము 1385–90 సంవత్సరముల నడుమ యను సిద్ధాంతమును సోపపత్తికముగనేయున్నది. ఉత్తర నారసింహ పురాణము రచించిన హరిభట్టు కాలమును గురించియు వేంకటరమణయ్యగారు వ్రాసిరి. కృష్ణదేవరాయలవారి తరువాత రాజ్యముచేసిన అచ్యుతదేవరాయలవారి భాషాసేవ విషయము నూత్నము. తెనాలి రామకృష్ణకవి కాలమును గురించియు వ్యాసకర్త పునరాలోచనచేసి వ్రాసిన వ్యాసములు రెండును కలిసి అరువది పుటలున్నవి. చిలుకూరి నారాయణరావుగారి వ్యాసమును విమర్శించుచు వ్రాసినది, బైచరాజు వేంకటనాథుడు అన్నది, కంకంటి పాపరాజు కాలమునుగూర్చియు, విష్ణుమాయావిలాసములను గూర్చియు వ్రాయబడిన రెండు వ్యాసములు అమూల్యవిషయసంకలితములయి యున్నవి. విష్ణుమాయావిలాసములవిూది వ్యాసము ఉండవలసినంత విస్పష్టముగాలేదు. కొంత గందరగోళముగానున్నది. శుకసప్తతిని రచించిన కదిరీపతి దేశకాలములనుగురించిన బహువిషయములతో ఆ వ్యాసము ఆసక్తిజనకముగా నున్నది కుమారసంభవములోని కొన్ని అపపాఠములు అను వ్యాసము, భాస్కర రామాయణ సమస్య అను వ్యాసము రెండును ఆంధ్ర వాఙ్మయమున మిక్కిలి ప్రాధాన్యము వహించిన విషయములను విశదముగా వివేచించి చూపునవి. తెలుగులోగల పద్యకథాకావ్యములను భాషాంతరీకరణములు, అనుకరణములు, స్వతంత్ర రచనములు అని మూడువిధముల వర్గీకరించి ఆయాకావ్యముల కావ్యగౌరవమును ప్రశంసించెడు వ్యాసము ముప్పది పుటలమేర వ్యాపించి స్థూలముగా సర్వసమగ్రమైయున్నది తంజావూరు యక్షగానములను గూర్చిన వ్యాసముగూడ పెద్దది. యక్షగాన స్వరూప స్వభావములను శ్రీ వేంకటరమణయ్యగారు నిశితముగనే భావించిరి. పదునేడవ శతాబ్దినాటి ఆంధ్ర వాఙ్మయ విశేషాలు—జానుతెనుగు అన్న రెండును చిట్టచివరి వ్యాసములు.

శ్రీ వేంకటరమణయ్యగారు చరిత్ర పరిశోధకులలో అగ్రగణ్యులు. వారు ఆంధ్ర వాఙ్మయమునకు, కవుల దేశకాల నిర్ణయము లొనర్చియు, వారి కృతులను పరిశీలించి విశేషములను తెలిపియు, మిక్కిలి సేవ చేసిరి. వారి వ్యాసములు సాహిత్యచరిత్ర విద్యార్థులకత్యంతము కావలసినవి.

## శృంగార గోవర్ధనము

(రచన: శ్రీ చింతలపాటి నరసింహ దీక్షిత శర్మ; తెలుగు పండితుడు. హిందూ హైస్కూలు; సత్తెనపల్లి—గుంటూరుజిల్లా. వెల: రు. 2–50. క్రౌను సైజున 200 పుటలు.)

లక్ష్మణసేన మహారాజు ఆస్థానమున బెంగాలున క్రీ. శ. 12 వ శతాబ్దమున విలసిల్లిన కవి సముదాయములలో గోవర్ధను డొకడు. ఇక మిగిలిన వారిలో జగత్ప్రసిద్ధుడు గీతగోవిందకారుడు జయదేవుడు. హాలచక్రవర్తి సమకూర్చిన గాథాసప్తశతి విూది

మోజాతో గోవర్ధనుడు ఆర్యాసప్తశతిని సమకూర్చెను. ఎవరెవరో వ్రాసిన వాటినుండి హాలుడు ఏడువందలు ఎన్నికచేసి కూర్చినాడు. గోవర్ధను డేడువందలును తానే వ్రాసినాడు. మఱియు వాటినన్నింటిని అకారాదిగా కూర్చినాడు. గాథాసప్తశతివలెనే ఆర్యాసప్తశతియు శృంగార భావాత్మకమైన రచన. గోవర్ధనుని ఆర్యలు కవితా గౌరవమున హాలుని గాథలకు కీసవెలితిపడినను సంస్కృతభాషామాధుర్యమున కమ్ముకొని పోవుచున్నవి. బాణకవి రచనారీతియందు గోవర్ధనున కెనలేని ప్రీతి గలదు.

గోవర్ధనుని ఆర్యాసప్తశతికి ఆంధ్రానువాదమున పేరు శృంగారగోవర్ధనము. శ్రీ చింతలపాటి నరసింహ దీక్షిత శర్మగారు గోవర్ధనుని ఏడువందల ఆర్యలను మిక్కిలిగా తేటగీతి, ఆటవెలదులందును, కొలదిగా కందములందును తెనుగు చేసినారు శ్రీ శర్మగారు సంస్కృతాంధ్రములందు మంచి కృషిచేసినవిద్వాంసులు. తెలుగున ఇంతకు మును పనేక కృతులు రచించి పద్యరచన విషయమున చక్కగా చేయితిరిగినవారు. ఈ శృంగారగోవర్ధనము నందలి పద్యములన్నియు ఆయన స్వతంత్రముగా రచించినప్పటి ఇంపుసొంపులనే గుబాళించుచున్నవి.

> ఇటు లొనర్చుము యని వచియించి వెడలు
> సఖిని గని లేనియలుక మాత్సర్య మొలుకి
> నూచె నవతంసమును; దీప మొక్కసారె
> యారిపోవ, రతోత్కంఠ వహౌర మీఱ.
>
> మానినీ! మానధనుని రోషాన భంగ
> పఱచితివి — సాంత్వనములను సరకు గొనక
> మేల్కొనియె నిద్రితుని భంగి మెలగు నతడు
> మెలకువను గాంచునమ శంక గలదె యింక?

ఈ పద్యములన్నియు ముక్తకములు గనుక దేని కదే గోవర్ధనుని శృంగారరసగుళికలయిన ఆర్యలను శ్రీ నరసింహదీక్షితశర్మగారు రసాత్మ చెడకుండ మరియు పెంపుచేయుచు తెనుగు చేసినారు. సాహిత్యవిద్యాభిమానముగలవారు తప్పక చదివి ఆనందింపవలసిన గ్రంథ మిది.

## సాహిత్యోపన్యాసములు లా.

(ప్రచురణ : ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమి, కళాభవనము — హైదరాబాదు—4. మూల్యము : ఒక రూపాయ)

ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమీవారు చిలకమర్తి లక్ష్మీనరసింహముగారి శతజయంతి ఉత్సవము చేసిన సందర్భమున ఆయననుగూర్చి యిప్పించిన ఉపన్యాసములు నాల్గింటిని కలిపి అచ్చువేసినారు. లక్ష్మీనరసింహముగారి జీవితము, కార్యకలాపములను గూర్చి శ్రీ మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి, చిలకమర్తివారి నాటకములను, ప్రహసనములనుగూర్చి శ్రీ బందా కనకలింగేశ్వరరావు, చిలకమర్తివారి వచన రచనలను గూర్చి శ్రీ రావూరి సత్యనారాయణరావుగారలు వ్రాసిరి. మొత్తమున్నివ్యాసములు కలిసి డెమ్మీ సైజున నలుబదియైదు పుటలు. అందులో పన్నెండు జీవిత విశేషములు. ఇక మిగిలిన ముప్పది మూడు పుటలలో రచనల సమీక్ష. లక్ష్మీనరసింహము పంతులుగారి రచనలను కూలంకషముగా చర్చించుటకు ఉపన్యాసకులు పెట్టుకొనలేదు. పెట్టుకొని యుండవలసినది సాహిత్య అకాడమీఉపన్యాసములు ప్రామాణికముగా నుండుట అవసరము. అవకాశమున్నంతలో శ్రీబందావారు, శ్రీ రావూరివారు తమ విధిని నిర్వహించినారు. లక్ష్మీనరసింహముగారి నాటకములలో భక్తిభావమెక్కువ యని శ్రీ బందావారు గుర్తించినది సముచితముగనే యున్నదనవలయును. విపులముగా చర్చింపక పోయినను చిలకమర్తివారి 'మణిమంజరి' నవలను గూర్చి శ్రీ రావూరివారు వెలిబుచ్చిన అభిప్రాయము ఆ గ్రంథమును తూచి చెప్పినట్లున్నది. చిలకమర్తివారి జీవిత విశేషములను చక్కగా ఎన్నికచేసి శ్రీ మధునాపంతుల సత్యనారాయణశాస్త్రిగారు సముచితముగా నిరూపించినారు.

## వ్యాసావళి

[కృతికర్త : కవికోకిల అవంత్స వేంకటరంగారావు; ప్రతులకు: కృతికర్త, విజయనగరము — 2. మూల్యము : రెండున్నర రూపాయలు.]

శ్రీ ఆవంత్స వేంకట రంగారావుగారు మొదటి తరము నవ్యకవుల కవితా విన్యాసముల జాడనుబడి కవియై విమర్శకుడు కూడ అయిన వ్యక్తి. ఆయన అప్పుడప్పుడు వ్రాసిన వ్యాసముల సంపుట మిది. ఇందు మొత్తం మేడు శీర్షిక లున్నవి. ఒకటి ఉప వ్యాసము. మరొకటి పిచ్చాపాటి రచన. అది స్వవిషయముకూడ. మరియు నది అచ్చువేయదగి నంతటిదియునుకాదు. ఇక మిగిలినఅయిదు కాల క్రమము ననుసరించి 1927, 1931, 1954, 1962, 1964 సంవత్సరములలో వ్రాయబడి నవి. ప్రకటింపబడినవి.

శ్రీ రంగారావుగారికి శ్రీ రాయప్రోలు, శ్రీ విశ్వ నాథ, శ్రీ దువ్వూరి రామిరెడ్డి చాల ఇష్టమైన కవులు. 1927 లో వ్రాసినది రెడ్డిగారి వనకుమారి కావ్యమును గురించియే. 1931 లో వ్రాసినది మధురావిజయ మను సంస్కృత కావ్యమును గూర్చినది. దేశాభిమానము : కవిత్వము, కావ్యము – అభ్యుదయము, నా కవిత్వంవిూద రాయప్రోలు సుబ్బారావుగారి కవిత్వ ప్రభావం—అన్న మూడును క్రమముగా తరువాతి సంవత్సరాలలో వ్రాయబడినవి పుస్తకములో అచ్చు వేయబడిన క్రమమిది కాదు.

శ్రీ వేంకట రంగారావుగారు తనను తాను సవిమర్శకముగా చూచుకొనగలుగుటయే విశేషము. ఆ పని చేయగలవాడు నూటికి కోటికి ఒకడుండును. తాను శ్రీ రాయప్రోలు సుబ్బారావుగారివలన ఎంతగా ప్రభావితుడైనప్పటికిని తన కవితాత్మ తత్త్వము మాత్రము రామిరెడ్డిగారిదని కచ్చితముగా చెప్పగల సూక్ష్మవివేచనగల వ్యక్తి. ఈయన వనకుమారి కావ్యము విూద వ్రాసిన వ్యాసము సహృదయుడు కావ్యరసమును ఆస్వాదించుచు పలికిన పలుకులు. కవి హృదయమును శ్రీ రంగారావుగారెంత దగ్గరగా అర్థము చేసి కొన్నదియు ఆ వ్యాసము చూచిన రామిరెడ్డిగారు వ్రాసిన లేఖవల్ల తెలియగలదు. ఆ లేఖకూడ వ్యాసము చివర ముద్రింపబడినది. దేశాభిమానము—కవిత్వము; కావ్యము—అభ్యుదయము అన్న శీర్షికలతోడి వ్యాసములు రెండును శ్రీ రంగారావుగారి ప్రాచ్యపాశ్చాత్య వాఙ్మ యములతోడి సన్నిహిత పరిచయమును, పదవగాహన మును, సముచిత నిరూపణమును ప్రదర్శించునవి ఈ రెండు వ్యాసములును ఆయనను సాహిత్యతత్త్వజ్ఞు డుగా నిలబెట్టగలవి.

## మాతృ వందనము

(రచన: శ్రీ వఝ్ఝలవేంకటేశ్వర్లు. ప్రతులకు: హితకారిణీ సమాజము, రాజమహేంద్రవరము. మూల్యము : మూడు రూపాయలు.)

ఇదియొక 'స్వతంత్ర సాంఘిక మాలికా కావ్యము'. సాంఘికమైన కథావస్తువు స్వతంత్రముగా కల్పింపబడినది అది మాలికా రూపమున రచింపబడిన పద్యములలో కూర్పబడినది. ఇంతకు పూర్వము మాలికా రామాయణమని ఒక గ్రంథము వచ్చినది. అది ఒక్కొక్కకాండ ఒక్కొక్క వృత్తములో వ్రాయ బడినది ఇవుడు శ్రీ వఝ్ఝల వేంకటేశ్వర్లుగారు వివిధ ములగు ఛందముల‌ను మాలికలుగాచేసి ఈ కావ్య మును చేసినారు ఒక్కసీసపద్యము విషయమునను, కందమువిషయమునతప్ప మిగిలిన అన్ని పద్యములను మాలికలుగానే రచించిరి. ఈ కావ్యము వీరేశ లింగముపంతులుగారికి అంకితము చేయబడినది.

వసంతుడు — మధుసూదనుడు ఇరువురును మిత్రులు వసంతుడు దేశాభిమానము గలవాడు స్వాతంత్ర్య పిరుడు. అసహాయోద్యమము సాగుచున్న దినములలోవాడు. మధుసూదనుడు సంస్కరణాభిలాషను ప్రకటించువాడు. శీల మంత మంచిది కాని వాడు. ఒక వితంతువును, మొదటివివాహమును కాదని పెండ్లాడినాడు. వసంతుడు జాతీయ పోరాటములో కారాగారమున బంధింపబడియున్న కాలమున ఆయన భార్యను మనోరమను చెడ్డుత్రోవకు త్రిప్పుటకు ప్రయత్నించినాడు. చివరకు వసంతుడు జైలునుండి తిరిగివచ్చినప్పుడాయనకు మనోరమ సౌశీల్యమును గురించి అపోహను కల్గించి వారి అన్యోన్యమును భంగము చేసినాడు. దాని ఫలితముగా మనోరమ గోదా వరిలోపడి ఆత్మహత్య చేసికొనినది. వసంతుడు మతి చెడి పిచ్చివాడై పోయెను. మధుసూదనుడుకూడ ఆరో గ్యము చెడి చచ్చిపోయెను. మధుసూదనుని వితంతు భార్య ప్రియంవద 'మాతృసేవా కుటీరము' స్థాపించి అనాథ బాలబాలికల కుచిత విద్యాదానము చేయ

సాగెను. మధుసూదనుని మొదటి భార్య, తల్లి దండ్రులు అందరును అచటకుచేరి సంఘసేవా పరాయణులై బ్రతుక సాగిరి. మధుసూదనుని కూతురు వాసంతి. వైద్యశాస్త్రమున పట్టభద్రురాలు. వసంతుని కుమారుడు మాధవుడు. విజ్ఞాన శాస్త్రమున పట్టభద్రుడు. వారిరువురకు ఆ మాతృసేవా కుటీరముననే వివాహము జరుగును. ఈ విధముగా కథ సుఖాంతమయినది.

ఇంతకు నిదియొక నవలవలె నున్నది. అయినను ప్రబంధమువలె తీర్చి దిద్దబడినది. కథారంగము విశాఖపట్టణము రాజమహేంద్రవరములకు ఎడనెడ మారుచుండును. 1. చిననాటి చెలిమి. 2. జవ్వనపు వలపు. 3. ఎడబాటు కీడు. 4. అపదూఱుచేటు. 5. మతిచెడ్డ బ్రతుకు. ఈ అయిదు శీర్షికలుగా ఇతివృత్త విభజనము జరిగినది. శ్రీ వేంకటేశ్వర్లు గారిది ఆశుకవితాధార. సంస్కృతాంధ్రములు రెండును ఆయనకు వశములు. ఇప్పటికే అనేక కృతులు రచించినవారగుటచేత పద్యరచనమున ఆరి తేరినవారయిరి.

'సద్యోవిస్తృత చకురాస్తిమిత
పశ్యత్తారకాద్వంద్వమై
యుద్యత్కంపన నాసికాపుట
భవిష్ణూచ్ఛ్వాసనిశ్వాసమై
స్విద్యత్ఫాలకపోల మండలతటీ
వేల్లద్భ్రుకుట్యోష్ఠమై
విద్యుచ్ఛక్తి పటిష్ఠ వాగ్ఘర
సహోద్భిద్యత్స్వన ద్వ్యక్తమై
తద్యోషా వదనంబు కించి
దువలబ్ధద్యోతి తారుణ్యమై
యాద్యాశ్చర్య పరక్రుధానుగ ఘృణా
వ్యాపార సంయోగ సం
పాద్యంతః కరణానురూపమగు
భావస్ఫూర్తి పాటించెడిన్.'

ఇది సంస్కృత రచన.

'ఉండనె యుండడింట, నెపు
డో యరుదెంచిననైన మాటలా
డం, డొకనాడు నెంగిలి ప
డం, డొకవేళ పడందలంచి కూ
ర్చుండియు తిన్నగా దినుటె
ఱుంగడు; రాతిరు లింటిపట్టునన్
బండుకొనంగరాడు, మఱి
వచ్చిన నే నడురేయియందొ
యొక్కండొక సెజ్జపై విసువు
గా మెయిదాలుచు, నిట్టు లవ్వసం
తుండు దినాలు పుచ్చగ మ
నోరమ యోరిమి బూని యాత్మనా
థుండు నిజం బెఱుంగునని
దోష మెఱుంగని తన్ను నింక నె
న్నండొ యనుగ్రహించునని
నమ్మకముం గొనియుండెనయ్యెడన్.'

ఇది తెనుగు రచన. గ్రంథమంతయు నెక్కువగా తెనుగు రచనయే. ధార ఆశుధార అగుటచేత 'చిన్ననాటినుండిందనకన్నవోలె' 'తావక హృత్కవాట మున్ తెఱచుము' 'వీ కపాలముననే పుట్టిండనా కాక' ఇట్టి సరస సముచితములుకాని ప్రయోగములు చోటు చేసికొన్నవి. ఈ నెరసులు గ్రంథ గౌరవమును తగ్గించునంత ఎక్కువగా లేవు మొత్తము వీూద శ్రీ వేంకటేశ్వర్లుగారి ఈ మాతృవందనము ఒకవిధమైన క్రొత్తదనముతోడను, చమత్కారముతోడను, ప్రౌఢిమతోడను, మాధుర్యముతోడను రసవంతమై మనోహరముగా నున్నది ఆధునికాంధ్ర కావ్యకృతులలో నిదియు ఎన్నిక చేయదగిన కొన్నింటిలో నొకటి.

—క్షేమేంద్ర.

## పాయసం తాగిన పిచిక

పిల్లలకథలు, మూలం—శ్రీ సోమశర్మ. అనువాదం—శ్రీ వాకాటి పాండురంగరావు. పుటలు - 56 వెల : 1-50 ప్రాప్తిస్థానం — ఎం. శేషాచలం అండ్ కో, మచిలీపట్నం, మద్రాసు, సికిందరాబాద్.

## నిత్యజీవితంలో నీరు

పిల్లల పుస్తకం రచన—శ్రీ కె యస్. రెడ్డి. పుటలు—72 వెల : 1-75 ప్రాప్తిస్థానం — విశాలాంధ్రప్రచురణాలయం. ఏలూరు రోడ్డు, విజయవాడ—2.

## శ బ్ద ము

పిల్లలకు శబ్ద విషయాలు సరళంగా తెలిపే పుస్తకం. రచన -- శ్రీ కె. ఎస్. రెడ్డి. పుటలు—62. వెల : 1–50 ప్రాప్తిస్థానం—విశాలాంధ్ర ప్రచురణాలయం, ఏలూరురోడ్డు, విజయవాడ.

## ధూ ర్తా య ణ ం

సమాజంలోని అవినీతిని విమర్శించే వ్యంగ్య గేయ సంపుటి. రచన—శ్రీ మురారి. పుటలు—60. వెల : ఒకరూపాయి. ప్రాప్తిస్థానం — విశాలాంధ్ర పబ్లిషింగ్‌హౌస్, ఏలూరురోడ్డు, విజయవాడ–2.

## సృజన జన్మదిన సంచిక

సాహిత్య త్రైమాసపత్రిక జన్మదిన సంచిక. మా కార్యాలయం చేరింది దీనిలో బుచ్చిబాబును గూర్చి ప్రత్యేక రచనలున్నాయి. పుటలు—84 వెల : రూపాయి. ప్రాప్తిస్థానం—శ్రీ వరవరరావు జడ్చర్ల, మహబూబ్‌నగర్ జిల్లా.

## ఆచార్య జగదీశ చంద్రబోసు

పద్యకావ్యం. రచయిత — ప్రతివాదిభయంకరం వేదాంతాచార్యులు. పుటలు—214. వెల—5–00. ప్రాప్తిస్థానం — శ్రీ ప్రతివాదిభయంకరం వేదాంతాచార్యులు, 7804 లాలాగుడిబజార్, సికింద్రాబాద్; శ్రీరామా బుక్‌డిపో, మార్కెట్టువీధి, సికింద్రాబాద్.

## త్రి వే ణి

మూడు సంస్కృత ఖండకావ్యాలు—ప్రవర వరూధినీయం, భర్తృహరిచరితం, కబీరచరితం—గల సంపుటి. రచయిత శ్రీ సన్నిధానం సూర్యనారాయణ శాస్త్రి. పుటలు—86. వెల—2–50. ప్రాప్తిస్థానం — శ్రీ సన్నిధానం సూర్యనారాయణశాస్త్రి, 44 జీరా, సికింద్రాబాద్.

అనువాదం యథామూలంగా, మధురంగా సాగింది. 'ఇంతలు కన్నులుండ తెరువెవ్వరి వేడెద' అనే పద్యం అనువాదం మచ్చుకు :–

'కాం వంధాన మిహోవ యాచసి పథః
స్వైతావతీ చక్షుషీ
త్వం సల్లాపయసీవ కైతవతయై
కాంతస్థితం యరౌవతం
నైతావచ్ఛ నవేత్సి వర్త్మ కిము యే
నాయాస్త్వ మేనం గిరిం
నిశ్శంకం పరిపృచ్ఛయా తిలఫుయ
స్యస్మాన్ కుతో న్యధ్వచః'

## పిల్లలున్న యిల్లు మల్లెపూల జల్లు

పిల్లల పుస్తకం. రచయిత — మసూనా, పుటలు—48 వెల : 0–75 ప్రాప్తిస్థానం— విశాలాంధ్ర పబ్లిషింగ్‌హౌస్, ఏలూరురోడ్డు, విజయవాడ–2.

## సవరి రామాయణం

పుటలు—12. వెల : లేదు. ప్రాప్తిస్థానం— శ్రీ ఆంజనేయస్వామి వారి దేవస్థానం, మండపేట. తూర్పు గోదావరిజిల్లా.

## శ్రీశ్రీ కాంతా ప్రస్థానం

విమర్శ, రచయిత—శ్రీ అద్దేపల్లి రామమోహనరావు. పుటలు—150. వెల : 3–00 ప్రాప్తిస్థానం—ప్రభాకర్ పబ్లికేషన్స్, నందిగామ, కృష్ణా జిల్లా.

Printed and Published For Nageswara Rao Estates (Private) Ltd., by Radhakrishna at the Andhra Patrika Press, 6 & 7, Thambu chetty Street, Madras-1.
Editor : S. Sambhu Prasad.